ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము-౧౮.

శ్రీరస్తు.

# చంద్రభాను చరిత్రము.

ఇది

తరిగొప్పుల మల్లనమంత్రి విరచితము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికనుండి
పునర్ముద్రితము.

మొదటికూర్పు ౫౦౦ ప్రతులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాల
చెన్నపురము.

౧౯౨౨.

వెల, రు. ౧-౦-౦.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము-౧౮.

శ్రీరస్తు.

# చంద్రభాను చరిత్రము.

ఇది

తరిగొప్పుల మల్లనమంత్రి విరచితము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికనుండి
పునర్ముద్రితము.

మొదటికూర్పు ౫౫౦ ప్రతులు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే ప్రకటింపఁబడినది.

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాల
చెన్నపురము.

౧౯౨౨.

వెల, రు. ౧-౦-౦.

# విషయసూచిక.

# సవరణలు.

| పుట. | పంక్తి. | ఉన్నది. | దానిసవరణ. |
|---|---|---|---|
| 1 | 3 | దివ్యాకృతిఁ | దివ్యాకృతి |
| 2 | 15 | గర్భశోభన | గర్భశోధన |
| 17 | 5 | బొత్తులోఁ | బొత్తులలోఁ |
| 19 | 26 | దీపించియుఁ గువలయ | దీపించి కువలయా |
| 31 | 21 | క్రీళ్లు | క్రేళ్లు |
| 34 | 18 | యారగించె | యారగించి |
| 35 | 8 | యడఁచినారలు | నడఁచినారలు |
| 35 | 23 | సంయమిమీ | సంయమినీ |
| 36 | 16 | తాపకొరుఁడు | రాకొమరుఁడు |
| ,, | 26 | (మొదట) | సీ. |
| 37 | 12 | గురుఁడు | గురుఁడుఁ |
| ,, | 13 | కవియు | గవియు |
| ,, | 24 | శ్రుత | శ్రుతి |
| 38 | 2 | యొరఁగు | యొరగు |
| ,, | 20 | తనయుఁడధిక | తనయుఁడక్షిక |
| ,, | 22 | కిసలయ | కిసలయ |
| 39 | 6 | కడుపలో | కడుపులో |
| ,, | 10 | స్థితి . . . చను | స్థితి... లేమిచను |
| 42 | 5 | యొరఁగంబడి | యొరగంబడి |
| ,, | 6 | బీటలసందు | బీఁటలసందు |
| 43 | 9 | తెర్థిక | తైర్థిక |
| ,, | 22 | స్థాణుల్ | స్థూణల్ |
| 44 | 16 | మేపారలో | మేపారలా |
| ,, | 23 | పుండరికంబు | పుండరీకంబు |
| ,, | 29 | బ్రహ్మన | బ్రహ్మకైన |
| 45 | 12 | బోతె | వోతె |
| 47 | 3-4 | గంధవహుఁ డుబె | గంధవహుఁ డుఁజె |
| ,, | 14 | నెస్యాన | నెక్యాన |
| 48 | 25 | లించి | గిలించి |
| 51 | 28 | నోఁపనిలజ్జ | నోపనిలజ్జ |
| 52 | 3 | వెఱగంద | వెఱఁగంద |
| ,, | 11 | గారులు | గాఱులు |
| 62 | 27 | మాలినిని | మాలిని |
| 67 | 27 | నభోవీథి | నభోపీథి |
| 70 | 16 | నేర్చుచుండె | నేర్పుచుండె |
| 76 | 16 | కేకినీ | కేకిని |
| 78 | 14 | నమ్ముగద | నమ్ముగుద |
| 79 | 18 | గాఁనేజెఁ | గానేజెఁ |
| 90 | 10 | చూపుబయట | చూపు బట్టబయట |
| 92 | 11 | దంష్టాగ్ని | దంష్ట్రాగ్ని |
| 97 | 20 | భవద్రుచిం | భవద్రుచి |
| 98 | 11 | గదెయ్య | గవయ్య |
| 109 | 17 | తీర్థపరక్తుల | తీర్థపంక్తుల |
| 112 | 28 | మెట్టు | మెట్ట |
| 113 | 1 | యసదుదీవియ | యసదుఁదీవియ |
| ,, | 25 | నంతట | లంతట |
| 115 | 23 | తోఁ భాషిం చుట | తోభాషించుట |
| 117 | 16 | కృధావ్య[illegible] | క్రుధావ్య[illegible] |
| ,, | 18 | మరలెఁ | మరలెం |
| 126 | 10 | బ్రార్థితసాంగ | బ్రాణీతసాంగ |
| 127 | 2 | దలచి | దలఁచి |
| 128 | 27 | చాఁటునన్ | చాటునన్ |
| ,, | 28 | సిగుస్తం | సిగ్గునం |
| 129 | 2 | గార్యగౌరవము | గా[illegible]గౌరవము |
| 2 | 2 | దప్పసాహాప్తికిన్ | వీనికి గీటు క్రింది |
| 3 | 20 | 5పారంబున | పాఠము లేవాడుట |
| 6 | 17 | గోత్రశేఖర | లెస్స. |



మ - 1

శ్రీరస్తు.

# పీఠిక.

---

చంద్రభానుచరిత్రమును రచించినకవి తరిగొప్పుల మల్లనమంత్రి. ఈతఁడు ఆఱువేలశాఖలోని వాఁడు. మధ్వమతస్థుఁడు. స్వతంత్రకపిసగోత్రుఁడు. తండ్రి నృసింహాఖ్యుఁడు. తల్లి తిప్పాంబ. జన్మస్థాన మేదియో తెలియదు గాని కృతి రచించుకాలమునఁ జంద్రగిరి నివాసముగా నున్నవాఁడు. తనకృతిని మానూర పురమునందు వెలసిన దత్తాత్రేయదేవున కంకితము చేసెను. ఈదేశమం దిప్పు డాఱువేలవారి నాఱువేలనియోగు లనుట యాచార మై యున్నది. ఈశాఖ వారు కొందఱు పూర్వము కర్ణాటదేశమునకు వెళ్లి యచ్చట రాజకీయాదిపదవుల సంపాదించి ప్రసిద్ధివడసిరి. వారిలోఁ గొందఱు మధ్వమత మవలంబించిరి. కావున వీరి నాఱువేలమాధ్వు లనవచ్చును. ఇట్టివా రిప్పుడును మైసూరు రాజ్యమునం దనేకులు గలరు. సుప్రసిద్ధు లగు దివాను పూర్ణయ్యగారి కుటుంబము కూడ నిట్టిదే. వీరు వేఱు నాఱువేలనియోగులు వేఱు నని గ్రహించునది.

కాలనిర్ణయము:— మల్లనకవి రాయనమునగను సీతని యన్నయగు దత్తనామాత్యుఁడు ప్రధాని (కార్యకర్త) గను గర్ణాటప్రభువగు వేంకటపతిరాయుల యాస్థానమందు నియుక్తు లయి యున్నట్లు గ్రంథమువలనఁ దెలియుచున్నది. ఈవేంకటపతిరాయలు క్రీ. శ. ౧౫౮౬ మొదలుకొని ౧౬౧౪-వ సంవత్సరము వఱకు రాజ్యము చేసెను. ఈగ్రంథము ౧౬౦౦-వ సంవత్సరప్రాంతమున రచింపఁబడిన దని యూహింపవచ్చును.

వేంకటపతిరాయలకు వీరవేంకటపతిరాయ లను పేరు గూడఁ గలదు. ఈతఁడు వసుచరిత్రకృతిపతి యగు తిరుమలరాయల చతుర్థపుత్త్రుఁడు. తిరుమలరాయలు కృష్ణదేవరాయని యల్లుఁ డయిన యళియరామరాజు తమ్ముఁడు. వీరికి వేంకటాద్రి యనునొకతమ్ముఁ డుండెడివాఁడు. వీరుముగ్గురును తుళువవంశపు రాజులలోఁ గడపటివాఁ డగు సదాశివదేవరాయలమంత్రులును గార్యకర్తలుగ నుండిరి. క్రీ. ౧౫౬౫-వ సంవత్సరములో జరగిన తాళికోట యుద్ధములో

రామరాజు మృతినొందెను. పిదపఁ దిరుమలరాయలు సదాశివదేవరాయని ముఖ్యమంత్రిగ నుండి క్రీ. ౧౫౭౦-వ సంవత్సరప్రాంతమందు సదాశివదేవ రాయలుమరణింపఁగాఁ దానారాజ్యము నాక్రమించుకొని రా జయ్యెను. క్రీ. ౧౫౭౪-వ సంవత్సరములోఁ దిరుమలరాయని ద్వితీయపుత్త్రుఁడు రా జయినట్లు శాసనములవలనఁ గనఁబడుచున్నది. కావునఁ దిరుమలరాయలు మూఁడుసంవత్స రములకంటె నెక్కువకాలము రాజ్యము చేసిన ట్లగపడదు. తాళికోటయుద్ధా నంతరము తురుష్కులు కర్ణాటరాజధాని యైనవిజయనగరముపై దండెత్తి వచ్చి యానగరమును బాడుచేసి యుండుటచేఁ దిరుమలరాయలు, అనంతపురమండ లములోని పెనుగొండను దనరాజధానిగాఁ జేసికొనియెను. తిరుమలరాయనికి రఘునాథరాయలు, శ్రీరంగరాయలు, రామరాయలు, వేంకటపతిరాయలు నని నలుగురు కొడుకు లుండిరి. రఘునాథరాయలును రామరాయలును రాజ్యము చేసినట్లు కనఁబడదు. తిరుమలరాయల పిదప శ్రీరంగరాయలును నాతనితరువాత వేంకటపతిరాయలును రాజు లయిరి. శ్రీరంగరాయల రాజ్య కాలములో విజాపురపుఁ దురుష్కరాజులు పెనుగొండ నాక్రమించుకొనుటచేఁ జిత్తూరుజిల్లాలోని చంద్రగిరి కర్ణాటరాజ్యరాజధాని యయ్యెను. వేంకటపతిరా యలు రాజ్యమునకు వచ్చినప్పటి కిదియే రాజధానిగా నుండెను గాని,

> "తనకు వేలూరు వరరాజధానిగాఁగ, వీరవేంకటపతిరాయవిభుఁడు మిగుల
> ధరణిఁ బాలించె ధర్మతత్పరతఁ జెలఁగి"

అనురామరాజీయ పద్యమును బట్టి యాతనికాలములో రాజధాని యుత్తరా ర్కాడు మండలములోని వేలూరునకు మార్పఁబడినట్లు కనఁబడుచున్నది. ఈహేతువుచేతనే యీపట్టనమునకు రాయవేలూ రను పేరు వచ్చినది.

వసుచరిత్రకాలమునకును జంద్రభానుచరిత్రకాలమునకు నంతర మెంత గలదో చూతము. క్రీ. ౧౫౭౪-వ సంవత్సరమునకుఁ బూర్వమే తిరుమలరాయల రాజ్యకాలము ముగిసినందున నాతని కంకితము చేయఁబడిన వసుచరిత్రము క్రీ. శ. ౧౫౭౨-వ సంవత్సరప్రాంతమందుఁ బుట్టియుండె ననియు దీనిపిదప నించు మించుగా ముప్పదిసంవత్సరములకుఁ జంద్రభానుచరిత్రము పుట్టియుండు ననియు నూహించుట సమంజసముగాఁ దోఁచుచున్నది.

వసుచరిత్రములోని కృతిపతి వంశావతారసన్నన పద్యములంబట్టి తిరుమల దేవరాయల రాజ్యకాలమందు శ్రీరంగరాయలు యువరాజుగ నుండె ననియు,

రామరాయలు శ్రీరంగపట్టనరాజ్యమును వేంకటపతిరాయలు చంద్రగిరి రాజ్యమును బాలించుచుండి రనియుఁ గాన్పించుచున్నది. మఱియును శ్రుతి రంజని యను గీతగోవింద వ్యాఖ్యలో—

"జయతి తిరుమలేంద్ర స్తేషు విఖ్యాతకీర్తిః
నమదరినృపమౌళిస్తోమనీరాజితాంఘ్రిః
సుగుణ నుతచతుష్క న్యస్తరాజ్యాతిభారః
కృతబుధవరవిద్యాగోష్ఠిగత్యార్జితశ్రీః"

అనియున్నది. ఈపద్యముల నాధారము చేసికొని శ్రీరంగరాయలు రాజైన తరువాతఁ గూడఁ దిరుమలరాయలు కొంతకాలము జీవించియున్నాఁ డనియు వసుచరిత్రము క్రీ. ౧౫౭౨-వ సంవత్సరము తరువాతనే పుట్టిన దనియుఁ గొంద ఱూహించుచున్నారు. కాని, యిది యుక్తము కాదు. శ్రుతిరంజనీపద్యభావము తిరుమలరాయలు రాజుగా నుండియే రాజకార్యములఁ గొన్నిటిని గొడుకు లచేఁ జేయించి తాను విద్యాగోష్ఠియం దెక్కువకాలము వినియోగపఱుచు చుండె నని యే కాని రాజ్యమును వదలుకొన్నాఁ డని కాదు. "నమదరినృప మౌళి స్తోమనీరాజితాంఘ్రిః" అనువిశేషణ మీయూహను బోషించుచున్నది. తిరుమలరాయలు రాజ్యము వదలుకొన్నమాటయే నిజమైనయెడల నారాజ్య మొక్కకొడుకునకె గాని నలుగురకు సంక్రమింపదు. వసుచరిత్రపద్యము లీయర్థమునే దృఢపఱుచుచున్నవి. తిరుమలరాయల కాలములో శ్రీరంగరాయలు యువ రాజుగను రామరాయలు శ్రీరంగపట్టనరాజ్యాధికారిగను వేంకటపతిరాయలు చంద్రగిరి రాజ్యాధికారిగ నుండి రని యున్నది. వా రారాజ్యకార్యములను దిరుమలరాయల యాజ్ఞానుసారముగనే నెఱవేర్చుచుండి రని నిర్ణయింపవలసి యున్నది. యువరాజు రా జగునా? కాఁబట్టి తిరుమలరాయలు క్రీ. ౧౫౭౨-వ సంవత్సరమునకు ముందే చనిపోయినాఁ డనియు వసుచరిత్ర మంతకుఁ బూర్వమే పుట్టిన దనియు సిద్ధాంతీకరింపవచ్చును.

వేంకటపతిరాయల యాస్థానమం దనేకులు పండితులుఁ గవులు నుండిరి. తిరుమల తాతాచార్యులు, కందాళ అప్పలాచార్యులు సను వైష్ణవాచార్యులు వేంకటపతిరాయల మతగురువులుగా నుండిరి. సుప్రసిద్ధుఁ డగు నప్పయదీక్షితులు గూడ నీకాలపువాఁడే. ఈయన వేలూరుసామంతరాజైన చినబొమ్మనాయఁకుని యాస్థానవిద్వాంసుఁడుగా నుండి రాయలచేతఁ గూడ గౌరవింపఁబడుచుండెను.

ఈయన కువలయానంద మను నలంకారగ్రంథమును వేంకటపతిరాయల నియోగము చేత రచియించిన ట్లాగ్రంథమందలి

“అముం కువలయానంద మకరో దప్పదీక్షితః
నియోగా ద్వేంకటపతే ర్నిరుపాధికృపానిధేః”

అనుశ్లోకమువలనఁ దెలియుచున్నది. తెనాలి రామకృష్ణకవి, చిన్ననారనకవి, మట్లి అనంతభూపాలకవియు నీకాలమువారే.

కృతివిషయము:—శ్రీకృష్ణునకు సత్యభామయం దుదయించిన చంద్రభానుఁడు. రుక్మబాహునికూఁతు రగుకుముదిని యనుకన్యకను వివాహమైనకథ యిందు వర్ణింపఁబడినది. ఈకథకు మూల మేపురాణమం దున్నదో. జటప్రోలుసంస్థానాధిపతి యగు శ్రీసురభిమాధవరాయ లను కవిరాజు చంద్రికాపరిణయ మను నొకప్రబంధరాజమును రచియించెను. దానికిని జంద్రభానుచరిత్రమునకును బోలికలు విశేషముగా నుండుటచే మాధవరాయలగ్రంథమును జూచి మల్లనకవియో మల్లనకవిగ్రంథముం జూచి మాధవరాయలో నిర్మించి యుందు రని తోఁపకమానదు. కృతినామమునఁ జంద్రపదము రెంటను గలదు. చంద్రికాపరిణయము నందలి నాయకుఁడు సుచంద్రుఁడు. చంద్రభానుచరిత్రము నందలినాయకుఁడు చంద్రభానుఁడు. అందలినాయిక చంద్రిక, యిందలినాయిక కుముదిని. చంద్రిక పూర్వభవమునఁ జిత్రలేఖయనునచ్చర; వసంతుఁ డను మునివరు తపంబునకు భీతిలిన వలవ పంపునఁ దపోవిఘ్న మొనరింప నేగి పూనిన పని సేయఁ జాలక యామునిచే శప్తయై మానుషలోకంబున జనించినది. కుముదిని పూర్వజన్మమునఁ జంద్రకళ యనునచ్చర; భరద్వాజముని తపోభీతిచేఁ ద్రస్తుఁడగు సురరాజు నానతిని దపోంతరాయం బాపాదించి శపింపఁబడి నరలోకమునఁ జనియించినది. చిత్రలేఖకు శతసహస్రవర్షంబులు మాత్రమే మనుష్యజన్మమును బిదప దేవత్వమును ముని నిర్ణయించెను. చంద్రకళ కట్లు మనుష్యజన్మమోక్ష మనుగ్రహింపఁబడలేదు. కావుననే కుముదినికి వీణనేర్ప సురరాజు తుంబురు నంపి దివ్యగానము నేర్పించుటయే గాక స్వర్గవాసవరఫల మగు పారిజాతతరువునకు నిలయ మగుసత్యభామకుఁ గోడలిఁగా ఘటియించెను. చంద్రభానుచరిత్రములోని నాయకుఁ డొకపరి మృగయావినోదంబు సలుపుచున్న తఱిఁ దుంబురునిస్నేహితుఁడు సిద్ధుఁ డొకఁ డేతెంచి మార్గమధ్యమం దున్న చంద్రభానునికిఁ దుంబురునియుఁ గుముదినియు వృత్తాంతముల వర్ణించి పోయెను. చంద్రికాపరిణయనాయకునకు శాండిల్యుఁ డనుముని దేశమ్మునఁ బంపాపుర

విఘాతమ్మున కేగుమార్గమునఁ గుముదుఁ డను శాపోపహతగంధర్వుఁడు చంద్రి
కారూపాతిశయమును వర్ణించుటయే కాక తాను వసుచరిత్రముం జదివిన
వాఁడుం బోలెఁ దనతో రాజును జంద్రికకడకుఁ దోడ్కొనిపోయి నాయికా
నాయకులకుఁ బరస్పరానురాగము సంఘటించెను. చంద్రభానుఁడు లోక
సామాన్యముగ విద్యార్థివేషమునఁ దుంబురుపరిచర్య సేయుచు నొకనాఁడు
కార్యవశమున నేతెంచిన నాయికం జూచి మదనపరతంత్రుఁడై తుద కామె
పాణి గ్రహించెను. సుచంద్రుఁ డట్లుగాక యకారణబాంధవుం డగు నాముని
వాక్యములు వినినంతనె కామపరవశుఁ డై యెక్కడనో యున్న నాయికం
జూడ వేడుకపడి వానివిమానమ్మున నాయికోద్యానముం జేరి తుదకుఁ దద్దర్శన
లాభము ననుభవించెను.

చంద్రికాపరిణయమునందలి నాయికతండ్రి నైషధీయచరితముం జదివిన
వాఁడుఁబోలెఁ దనకూఁతుమనంబు సుచంద్రలగ్న మయ్యె నని యెఱింగియు
పాటికి స్వయంవరము చాటించెను. స్వయంవరకాలమునఁ జంద్రికకు భూపా
లురప్రతాపాటోపాదికమును వర్ణింపఁ బార్వతిని నియోగించెను. పార్వతియు
నైషధీయభారతిం బోలె భువనేశ్వరమంత్రమును సుచంద్రున కుపదేశించి యంత
ర్హితయయ్యె. చంద్రభానుచరిత్రములోని నాయికానాయకులు రుక్మిణీస్వయం
వరము నెఱిఁగినవారు గనుక మాయవలన నేమి యేవిధముననైన నేమి సర్వా
వస్థలను వారినే యనుకరించిరి. రుక్మబాహుండును దనతనయను శిశుపాలుని
తనయునకే యొసంగ నిశ్చయించి వియ్యమును రావించి యతనికి ద్వితీయప
రాభవమును గూడ సంఘటించెను. చంద్రభానుఁడు కాదంబరీరసాస్వాదన
పరవశునట్టులు తనకు సాత్యకితనూభవు నొకని దోడుచేసికొని యడవిలో మృగ
యావ్యాపారమునఁ జంద్రాపీడుఁడువలెఁ దాను గానవిద్యాభ్యాసమిషంబున
స్వజనులఁ బాసి దుర్వాసశ్శాపగ్రస్తుఁడై యాతండు కిన్నరమిథునముం బట్టఁ
బోయి యేకాకియై గానపరవశయగు మహాశ్వేతం గాంచి తద్ద్వారమునఁ గాదం
బరీలాభము నందినయట్టులు వనమయూరములం బట్టఁబోయి శాపవశమున
నేకాకియై గానాచార్యుం దుంబురుం గని తన్నికటమున విద్యనభ్యసించుచుఁ
గుముదినీలాభముం బొందెను. కాదంబరిలోని పుండరీకునట్లు నిందు విజయ
లోలుఁడు శాపతాపితుఁడై యొకవత్సర మెట్లో చరించి తుద కనురూప
కాంతాసమాగమమును బ్రధాననాయకునితో సమముగ నందెను.

ఇట్లీ రెండుగ్రంథములకు భిన్నభిన్నగ్రంథానుకరణములును సాధర్మ్య

వైధర్మ్యంబులును గలవు. కేవలసాధర్మ్యములనే యాలోచించినచో నీయిరువురు కవులలో నొకరి నొకరు తప్పక యనుకరించి రని స్ఫురింపకతీరదు. ఇరువురిలో నెవ్వరు ప్రాచీనులో వారినర్వాచీను లనుకరించి రనుట సమంజసము గదా! మల్లన పూర్వుఁ డనియు మాధవరాయఁ డర్వాచీనుఁ డనియు మా యభిప్రాయము.

ఎలకూచి బాలసరస్వతి తాను రచించిన యాంధ్రశబ్దచింతామణి భాష్యములోఁ దనవంశావతారము నీక్రిందిరీతి నిచ్చియున్నాఁడు:—

౧. తిప్పన, ౨. వల్లభసోమయాజి, ౩. తిప్పన, ౪. భైరవార్యుఁడు, ౫. తిరుమలార్యుఁడు (రామయ), ౬. భైరవుఁడు, ౭. కృష్ణకవి, ౮. బాలసరస్వతి. వీరిలో నైదవపురుషుఁ డగుతిరుమలార్యుఁడు "అళియరామావనీంద్ర దత్తయెడవిల్లిముఖ్యసద్గ్రామవిభుఁ" డని వర్ణింపఁబడియెను. ఈతిరుమలార్యుఁడు ౧౫౬౪ సంవత్సర ప్రాంతమున నున్నను నతనిమునుమని కొడుకగు బాలసరస్వతి మఱి యిఱువదిసంవత్సరముల పిదప, ననఁగా ౧౬౧౪ ప్రాంతమునందుండి యుండవలయును. ఈబాలసరస్వతిచే మల్లభూపాలీయమును గృతిఁగొన్న పెద్దమల్లభూపాలుఁడు నాకాలమందే యుండునుగదా. చంద్రికాపరిణయకర్త యగు మాధవరాయఁ డీమల్లభూపాలుని కొడుకని కొందఱును మునిమనుమఁ డని కొందఱును జెప్పుదురు. కొడుకనుకొన్న నాతనికాలము క్రీ. ౧౬౪౪ సంవత్సరప్రాంత మగును. కావున నితఁడు తరిగొప్పుల మల్లనకంటె నర్వాచీనుఁడే.

## గ్రంథములపోలికలు.

### చంద్రభానుచరిత్రము—ద్వితీయాశ్వాసము.

సీ. నిమచాలు వెనుచాయ నడకనిద్దపుఁ జేటిగమిపీరజడలతో గంధవహుఁడుఁ
జెలువంపు మైకప్పుజిగిసురమా వింతవగ జగబిరుదుతో మృగధరుండుఁ
జొక్కంపుఁ దుదిఱెక్క సోఁకుపుప్పొడి రేక పసుపుఁ బావడలతోఁ బఱికులముఁ
దొగరువన్నియమావిచిగురుమొత్తంబుక్రొంబగలుపంజులతోడ మాధవుండుఁ
బ్రకటగతి వచ్చి యహమహమికల మాక
మాక యుత్తరు వనుచు సంభ్రమ మొనర్ప
వారిఁ గరుణార్ద్రదృష్టిచే గారవించి
మునివరునిమీఁద సెల విచ్చి పనుపుటయును.

ఉ. చొక్కపుఁబువ్వుఁదోఁపములసొంపున మ్రాఁకులు విఱ్ఱవీఁగె నల్
దిక్కులసావితావి నెలదేఁటులపాటల నీటుసూపెఁ బ
ల్పక్కులకాకలీకలకలధ్వని మీఱెఁ జకోరి కోరికల్
నిక్కెనఁ బండువెన్నెలలు నిండె యథోచితవృత్తి నయ్యెడన్. 132

కం. కనుఁగవ మోడ్చి నిదిధ్యా
సనతత్పరుఁ డగుచు మస్తచంద్రసుధాసే
చనమునఁ దను దా నెఱుఁగని
మునిఁ గనుఁగొని యేము దాము ముం దని కడఁకన్. 133

సీ. ఉమరాజు నిజనిశితోత్తాలకిరణసంఘము పేరి బలుచిచ్చు గడలఁ జిమ్మి
మధుఁడు శాఖానోగ్ర్యస్యమర్శననిష్పతజ్ఞాలకావళి పేరిటాలు ఱువ్వి
పవనుండు పేటెంబువాఱి గంధాయాతభృంగనిధ్యానంబు పేరఁ బిలిచి
శుకపికాదులు గరుత్ప్రకటధ్వనులపేర వివిధవాద్యంబుల రవళిఁ జూపి
కేశవపదాబ్జచింతారసాశయాంత
రాళగతమానిహృదయశుండాల మవశ
మగుట వెలి దార్పఁగా లేక హత్తి యిట్టు
లమితనిజశక్తిమీఱఁ బోరాడునపుడు. 134

చంద్రికాపరిణయము—ద్వితీయాశ్వాసము.

సీ. అరిరాజచిత్తభీకరశరకాండప్రచండిను మను రాజమండలంబుఁ
గ్రొందళంబులఁ జాలఁ గూర్చుక హరివితానములతో చైత్రసేనావిభుండుఁ
గన్నుల నెఱమంట గ్రక్కుచుఁ గలరుతుల్ బెరయ నానావనప్రియబలంబుఁ
గనకరజోరేఖ గనుపట్టు వరగంధపటిమ రాజిలు మహాబలకులంబుఁ
దాలుదాలుత దీప్రవిస్ఫూర్తి దాడరి నడుపఁ
జిలుకమేల్పక్కిపై నెక్కి యలరువింటి
దంట యస్త్రానిగదిసె దుర్దాంతశౌరి
కాళి యాత్రైకబిరుదపద్యములు చదువ. 76

ఉ. అప్పుడు రణోత్సుకుం డగుసితాంబుజనాయకుకంటిసన్నఁ గీ
రపటిలి చల్లగాడ్పు తోవరాయఁడు కోయిలపౌజుఁ జైత్రుఁ డ
చ్చపుఁదెలితెక్కపుల్గు లనిసల్పఁగఁ జాలుదు నేన నేన యుం
చపరిమితాగ్రనాస్ఫురణ నమ్మునిఁ జుట్టిరి సత్వరంబుగన్. 77

సీ. శైత్యవత్కరకుంతచటులధారారేఖ శమినేత నాటించెఁ జలువమిన్న
తళుకుతళుక్కన వేగ జళిపించి మావిక్రొందళపుఁగత్తిని మాని నఱకె సురభి
కడుఁ జంచరీకసంఘము మ్రోయ ఘనజాలకంబులయతిమొత్తె గడుసుగాడ్పు
కటురజోగ్నికణాళి గ్రమ్మఁ జెంబొవనుందు తిత్తుల ముని గప్పె హత్తి యంచ
యిట్టు లాదిట్ట లందఱుఁ జుట్టు ముట్టి, గట్టితన ముట్టిపడ సురుతాంతికవచ
ధారి జడదారి నొప్పించి ధైర్యలీల, నడప లేకున్కిఁ గని మరుం డప్పుడు గడఁగి.

చంద్రభానుచరిత్రము—ద్వితీయాశ్వాసము 168 పద్యము.

సీ. అరయ ననగ్నికుండాహుతిస్తోమమై బూదిఁగూడె సుమాస్త్రుపోఁడి మెల్లఁ
జర్చింప నూషరస్థాపితబీజమై ధూళిగూడె సమీరుహాళి యెల్లఁ
జింతింప వఱదఁగూర్చిన చింతపండయి నీటఁగూడె హిమాంశునేర్పు లెల్లఁ
గనుఁగొన నడవిని గాచిన వెన్నెలై చెట్లఁగూడె వసంతుచెల్వ మెల్ల
నకట చట్రాత్రిపైవాన యగుచుఁ జెదరి
వఱచె నలువంకలకుఁ బత్తిబలము లెల్ల
విశ్వభూనాథ విను పదివేలమంది
మన్మథులకైన వానిఁ దెమల్ప నళమె.

చంద్రికాపరిణయము—ద్వితీయాశ్వాసము 114 పద్యము.

సీ. తనక్రొందళములమన్నన చెట్లపాలుగాఁ జనియె నూనశ్రీలనెనసి మధువు
తనతనూగరిమ మెంతయు ధూళిపాలుగా నరిగె వడంకుచు ననదుగాడ్పు
తనమహఃస్ఫూర్తి తోడ్తనె యగ్నిపాలుగాఁ బఱచె వెల్వెలఁబొలి పద్మవైరి
తనపాత్రవృత్తి తోడ్తనె మింటిపాలుగా నడఁగెఁ గొమ్మలఁ బికాద్యభ్రగాళి
తనపురారాతిభీకరోదగ్రవిగ్ర, హస్ఫురణ భూతిపాలుగా నతనుఁ డేఁగెఁ
జాపశరజాతములు వనస్థలిని వైచి, యమ్మహామాని కోపాప్తి నడరునపుడు.

చంద్రభానుచరిత్రము—ద్వితీయాశ్వాసము.

సీ. జాతరశిఖిశిఖాజాతధూమంబులచాడ్పున నల్లనిచాఱ లెసఁగఁ
క్రోధద్రుమాగ్రసంబాధపల్లవముల చెలువున నిక్కిన చెవులు దనర
సకలమృగానీకశాసనోద్ధతవేత్రవల్లికచందాన వాల మమర
నాస్యగహ్వరరసనాహీంద్రవిమలతాచ్ఛటలునాఁ గఱకుమీసలు నడంక
నావులించుచు గబ్బున కడరునీఁగ
మూఁకఁ గమియుచు సెలవులు నాకికొనుచు

భూరిభీకరభాంకృతు లొప్పదలఁ గొన్ని
పొదల నడుచక్కిఁ బెబ్బులి గదిసె నొకటి. 39

కం. ఆపులి నిజతురగదిదృ, క్షాపరత న్నిగుడ దాని ఘనపరుషరుషా
చాపలతం దూపు భుజా, చాపలతం దొడిగి శౌరిసంభవుఁ డడిచెన్. 40

చంద్రికాపరిణయము - ద్వితీయాశ్వాసము.

సీ. అఖిలజంతునిఖాతనాసాక్షిమైఁ బోలె నతివిస్తృతంబైన యాస్య మమర
నాశేభములఁ జీర్పనట్టి సిబ్బితిఁబోలె నతిగన్ననఖరసంతతి వెలుఁగ [నర
స్వచ్ఛమృగహింసావిహారముఁగాంచురతిఁబోలెఁ దలపై నెగయు వాలదండ మొ
నిగుడుకోపాంకురనికరంబగుటఁబోలె సితకేసరములకెంజిగిఁ జిగుర్ప
వక్రదంష్ట్రలు శతకోటివాదు గెలువ
వర్తులపుఁగన్నుఁగవ భానువాసిఁ గేర
ఘుటఘుటార్భటి ఘనకోటిపటిమఁ దెగడ
నొక్కసింగంబు వడిఁ బొదనుండి వెడలె. 27

కం. వెలలి జిష్ణుతూగౌరవ, కలనన్ లంఘించునృపతిఁ గన్గొని నిజని
స్త్రులచంద్రహాసధారం, దలద్రెవ్వఁగ నేసె నద్భుతంబుగ నంతన్. 28

ఇట్టిపోలిక లనేకములు గలవు గాని గ్రంథవిస్తరభీతి నిట నుదాహరింప లేదు. ఇట్టులీయుభయగ్రంథములకు సాదృశ్యమున్నను వైసదృశ్యము గూడఁ జాలఁ గలదు. మల్లన తఱచుగా వర్ణనములందు మనుచరిత్రము ననుకరించి మృదులమృదులము లగుపదముల నేర్చి కూర్చువాఁడు. మాధవరాయఁ డన్ననో వసుచరిత్రానుకరణుఁడై శ్లేషాద్యలంకారముల గుప్పించుటకై కొంచెము క్లిష్టపదప్రయోగము గావించువాఁడు. మల్లనకవి యు శ్లేష నతిమాత్రముగ నుపయోగించెను. పదకాఠిన్యమున కంతగా సహించువాఁడు కాఁడు. మాధవరాయలు పదలాలిత్యము నాలోచింపక శ్లేషాద్యలంకారగరిమకే ప్రాధాన్య మిచ్చువాఁడు. మల్లనకుఁ గథాభాగమధికముగా నుండుటయుఁ గార్యవిశేషమునఁ గొంచెము కొంచెము గా వర్ణనలఁ బెంచుటయు నభిమతము. మాధవరాయని గ్రంథమందుఁ గథాభాగ మత్యల్పమైనను వర్ణనలచే గ్రంథము పెంచఁబడినది. ఈయిరువురుకవులు నసాధారణపాండిత్యప్రకర్ష గలవారు. శాస్త్రమర్యాదలఁ జక్కఁగ నెఱిఁగినవా రనుటకు వారిప్రయోగములే ప్రమాణము. ఇతరగ్రంథములందుఁ గానరాని సంస్కృతపదములు వీరిగ్రంథములం దగపడును. మల్లన తఱచుగాఁ గర్ణాటాదీతరదేశ్యపదములను ప్రయోగింపనలవాటుపడినవాఁడు.

మాఘపరామబట్లోర్చినట్లు కానరాదు. రెండుత్తమప్రబంధములం గొని తారతమ్యవిచారము చేయుట కష్టము. ప్రస్తుతచంద్రభానుచరిత్రమునకు వత్తము.

### కథావిమర్శనము.

చంద్రభానుచరిత్రమునఁ గథానిర్మాణము విచిత్రముగ నున్నది. ఈకవి క్రొత్తమార్గముం ద్రొక్కినాఁడు. ప్రప్రథమమున రుక్మిణీవైభవాసూయచే సత్యభామకుఁ జంద్రభానూదయమును వర్ణించినాఁడు. పిదప నారదాగమనమున సంగీతాభ్యాసమను కథాబీజమును నాటెను. కలహాశనముని కుముదినీలాభమునకు మార్గదర్శకుఁ డయ్యెను. అడవిలో వేఁటాడుచున్న చంద్రభానునకుఁ దుంబురుని చెలికాఁ డొకసిద్ధుఁడు కుముదినీజన్మప్రకారంబును నామెకుఁ దుంబురుఁడు గానవిద్య నేర్పుటయుఁ దెలిపి కుముదిని యందుఁ జంద్రభానుని మనంబొకింత లగ్నమగునటులు వర్ణించి యంతర్హితుండయ్యె. చంద్రభాను చెలికాఁ డగువిజయలోలుని తోఁ గూడ వనమార్గముం బోవుచు నొకచో బడలి నిద్రించుచుండ నొకజింకజంట వారిమెయి నాక నిద్రాభంగవ్యాకులమనస్కులై వారు హరిణపోతమ్ముల బెదరించిరి. ఈపనికై కోపించి దుర్వాసోముని వీరిరువురకు వియోగముగలుగ శపించెను. పిదపఁ గాఱడవి నొకయుద్ధసాధనసన్నద్ధమగు రథ మీయదుకుమారులకు గోచరమగుడు నీరథికమగు నాతేరు వా రధిగమించిరి. ఇంతలో నెక్కడనుండియో యకాండ జలదాగమంబుం బోలి యొక్కరక్కసుం డరుదేరఁ జంద్రభానుఁడు ఘోరముగఁ బోరి వాని నుక్కడించెను. ఈయుద్ధవర్ణనము చదువుట కెంతయు మనోహరముగా నున్నయది. కూలిన యాదానవుండు శాపవిముక్తుఁడై కుముదినీలాభప్రధానసాధనం బగు మాయ నాయిరువురుబాలకుల కిచ్చి యథేచ్ఛం జనియె. పిదప శాపవశంబున వియుక్తుండైన విజయలోలుఁడు తిరుపతికిని జంద్రభానుఁడు కుండినమునకు నేగిరి. చంద్రభానుని చరిత్ర మిఁకఁ బై నంతవిశేషములు కలది గాదు. విజయలోలునికథ ముఖ్యమైనది. విజయలోలుని పాత్రము శేషశైలవర్ణనమునకును గడపట గుముదినీవేషముం దాల్చి ఫలమును సులభము సేయుటకునే కల్పింపఁబడినది. తిరుమలయం దాతనికిఁ గూడ ఫలప్రాప్త్యాశ యుదయించినది. కాని తుద కాతని ఫలప్రాప్తి ప్రధానము కానందునఁ గవి దాని నంతగా వర్ణింపక చంద్రభానుని వలె విజయలోలుఁ డనువిందుని కూఁతు వివాహమయ్యె నని తేల్చివేసినాఁడు. ఇది కొంతవిరసముగ నగపడుచున్నది కాని యిట్లు తేల్చివేయుట యుచితమే రామాయణమున రామపట్టాభిషేకము నట్లు విభీషణుని లేక సుగ్రీవుని పట్టాభిషేకములు వర్ణింపఁబడియెనా.

ఇందు గ్రంథాదిని నారదవృత్తాంతము వర్ణింపఁబడినది. ఇదియే ప్రబంధ మెల్లఁ గల్పించుట కనువుపడినది. కలహాశనుఁడు రుక్మిణీసత్యాకుమారులకుఁ గయ్యము పెంప నూహించి చంద్రభాను ననాదరించెను. దానిచే నాతఁడు నారదునిపైఁ గినిసి తుంబురునివలన విద్యనేర్చి రా నుద్యుక్తుఁడై యట కేగి గానవిద్యతోపాటు కుముదినింగూడ సంగ్రహించుకొని వచ్చెను. తుదకుఁ దా నభ్యసించివచ్చిన గానవిద్య హారికిని బ్రద్యుమ్నునకును వినిపించి మెప్పునందెను. గానవిద్యయే కుముదినీప్రాప్తిహేతు వగుటచే దానినే బీజస్థానమం దనువు పఱిచెను. విజయలోలుని పాత్ర మంతసార్థకముగ లేదు; మాయాకుముదినీ రూపముం దాల్చి వాస్తవకుముదినిం జంద్రభానునితోఁ బంపుట కుపకరించినది. అసురయుద్ధమున గథచోదనమున కనువుపడినది. కాని శేషశైలవిశేషములఁ దెల్పి తన్నుఁ దా సార్థకపఱిచికొన్నది. వనములో నసురుఁడు యుద్ధమును గుముదినీలాభమునకు సాధన మగుశాంబరీవిద్యనేర్చుటకై కల్పింపఁబడినది, యుద్ధము లేనిచో మహాకావ్యలక్షణానురోధ మని కల్పించిన నుండవచ్చును. విజయలోలునికొఱంత తీర్చుటకుమాత్రమే యనువిందునికూఁతురు కల్పింపఁ బడినది. ఇంకను వరలికాదిపాత్రములు యథోచితకార్యసాధనమునకై యౌచితి నాలోచించి కల్పింపఁబడినవి.

అందందుఁ గొన్ని నెరసు లగపడుచున్నయవి. రసలోలుపుల కవి పాటింపఁదగనివి. ఈయుత్తమగ్రంథ మెల్లర కవశ్యాదరణీయ మని నొడువు టయే శివము.

కట్టి సాంబమూర్తిశాస్త్రి.

శ్రీరస్తు.

# చంద్రభానుచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

— గ్రంథావతారిక. —

*శా. శ్రీలీలావిభవాప్తి కాశ్రితజనుల్చింతింపఁగాఁ జేరుచే
సౌలభ్యం బనుచు న్నిజాగమనసంజాతస్మృతిం బొల్చుభ
క్తాలిం గోర్కు లొసంగి ప్రోచుటకు దత్తాత్రేయదివ్యాకృతిం
శ్రీలాలిత్యము గన్ననిత్యకరుణాసింధుల్ హరిం గొల్చెదన్. 1

సీ. తొడవులఁ దనరూపు దోఁప నేవాసన్నకాంతాంతరమనీష [1]గప్పుకరణి
జగదంబ గాన భోజనుల కవ్యయసౌఖ్యవిభవంబు లిమ్మని వేఁడుకరణి
బలిబంధవేళ సంధిలు[2]ననంతాచంక్రమణభూరివిశ్రాంతి మడఁపుకరణి
నన్యాబ్జములు మాని యమృతకరప్రకాశోన్నతాబ్జములు గైకొన్నకరణి
నభినవదుకూలచేలాంకితాంకపాళి
నంబుజోదరుపదపల్లవంబు లుంచి
యెలమి సంవాహ మొనరించు కలిమిచెలువ
చిరతరైశ్వర్యములు మాకుఁ [3]జేయుఁగాత. 2

చ. కమలదళాక్షుభక్తుల కగాధభవార్ణవ మింతబంటి యు
ద్యమణఁ గటిస్థలంబునఁ గరం బిడి రాముఁడె సర్వదైవతో
త్తముఁ డని చాటుచుండెడి విధంబున దక్షిణపాణి నెత్తి ని
త్యమును బ్రతాపముద్ర నలరారు సమీరకుమారుఁ గొల్చెదన్. 3

మ. పరమప్రౌఢి నశేషవర్ణరచనాపారీణుఁడై భర్తృహ
త్సరణిం డాయుదు నేన యేన యనునోజన్ వర్ణసంధానభా

క-పరిషత్పుస్తకభాండాగారములోని 14 సంఖ్యగల తాళపత్రపుస్తకము.
చ-రాజకీయప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని 12-7-8 సంఖ్యగల పుస్తకము. (తాళ)
ట-రాజకీయప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని 14-4-4 సంఖ్యగలపుస్తకము. (కాగిత)
* ఇది మొదలు 15 పద్యములకడవఱకు క-ప్రతిలోఁ బత్రములు విఱిగిపోయినవి.
1. చ-గప్పుకరణి, 2. చ-ననంతాధ్వసంక్రమణ భూరిశ్రాంతి కడపుకరణి, 3. చ-జేర్చుఁగాత.

స్వరవృత్తి స్సమమూర్తులై యొరయు నాసంగీతసాహిత్యబం
ధురవక్షోజము లూను తల్లిని భజింతుం [1]దత్ప్రసాదాప్తికిన్. 4

సీ. శారదోన్మేషంబు జగతి నంధించియుఁ బరమ[2]నారదమైత్రిఁ బరఁగుసుకృతి
నుపమైక ధన్యుఁడై యొనరియు ననుపమప్రఖ్యాతిఁ గాంచినభవ్యచరితు
ననమబాణాంకత నలరారియు నలికనేత్రు మెప్పించిన నిర్మలాత్ము
ఘనశబ్దవిస్ఫూర్తిఁ దనరియు హంసనమాగమశ్రీఁ గాంచు ననఘశీలు
మఱియు నగణితసుమనస్సమాజమునకు
నతులరామృతధారారసార్పణమున
నామెతల నిచ్చలు నొనర్చు నలఘుమహిమ
నెఱపినవిచిత్రసత్కళానిధులఁ దలఁతు. 5

గీ. ఏమహాత్ములుమువ్వురునిలఁద్రిమూర్తు,లట్లగుఱిమైత్రిలింగభాషాహ్వయముయ
థార్థమొనరించియలరించిరట్టిశబ్ద,శాసనునిదిక్కమఖశంభుదానుఁదలఁతు. 6

చ. సరసవిశుద్ధవర్ణగుణసంపదయు న్శుచి[3]వృత్తి భావభా
స్వరగరిమంబుఁ బూనని యసారవుమిన్కుఁగరల్గు సాహితీ
శరనిధిగర్భశోభన[4]కళావిముఖు ల్పచరింప వాని నె
ల్లరుఁ జెవిఁబెట్ట రింతయు నలంకృతివై భవధన్యతానిధుల్. 7

వ. అనియిష్టదేవతాపదాంభోజపూజనంబును సుకవిసభాసభాజనంబును గుకవిః
నోద్వేజనంబునుం గావించి విరించిగురుకరాంచలసంచాలితామందమందరవ
థ్యమానదుగ్ధాంభోనిధానసంజాయమాన నవీనతర సుధారసమధురతాబ
ధురనవరసభావానుబంధంబును జతురజనశ్లాఘనీయుచంద్రభానుచరిత్[5]వి
త్రానల్పచమత్కృతియానిబంధంబును నగు[6]నొక్కప్రబంధంబు నిర్మింపంబూ
నునమయంబున.

ఉ. కావ్యము సత్కవిప్రకరకర్ణసుధా[7]సరిపూరణక్రియా
భవ్యముగా నొనర్చుట తపఃఫల ముర్విఁ దలంప నట్టిస
త్కావ్య[8]ము నిష్టదైవతవతంసున కిచ్చి కృతార్థుఁడైన యా
యవ్యయభాగ్యరాశిఁ గొనియాడఁ దరంబె జగత్త్రయంబునన్.

---

1. చ-దద్రసావాప్తికిన్. 2. ట-సోదరమైత్రి. 3. చ-వృత్త. 4. చ-దశా. 5. చ-
చిత్రికరానల్ప. 6. చ-నొక్కమహాప్రబంధ. 7. చ-రస. 8. చ-మభీష్టదైవ.

మ. అని యూహించి మదిష్టదైవతము భక్తాభీప్సితార్థోపపా
దనకారుణ్యకటాక్షశాలియు రమా[1]ధామావతారాగ్రగ
ణ్యనవోన్మేషపవిత్రమూర్తియును దత్తాత్రేయుఁడే కాన నా
ఘను నస్మత్కృతినాథుఁ జేయఁగ నమోఘప్రీతితో నున్నెడన్. 10

సీ. ద్విజరాజకార్శ్యము ల్దీర్చు నీవిభుకీర్తి ద్విజరాజకార్శ్యము ల్దీర్చు టరుదె
యాజిభవస్ఫూర్తి నడఁచు నీనృపుశౌర్య మాజిభవస్ఫూర్తి నడఁచు టరుదె
యతిసురభిఖ్యాతి నలరునీఘనునీగి యతిసురభిఖ్యాతి నలరు టరుదె
చంద్రగోత్ర[2]శ్రీఁ బొసంగు నీపతికల్మి చంద్రగోత్ర[3]శ్రీఁ బొసంగు టరుదె
యనుచు బుధు లెన్న వెలయు రాజాధిరాజ,రాజపరమేశసకలకర్ణాటకాంధ్ర
రాజధౌరేయతిరుమలరాయతనయుఁ,డు చంద్రుఁడగు వేంకటపతిక్షితీంద్రమణికి.

చ. అనుపమకార్యకర్తయును నగ్రజుఁడు న్మహనీయసత్కళా
ఖనియు నఖండకీర్తికళికానురభీకృతసర్వదిఙ్ముఖుం
డును నగుదత్తనార్యుఁడు నను న్వినయాన్వితుఁ బార్శ్వవర్తిఁ గ
న్గొని పలికె న్సుధారసనిగుంభనజృంభితవాక్యవైఖరిన్. 12

మ. గురువిద్వచ్చరణారవిందభజనాంకూరన్మహోదారధీ
గరిమ న్నీవొనరింపఁబూనుకృతికిం గైవల్యలక్ష్మీమనో
హరు నస్మత్కులదైవతోత్తముని దత్తాత్రేయయోగీశ్వరు
న్వరుఁ గావింపఁ దలంచి తెన్నఁ దరమే వత్సా భవద్భాగ్యముల్. 13

క. ఈపరమయత్న మఘని,ర్వాపణ[4]మనఘా స్మదీయవంశగురుతప
స్స్యా[5]పారంబున నీమది, దీపించెఁ బళి కులప్రదీపక యనినన్. 14

ఉ. సంతసమంది యేను బితృసన్నిభుఁడు న్హితదేశికుండు న
శ్రాంతశుభప్రదుండు నయి రంజిలుదత్తనమంత్రివాక్య మ
త్యంతవినీతిఁ గైకొని కృతార్థుఁడనై బహుపుణ్యగణ్యత
ల్గాంతు నటంచుఁ గౌతుక[6]విలాసవిభాసితమానసంబునన్. 15

క. శ్రీమద్దత్తాత్రేయమ,హామునిముద్రావిభూషితాత్మీయకృతి
శ్రీముఖభూషణముగ మ,త్స్వామిగుణస్తుతి యొనర్తు సమధికభక్తిన్. 16

---

1. క-ధారాప్రధారాగ్రగణ్యనవోన్మేష. 2-3. చ-శ్రీలొసంగు. 4. చ-ఘన మస్మదీయ. 5. ఛ. స్తోకంబున. 6. చ-వికాస.

సీ. శౌరి కన్నులనొత్తిఁ గొనుఁ బలితాభోగి యెదనుంచు సకలకళేశ్వరుండు
శిరమునఁ దాల్చు భాషితదేవి యడుగెడఁ బాయంగనీఁడు కల్పకగురుండు
పూను నుత్కటమైత్రి బుధకుంజరముముఖంబుననుండఁ జూపు సత్పుంగవుండు
కంఠభూషణముగాఁ గావించు సర్వజ్ఞుఁ డంకమొందించు శేషాంశజాతుఁ
డిట్టియక్షరవిఖ్యాతి నెనసెనో యఖండజయ మూరురాయరగండబిరుద
వీరతిరుమలరాయపృథ్వీతలేంద్రతనయుఁ డగు వేంకటక్ష్మాధవుని కీర్తి. 17

మ. క్షితి మత్తాత్మ సహాయశూన్యుని గృహచ్ఛిద్రంబు వాని న్సమా
హతతారుం గికురించి వేంకటపతిక్ష్మాధీశ్వరుం డెందఁ ద
ద్గతరేణుల్ తదధిష్ఠితాంబువులుఁ దద్గంధానిలంబుం దదం
చితభూజంబులు గాంచి యుండుదురు విశ్లేషార్తి వారెప్పుడున్. 18

సీ. సర్వతోముఖవృత్తిఁ బర్వనౌర్వమహాగ్నియుదుటెల్ల సింధుదేశోద్భటంబు
దీర్ఘకాలస్ఫూర్తి దీపించువిలయాగ్ని బెడిద మెల్లను సమాపితశకంబు
భీమరోషోద్వృత్తిఁ బెనుపొందుఫాలాగ్ని పెంపెల్లను విదేహభీషణంబు
బహుసత్త్వభీకరప్రౌఢిఁ బొల్చుదవాగ్ని తేజమెల్లను విమర్దితవనాయు
వహహా యవి సింధుశకవిదేహకవనాయు, లాదిగాఁగలనిఖిలదేశాళి నెల్ల
రాయిడించునె తిరుమలరాయవేంకటావనీంద్రభుజప్రతాపాగ్నికరణి. 19

మ. రమణీయాత్మకరప్రరూఢవసుధారాలాభనందద్బుధో
త్తమనిత్యాన్నవితీర్ణి సర్వసుమనోదైన్యంబు వారింప భూ
రమణీధేనుగజేశ్వరాత్మకబహుశ్రీలిచ్చు శ్రీవేంకటే
శమహీవల్లభుసాటియే విధుఁడుఁ దజ్జన్మక్రియాకర్తయున్. 20

సీ. మిథ్యాభిమానసమ్మిళితుల వివరణకలితోత్తరంగులఁగా నొనర్చుఁ
గలనైన ధర్మకౌశలము నేమఱనివారలకు హేమాద్రిమార్గంబుఁ దెలుపు
నళినయజల్పాభిరతుల వీక్షించి చింతామణి హస్తగతంబు సేయుఁ
బ్రబలతంత్రవిచారపారీణులగువారి దొరసి ప్రాభాకరసరణిఁ జూపుఁ
దత్తదధికారులకు నిట్ల[1]తదుపయోగ,గతులఁగఱపెడుగురువై యఖండసమర
విజయవేంకటపతిరాయ భుజకృపాణ,మఖిలదర్శనాద్భుతశక్తి నతిశయిల్లు. 21

ఉ. ధీరవతంస వేంకటపతిత్రుటితారిసితాతపత్రముల్
భూరిజవంబునం దిరుగుఁ బోరులఁ దజ్జయలక్ష్మికిం దిగం

1 చ-తదుపయోగ్య

భోరుహనేత్ర లెత్తు తెలిముత్తెపుటారతిపళ్లెరంబులై
చారుతదీయహేమకలశంబులు దీపము[1]లై వెలుంగఁగన్. 22

ఉ. వేంకటభూవరుం జెనకువీరులు తూఱఁగనైన గంటితోఁ
బంకరుహాప్తబింబము విభాసిలు నాజి నసృగ్ఘరంబులన్.
సంకులవృత్తిఁ దద్వరణసంభ్రమసంభ్రమదాదితేయతా
టంకవతీపదాంబుజహతచ్యుతనూపురరాజమానయున్. 23

క. ఆవేంకటపతినృపతి ద, యావీక్షాగౌరవమున నతిశాశ్వతల
క్ష్మీవైభవంబుఁ గాంచిన, నావంశం బభినుతింతు నవమధురోక్తిన్. 24

శా. శ్రీవిద్యావిభవాస్పదం బయిన యార్వేలాన్వవాయంబునం
బావిత్ర్యాభినుతస్వతంత్రకపిసన్మౌనీంద్రగోత్రుల్ ధరా
దేవోత్తంసులు మించి రందు బెడఁగొందెన్ భూజనశ్రేణి సం
భావింపం దరిగొప్పులాంకుఁ డగు శ్రీమల్లప్రధానుం డిలన్. 25

చ. విముఖతఁ బూను మిత్రునెడ వే ఘనులం గని డాఁగు శుద్ధప
క్షమున వసుచ్ఛటల్ విడువఁజాలఁడు సారెఁ బ్రకాశితాంశుఁడై
తమి వెలయించుఁ గాని తనుదానమునం గడుఁ గుందు నేగతిం
గుముదహితుండు సాటి తరిగొప్పుల మల్లనమంత్రి కీగులన్. 26

[2]క. ఆతరిగొప్పుల మల్లను, ధీతిలకుఁడు గాంచె నరసధీనిధి నతిఖ
ద్యోతద్యుతి నతులితవి, ద్యాతతి నతిసుకృతి నాగమాంబికయందున్. 27

సీ. తనవిశాలకృపాణియును బాణియును బతిశ్లాఘాధురానిరాసము ఘటింపఁ
దనకరుణాసారమును సారమును నరిశాసనస్మయవివాసనము చలుపఁ
దనసద్గుణనికాయమును గాయమును సుధాకిరణవిస్ఫురణధిక్కృతి యొనర్పఁ
దనమనీషాభోగమును భోగమును సుధాంధఃప్రధానావధూననము దెలుపఁ
దనప్రభావంబు భావంబు ధర ననంత
ధృతిసమాసాదనంబునఁ దేజరిల్ల
వఱలు నాశ్రితబాంధవావనపరుండు
మంత్రిమాత్రుండె నరసయామాత్యవరుఁడు. 28

చ. చతురాస్యాననపాళిక న్మెలఁగు నంచత్పాండుపద్మాసన
స్థితి దీపించు వినిర్మలాంబరరుచిశ్రీ మించు హంసాళి న

1. చ-దీవియ. 2. ఇదిమొదలు "యాదవాగ్రజు" నను పద్యముపఱకు ట-ప్రతిలోలేదు.

ప్రతిమానోన్నతిఁ [1]దోలియాడుఁ దిలకింప న్శుద్ధవర్ణాధిదే
వత గాదే నరసప్రధానమణిదివ్యత్కీర్తి యశ్రాంతమున్. 29

చ. నరసామాన్యచరిత్రుఁడే ధర బుధానందప్రదానూనదా
నరసామాన్యయశోవిశోభితదిగంతశ్రేణి గంధర్వకి
న్నరసామాత్యభిరామశుద్ధతర[2]గాంధర్వైకసంస్తుత్యుఁ డా
నరసామాత్యవరుం డనంతపదచింతాపావనుం డెంతయున్. 30

గీ. వెలయు నాతనిదేవేరి విజితభర్తృ
దేవతాజననికురుంబ తిప్పమాంబ
బహుమహాభోగముల నుంచుభర్తకుఁ దల
వంపు లొనరించినధరిత్రి పెంపుఁ దెగడి. 31

సీ. సకలసన్నుతచర్య సద్గురుపరిచర్య పావనయదువర్యపదసపర్య
యన్నదానఖ్యాతి యనఘసాధ్వీనీతి నియతార్యజనతాతిశయవినీతి
బంధురతాశక్తి పరమధర్మాసక్తి నిత్యసూనృతయుక్తి నిర్మలోక్తి
యాశ్రితాశాపూర్తి యలఘుశీలస్ఫూర్తి బహుసతీముఖవర్తిభవ్యకీర్తి
యార్తసంరక్షణంబును నతులభాగ్య, లక్షణంబును గారుణ్యవీక్షణంబు
సహజసిద్ధంబు లీపుణ్యచరిత కని నుతింపఁబొగడొందు నరసయతిప్పమాంబ.

చ. గురుపరిభూతి లేనిసతి గోత్రధరస్థితి లేనియుర్వి సో
దరపరిపాలనావిముఖధామవిహారము లేనికల్మిబి
త్తరి యని బాంధవాశ్రితవితానము సన్నుతి సేయఁ బొల్చు నా
నరసయతిప్పమాంబ భువనస్తవనీయగుణావలంబయై. 33

శా. అత్రిప్రాభవుఁ డానృసింహుఁ డనసూయాత్యంతసంస్తుత్యచా
రిత్రశ్రీసిధి తిప్పమాంబవలనం బ్రీతిన్ బుధానీకని
త్యత్రాణైకధురీణు నప్పవిభు నేత్రానందపూర్ణేందు ద
త్తాత్రేయాహ్వయు మల్లికార్జునుని నార్యాసక్తుఁ గాంచె న్మహిన్. 34

శా. తారారాజి గణించుఁ జుల్కఁగఁ గళాధామాంశుమాద్యత్సుధా
పారావారతరంగరేఖలఁ దృణప్రాయంబుగా నెన్నుఁ దా
నారా యప్పయమంత్రిశేఖరుని సంఖ్యావత్త్వముద్రామహా
ధౌరంధర్యనిరూఢనిర్మలయశోధారాపరీవాహముల్. 35

---

1. చ-దోఁచునాడు. 2. క-గాంధర్వేశ. 3. చ-ధర.

చ. అనవరతాన్నదాననిధి యైనరసప్రభునప్పనార్యునీ
డనఁ దగునే సుతా[1]పరిణయంబున వేల్పుల కొకటేనాఁడు భో
జన మతిక్షితలం బిడినసాగరరాజుఁ బదింట నైదిటన్
ఘనరుచి దక్కె నొక్కకనిగ్రాస మొసంగుతుషారభానుఁడున్. 36

సీ. తనదిక్కుఁ జేరుమిత్రునకుఁ దేజము మించఁ దగుసర్వమంగళోత్పాదకుండు
ఘనుల నానాదిగాగతులఁ గైకొని పూర్ణజీవనం బొసఁగులక్ష్మీగురుండు
వరధర్మమున గోత్రవర్గంబుఁ [2]దగుతావు లెనయించి నిలిపినపృథుసమాఖ్యుఁ
డాశ్రితద్విజనాయకావనుం డై తదిష్టైకసంపదఁ గూర్చులోకబంధుఁ
డరయఁగఁ బ్రధానమాత్రుఁడే యఖిలవినుత
మాధ్వదర్శనధౌరేయమాననీయము
పరమహరిగురుచరణాబ్జభజనపరుఁడు
మంత్రినరసయ్యయప్పనామాత్యవరుఁడు. 37

చ. తదనుజరత్న మై వెలయు దత్తనమంత్రి మహావిపక్షదు
ర్మదబలమర్మదారణధురంధరసంగరచాతురీవిశా
రదుఁ డగువేంకటక్షితిపురందరునప్రతిమానరాజ్య సం
పదలు [3]ఫలింప నాకు లిశుభవ్యగతిశ్రితపారిజాత మై. 38

సీ. వర్ణంబులనె కాదు వరవృత్తతాస్ఫూర్తి నన్నుతోభయవంశజనులయందుఁ
బత్రంబులనె కాదు పంక్తిశోభ సదాప్రదీయమానాన్నభుగ్ద్విజాలయందు
వాచికోక్తినె కాదు సూచితార్థబహుత్వ మతులసత్కవిబుధాశ్రితులయందు
లిఖనక్రియనె కాదు లీలాశుభావనం బానతారాతిప్రధానులందుఁ
బొరయఁ దిర్మలరాయేంద్రభూరిపుణ్య, రాశి యగు వేంకటోర్వీశు వ్రాయసములు
వ్రాయుచాతుర్యమున నిజస్వామిహితవి, ధానసురమంత్రి నరసయదత్తమంత్రి.

మ. అరుదార న్వరపత్రవృత్త యయి దత్తాత్రేయసంస్పర్శనా
క్షరయోగోన్నతిఁ గన్న లేఖిని మహాగర్వాంధసామ్రాజ్యసం
హారణం బున్నతరాజ్యసంభృతియు ద్వీపాంతర్ప్రాకర్షణ
స్ఫురణంబున్ బహుదేశవస్తుభరణంబుం గాంచు సంచద్గతిన్. 40

సీ. యాదవాగ్రజనిపటాటోప మెల్ల [4]గారివరసుగ్రీవభావ మెల్లఁ
గుముదాప్తమండలక్రమణచిహ్నం బెల్ల నుడుపరంపర నుండునునికి యెల్ల

1. క-పరిచయంబున. 2. చ-తనతావులెనయించినిలిపినఘనసమాఖ్యు. 3 క-భరింప. 4. చ-గారివిభు,

సిరిఁ గన్నతండ్రి యాంతర మెల్లఁ బలుకులకొమ్మయుఁ దలమెత్తికొనుట యెల్ల
శేషపన్నగమునున్నేమవైఖరి యెల్లఁ జదలుబ్రమానికడిందిచాయ యెల్ల
నగి తెగడి మీఱి కేరి తృణంబొనర్చి, యడఁచి కారించి వారించి యడరు నేఁ
వేకనిధికీర్తి యతఁ డొప్పు[1] వేంకటేంద్ర, దత్తసామ్రాజ్యవిభవుండు దత్తమంత్రి.

మ. ఘనగోత్రోద్ధరణం బసంఖ్యసుకవిగ్రామప్రదానైకసా
ధనసద్భావధురంధరత్వము మహోదర్పోద్ధతారిప్రథా
ననిరాసోద్భటపాటవంబు నిరవొందన్ దత్తనార్యుండు శ్రీఁ
దనరు న్వేంకట[2]రాయదక్షిణభుజాదండావిశేషస్థితిన్. 42

క. ఆదత్తమంత్రి యనుజుఁడ, శ్రీదత్తాత్రేయయోగిశేఖరసేవా
మోదితుఁడ సుధారసధా, మోదితుఁడ న్మధ్వమునిమతోద్ధారకుఁడన్. 43

[3]సీ. వరగంధచర్చికల్ వాగ్విస్తరమచర్చికలు నూరిహృదయభాగములఁ గూర్చఁ
గర్పూరమయపీటికవనాశుపదఘాటికలు రసజ్ఞసుహృన్ముఖములఁ జేర్చ
నతిచిత్రనేత్రముల్ యమకాదిచిత్రముల్ మాన్యసత్కవిజనాత్మల ఘటించు
మహితసువర్ణముల్ మధురసందర్భవర్ణములు ప్రాజ్ఞమహాశయముల నించు
గండభేరుండబిరుదవిఖ్యాతమతికి
రాయసము మల్లనికిఁ గవిరాయనికిని
మహిని గవిమానులును మంత్రిమాత్రులును స
మానమే యన వెలసినమానఘనుఁడ. 44

ఉ. నా కుపకర్త నాకుఁ జెలి నాకు సహాయుఁడు నాకుఁ బ్రాపిల
న్నా కు బహుప్రదుం డని మనంబున వేంకటరాట్సభాజనా
నీకము సంస్మరింప మహనీయగుణోన్నతిఁ గన్న యుత్తమ
శ్లోకుఁడ మల్లనాహ్వయుఁడ సువ్రతు మత్కృతినాథు నెన్నెదన్. 45

* సీ. నిజగర్భగతజగన్నిచయ మారయులీల నంతర్ముఖాపాంగుఁ డైనవాని
నలినజాండావృత్తి నాభివీథికి నేర్పురీతి నతిసరంబుఁ ద్రిప్పువాని
శ్రుతులాత్మయందు నిల్పుటఁ దెల్పుతెఱఁగున నవరుద్ధనిశ్వాసుఁ డైనవానిఁ
దనపూనినధరిత్రికి నలోలత ఘటించుపగిది [4]జటిలవృత్తిఁ బరఁగువాని
బ్రాక్తనస్వీయదామోదరత్వ మెఱుఁగఁ
జేయుగతి యోగ[5]పట్టికఁ జెలఁగువాని

---

1. ట-వేంకటాద్రి. 2. చ-ట-రాజ. 3. ఈసీసము ట-లో లేదు. * ఈ సీసము మొదలు, "ఏతాదృశ" యను షష్ఠ్యంతపద్యమువఱకు ట-లో లేదు. 4. చ-నిశ్చల. 5. చ పట్టియ.

యోగముద్రికసూచితాచ్యుతచరిత్రుఁ
డైనవాని దత్తాత్రేయమౌనిఁ గొలుతు. 46

మ. యతిలీలాయితదత్తచిత్తుఁ డగుపద్మాక్షుండు విశ్వావన
స్థితికిన్ రాజు నొనర్చి యాత్మభుజహేతిన్ సర్వసౌభాగ్యయో
గ్యత లెల్లం గరుణించు నాఁగఁ గృతవీర్యక్ష్మాపసూతి న్నిరా
హతచక్రేశ్వరవృత్తి గా మనుచుదత్తాత్రేయుఁ గీర్తించెదన్. 47

మ. కమలాకాంతుని కెంతసత్కృపయొ లోకశ్రేణిపై బ్రహ్మశ
క్రమహేశాదుల నమ్మికీజగము యోగక్షేమముం గాంచునె
య్యమునం దానె చరించు నెల్లెడల దత్తాత్రేయయోగీంద్రవే
షమునన్ దీనులఁ బ్రోచుచున్ ఖలులయుచ్ఛ్రాయయుంబు వారించుచున్. 48

సీ. ఈముని మునివ్రేళ్ల నెనయునక్షసరంబు పద్మాక్షవిస్ఫూర్తిఁ బరిఢవిల్లె
నీయతి యతిపుణ్యధృతిఁ గాంచుకుండిక తీర్థపదఖ్యాతిఁ దేజరిల్లె
నీయమి యమితసత్కృపఁ గన్న యజినంబు నీలవర్ణనిరూఢి నివ్వటిల్లె
నీశమి శమితాఘవృత్తి నూనినదండ మురుతరానంతవైఖరిఁ దనర్చెఁ
దనపరికరంబు లెల్ల నిట్లనుపమాచ్యు
తప్రభావంబులై మించఁ దా ధరిత్రి
నరుడె యోగీశ్వరేశ్వరుం డగుట యనఁగఁ
బొలుచుధన్యు దత్తాత్రేయుఁ బొగడఁ దరమె. 49

మ. అను వొప్పం బరమాచలాత్మఘటితోద్యత్కుండలిస్ఫూర్తిచే
ఘనపంకాబ్ధి మథించి నిత్యతరయోగశ్రీనితాంతోపగూ
హనరోమాంచసమంచితాంగుఁ డగుదత్తాత్రేయనారాయణుం
డనవద్యామృతసారము న్విబుధలోకాధీనముం జేయఁడే. 50

— షష్ఠ్యంతములు. —

క. ఏతాదృశబహుచరితున, కాతారకనిత్యనిజశుభాచరితునకున్
శ్రీతనయాధూతనయా, [1]పాతనయాపితభవర్షిపరిచరితునకున్. 51

క. అస్మత్కులదేవత కన,ఘస్మరఘస్మరవిరించిఘటితచటుశ్లా
ఘాస్మేరున కస్మయపర, మస్మృతి[2]గోచరునకును నమత్ఖచరునకున్. 52

---

1. చ-పాతనయాభితభవర్షి ; ట-పాతనయాపీతపర్షి, 2. చ-రోచనునకును

[1]క. సద్యోజితతాపత్రయు, సద్యోజిత[2]భద్రమననచాతుర్యునకున్
విద్యోతితవిద్యోచిత, హృద్యోదితబోధితార్యహితచర్యునకున్. 53

క. మాహురపురకృతవసతి క, నీహానుతోన్నతికి నఖిలనిర్జరశుభసం
దోహదవరదోహదవర, దోహదయాశిశిరమతికి ధుతసంస్మృతికిన్. 54

క. తత్త్వాదృశవిత్త్వాభృశ, కృత్త్వాదృశరాగయోగికృతచిత్తమహో
దాత్తమతిధ్యేయునకును, దత్తాత్రేయునకు నాశ్రితవిధేయునకున్. 55

వ. [3]అంకితంబుగా నాయొనర్పంబూనినచంద్రభానుచరిత్రం బనుమహాప్రబంధం
బునకుం బ్రారంభం బెట్టి దనిన. 56

—* ద్వారకాపురవర్ణనము *—

మ. సిరికిం బట్టయి యొప్పు ద్వారవతి యక్షీణాబ్జరాగోజ్జ్వల
ద్వరణాధిష్ఠితహీరకేసరికరద్వంద్వప్రభిన్నాభ్రభసిం
ధురనిర్యన్నవమౌక్తికచ్ఛలసుమస్తోమంబులం గేతనో
త్కరము ల్సారెకు సాఁచి విష్ణుపద ముద్యల్లీలఁ బూజించుచున్. 57

మ. పరిఖావారిధి కూఁతు రైనసిరి కబ్జాతంపుటిం డ్లొక్కెడ
న్వెరియు న్మోడ్చు నొకప్పు డంచు మది వానిం జాల నిందించి సు
స్థిరతం బన్నిన సంతతోన్మిషిత మౌ చెందమ్మిచందమ్మునం
బరఁగుం బంగరుకోట పీటఁ బయికొమ్మల్ జేసు లై మించఁగన్. 58

క. ప్రోల న్మత్త్యపుఁగొమ్మల, చా లింపగు నమృతపూరసంగతపరిఖా
వాలయుతకర్బురాహిత, సాలంబునఁ జెడనినవలు జనియించె ననన్. 59

మ. వరణేంద్రోపలకాంతిశర్వరి నిజస్వర్ణంబు లెల్లం బయో
ధరముల్ ప్రుచ్చిలి మారుతత్వరఁ జనం దక్షేయవారాశి గో
పురకేతుచ్ఛలన న్మహోర్మినికరంబుల్ సాఁచి వేయన్ గళ
త్కరకాదంతము లై భజించు నవి యుద్యన్నీరదాఖ్యానమున్. 60

క. నరవరమణిహర్మ్యవిభా, కరబంధురకనకవరణకైతవజాగ్ర
త్పరిధియుతమధ్యతలమై, పరిఖాపుష్కరము తేటపడు నచ్చోటన్. 61

ఉ. ఆపురి నిండువెన్నెలల నగ్రవిధూపలసంభవాంబుధా
రాపటలచ్ఛలామరతరంగిణి ఖేయపయోధిఁ గూడరాఁ

1. ఈపద్యమును దీనిక్రిందిపద్యమును ట-లోలేవు. 2. చ-మననభద్ర. 3. ట-సమర్పితంబుగా

ప్రాపుగ గచ్చునిచ్చెనలు వన్నినకైవడి గోపురావళుల్
కైపువహించె మెట్టుపలకల్వలె వాకిళు లుల్లసిల్లఁగన్. 62

ఉ. సారెకుసారెకున్ గవనిసందుల నప్పురి సొచ్చి యేగువాఁ
డై రజనీకళత్రుఁడు తదగ్రతలస్థితరశ్మివర్గముం
జేరి మెయిన్ సికాగుటుతు చేకొనఁబోలును గాకయున్నచోఁ
బేరినవెన్నవంటిశశిబింబమున న్నిట[1]కందు దోఁచునే. 63

చ. కురుఁజులు సారె లచ్ఛమణికుట్టిమభాగము లిండ్లు మధ్యగో
పురము పణంబుగా నిడినభూరిసువర్ణము[2]గాఁ జతుర్దిశా
సరసిజనేత్ర లర్థిఁ జవుసారెల నాడఁగ నుత్కటాక్షసం
చరణము మీఱఁ బూ న్వగడసాల యనం జవువీథి చెల్వగున్. 64

చ. అలుగక దంపతు ల్గదిసి యర్ధసతీశ్వరు పెక్కుమూర్తులై
యలరఁగఁ జూచి యాత్మవిశిఖావళు లొక్కెడ జైత్రకార్ముకం
బు లొకకడ న్మరుండు వెఱవ్రాని కలంగుచుఁ బాఱవైచె నా
నలరులు నిక్షుదండములు నప్పురవీథుల నొప్పు నెప్పుడున్. 65

ఉ. తోరణగండ్లవెంట వెలజోటులు వీథులదొప్పఁ జూచునో
య్యారపుఁజూపు లింపెసఁగు హర్మ్యపతాకలు రాయిడింప బృం
దారకదీర్ఘికాంబుజవనంబులు పంపిన దూతలు సెప్పఁగాఁ
గోరి పురాబ్జగేహకడకుం బఱతెంచునళివ్రజం బనన్. 66

మ. రయగచ్ఛత్కమలాప్తఘోటకఖురాగ్రక్షుణ్ణకేళీహిర
ణ్మయసౌధాగ్రగళత్పరాగములు గప్పట్టుం బురీనీరజా
లయ యత్యున్నతసంపద న్సురపురీలక్ష్మిం దుటారించి తా
జయముం గాంచిన మెచ్చి బ్రహ్మ కనకస్నానంబు గావించె నాన్. 67

చ. తళతళ మించు మాడువులఁ దాచినవజ్రపుఁజెకడంపుఁగీ
ల్గలజలయంత్రహేమమయకాండము లింద్రునిపీటఁ బొల్చు, మే
డలు సురసౌధము ల్గెలిచి ఢాకగ నచ్చట గెల్పుఁగంబము
ల్నిలిపినరీతిఁ బై కెగయు నీరు యశోవిభవంబుఁ జూపఁగన్. 68

చ. చక్కనిమింట నేగునెఱిచందురుజింక నవేందుకాంతపుం
జక్కటిఁ[4] దోఁచు రత్నమయసౌధములందుఁ గిరీటిపచ్చతా

---

1. చ-ట-కప్పు. 2. ఇక్కడనుండి "దానముగల్గి"యను పద్యమువఱకు క-లో లేదు.
3. బూనఁగడసాలె 4. ట-నున్న

మొక్కలడాలుపేరిసనిముత్తము నిచ్చలుఁ జొచ్చి మేతకై
ద్రోహరనటంచుఁ బందిచోరఁదోలెఁ బురేందిర నాఁగ రాకలన్. 69

ఉ. ఆనినవేడ్క సారసవనౌఘవివర్ధనకృత్కరాగ్రసం
దానితనిర్మలామృతము నాకుల కిచ్చుచు నాత్మవల్లభుం
డై నకళాధినాయకునియట్ల మెలంగుఁ బురద్విజాళి రా
జానుమతంబు ధర్మ మనునర్థము డెందమునం దలంచుచున్. 70

చ. పురినరపాలనందనులభూరిభుజాభుజగాసిధారచే
నరిధరణీధవుల్ నిహతులై తనబింబముఁ దూఁటిపోవఁగాఁ
దొరఁగినక్రొత్తనెత్తురులఁ దోఁగి సరోరుహిణీమనోహరుం
డరుణత పూని కాదె చరమాంబుధిఁ గ్రుంకెడు మాటిమాటికిన్. 71

చ. వెలయుఁ గిరాటకోటి గృహవీథుల మేటికిరీటిపచ్చరా
మళిగలకంబముల్ శుభరమారమణీయసమాగమంబునం
బొలుపుగ నిడ్డరంభ లన బోదెకుఁ గట్టినరత్నగుచ్ఛముల్
గెలలుగ నగ్రసంఘటితకేతనముల్ చిగురాకులై తగన్. 72

చ. అలవికి మీఱఁ బండె పురిహాలికవర్యులు వైచి కొల్చుతి
ప్పలతుదధాన్యము లెఱలనఁ బర్వవిభావసుహేతిఁ జిట్లి క్రే
వలఁ జెదరు న్వసుంధర నవగ్రహదోషహతాద్విరామముం
దెలుపఁగఁ జాలి సారె నలుదిక్కుల రాలునుడువ్రజం బనన్. 73

చ. తెలియక యావిమానములఁ దెచ్చి యమానము లంచు నెల్లరుం
బలుకుదు రింతెకా కవి సమానములై మహిమీఁద నెచ్చట
న్నెలఁగుట గాన మంచు నిజనేమిరవార్భటిఁ జాటిచెప్పుచు
న్వెలదభిజాతకేతుభుజవల్లరు లెత్తుఁ బురీశతాంగముల్. 74

ఉ. ఆనగరంబుకోట యిదునప్పుడు లోపలఁ జిక్కి పోవఁగా
లేనిఘనౌఘము ల్కరటిలీలఁ జరింపఁగఁబోలుఁ గానిచో
దానముగల్గి పుష్కరము దాల్చి ఘనాఘనతావిజృంభణం
బూని ప్రభిన్నపద్మకసముజ్జ్వలభావమున న్వసించునే. 75

ఉ. ఆశుగతాగ్రహం బెనయు నమ్ములఁ దెమ్మెరలున్ స్వవేగవి
ఖ్యాశుగతాగ్రహంబు లయి హత్తి నిజోభయపార్శ్వవర్తితా

కౌశలిఁ జామరగ్రహణకర్మములూన జనాత్మ లన్యభా
వేశమునం దముం బొగడ వీటిహరుల్ నెఱపు[1]న్సుధారలన్. 76

చ. అరుణుఁడు సైంహికేయునకు నల్కి మణీమయఖేటకాకృతిం
గరముల వాల నుగ్రతరఖడ్గమిషంబునఁ బట్టి తెచ్చి యా
సరసిజబంధుశాత్రవుని సారెకు నప్పురిమేటిజోదు ల
య్యురువురఁ బంతమొప్పఁ గలయింతురు దండకుఁ [2]బూంచి సాములన్. 77

సీ. ఒకప్రొద్దుబిగిగూడియుండుచక్రము లెంతయొకవంకఁబొగడొందుశకులి యెంత
యొకవేళఁగాంతిచే నొప్పువిద్రుమ మెంత యొకమూలఁదగుకుందనికర మెంత
యొకపూఁటనివసించునుడుసమూహం బెంత యొకచాయదీపించుముకుర మెంత
యొకతఱి[*]సిరిగూడనొదవినసుధ యెంత యొక[†]పక్షమడరుచంద్రకళ యెంత
గరిమ వీరల గుబ్బలు కన్ను లధర
ములు రదంబులు నఖములుఁ దళుకుఁజెక్కు
లలఁతినగవులు[3] మొగములుఁ దలఁచు నెడల
ననఁగ వెలయుదు రచటిపణ్యాబ్జముఖులు. 78

సీ. లలితప్రవాళజాలపయోనిధానముల్ ధారిణీమృగమదద్రవరచనలు
నవ్యపతంగమండలనభస్స్థలములు రోదసీసురభి[4]ధూపోదయములు
నంపలచ్ఛపలాళిజలదసందోహంబు లలఘుపురాబ్జగేహకచములు
చలదుదగ్రపలాశజాలతమిస్రముల్ హరిదేణనేత్రాసితాంశుకములు
కలితసుమధూళిసుమధూళి[5]వలయమలయ
నికటఘటమానపవమాననికరసుకర
చలితఘనసారఘనసారసహితమహిమఁ
దనరు నవ్వీట వాసనావనులు వనులు. 79

సీ. తావులు లేకున్నఁ దతరత్నశృంగచయంబులో లేమావు లరయు టెట్లు
మ్రోఁతలు లేకున్న ముగ్ధేందుకాంతమార్గములలో సెలయేళ్లు గనుట యెట్లు
చలువలు లేకున్న శాతమన్యవమణిస్థలులలోఁ గొలఁకులఁ దెలియు టెట్లు
మలయుట ల్లేకున్న మరకతోన్నతశిలాప్రతతిలో ననఁటు లేర్పఱుచు టెట్లు
జనము లన గొజ్జఁగుల[6]జాజి చెఱులదుమికి
దొనలఁ గేళ్లుబ్బి కోనలఁదూఁటి జంత్ర

---

1. క-చ-సువాలమున్ 2. ట-జూంచి *క-గిరిగూడ. †క-ట-యాళన 3. చ-ట-మోముగ
లు 4. ధూపోదయ 5. ట-వలయవలయ. 6 చ-జాఁది, ట-జాది.

ముల నిగిడి తుంపురుల్ చల్లు పూవునీటఁ
దనరువలిగొండ లనఁ గేళిధరము లచట. 80

ఉ. పచ్చనిరాజనంపుమడిపజ్జ బలాకలు చుట్టు నుండఁగా
నచ్చపుఁజెందొవ ల్వేలయు నాపురలక్ష్మికి భూతధాత్రి దా
నచ్చులపేరిహస్తముల నంచులముత్తెము లుంచి యెత్తుఁగ్రొం
బచ్చలపళ్లెరంబునడుమం దగునారతిదీవెలో యనన్. 81

సీ. తనసమీరణవృత్తి తథ్యంబు గావింప గణికావశీకారగరిమఁ బూని
తనగంధవహరూఢి తథ్యంబు గావింప నలసయానప్రౌఢి నలవరించి
తనజగత్ప్రాణత తథ్యంబు గావింప జనుల కామోదంబు సవదరించి
తనపృషదశ్వాహ్వ తథ్యంబు గావింపఁ జలువ లంతంతకు సంతరించి
తనమరున్నామకంబు తథ్యం బొనర్ప, ననమసాయక[1]సాయకాత్యంతకాంత
విగ్రహులమీఁదనవపుష్పవృష్టికురిసి, యాపురంబున మెలఁగు[2]మందానిలంబు.

క. అనగర మేలు [3]దానవ, మానవతీసుచకురంగమదమకరీసం
తానతిరోధానవిధా, మానితతరవారి శౌరి మహిమోన్నతుఁడై. 83

క. అవనమాలికిఁ బట్టపు, దేవేరులు గలరు మదవతీమణు లెనమం
డ్రావెలఁదులలో మెఱుఁగుం, దీవెలవలెఁ దనరు రుక్మిణీసత్యలకున్. 84

గీ. శౌరి మిక్కిలి చనవిచ్చి సంతరించు, సవతు లందఱు లోఁగి యిచ్చక మొనర్తు
రందు రుక్మిణి గనియె ముకుందుకరుణఁ, జెఱకువిలుకాని సురలు జేజేలువెట్ట. 85

ఉ. [4]ఇకరగ ముజ్జగంబు నుతియింపఁగ బంధులు గారవింపఁగాఁ
జక్కనిముద్దుఁ బాని నెఱజాణని తెక్క మెఱుంగుఁబచ్చతా
పక్కెరతేజి నెక్కు [5]నవపంచశరుం గని భోజకన్య య
మ్మక్క యనంగఁ జాలు విభవాతిశయంబున విఱ్ఱ[6]వీఁగుచున్ 86

ఉ. ఆచెలిఁ జూచిచూచి కడుపారఁగ ముద్దులపట్టిఁ గానఁగా
నోఁచనియింతిజన్మము గనుంగొన [7]రత్త యటంచు సత్యభా
మాచపలాయతాక్షి పలుమాఱును దాఁ దను దూఱుకొంచుఁ జిం
తాచలచిత్తయై యుదవద న్మదిఁ గుందుచు[8]నుండ నత్తఱిన్. 87

1. (సంగరా), 2 ట-మందానిలుండు. 3. క-దుర్మదమానవతీ 4. చ-ఇక్కరణిం జగంబు 5. ట-నజభవ్యతరు చ-రతిభవ్యతరు. 6. చ-ట-వీఁగఁగన్. 7. ట-రంత 8. చ-నుండునయ్యెడన్.

—* శ్రీకృష్ణుఁడు సత్యభామసౌధమున కేగుట. *—

క. ఒకనాఁడు నందకులనందనుఁ డాసత్యావధూటిధామంబున నా
హ్నికకృత్యంబులు దీరిచి,యకలంకామోదమానసాంభోరుహుఁ డై. 88

సీ. ఒకకొంత యొరఁగినసికమీఁది ముడిపువ్వుటెత్తులదోరయుఁదాయెతులఁ జుట్టి
పన్నీటిచినుకులఁ బద నైననికరంపుఁగస్తూరి వరతిలకంబుఁ దీర్చి
గంబూర మించి కదంబంబు చేసినపలుచనికుంకుమకలప మలఁది
చెక్కుటద్దములపైఁ జికిలివెన్నెలసోన లొలికెడుకట్టాణియొంట్లు దాల్చి
మెఱుఁగుఁజంద్రిక[1]గోణము చెఱఁగుడాలు
వలిపె[2]వలెవాటుదుప్పటివెలికిఁ గ్రమ్మ
మినుకురవకెంపుఁబావలు మెట్టి యొక్క
యతివకై దండ యొసఁగ నొయ్యార మెసఁగ. 89

చ. పవడపునిల్వుఁగంబములపై నెలకొన్నపసిండిబోదెలం
జివురుచుకెంపుడాల్మదనచేతులఁ దార్చినవేల్పురాచఱా
నవరనికేలుఁదామరలచాయలు సోరణగండ్ల ధూపపుం
బొవలుగ మించుకేళిగృహముం బ్రమదంబున డాసి యచ్చటన్. 90

చ. అలఁతిగ నంటినం బొలుచునారజపున్ జగజంతరీరొదల్
గులుకుమెఱుంగుఁగెంపుతఱిగోళ్లనమర్చిననాగవాసపుం
గొలుకుల జాళువాగొలుసుగోళ్లఁ దగుల్కొని వ్రేలుపచ్చఱా
చిలుకలతూఁగుమంచమున శ్రీరమణుండు వసించునత్తఱిన్. 91

చ. చికిలికిరీటిపచ్చరపిచెక్కడపుంబని కీలుఁజిల్కతో
రక మగు పైఁడియాకుపదరంబున నుంచినపండుటాకులి
చ్చకపుటొయారము ల్వొలయ సత్య కరంబునఁ బూని వేడ్క నొ
క్కొకమడు పొయ్య నిచ్చుచు మృదూక్తుల నిట్లనియె న్మురారికిన్. 92

సీ. పినపినయుపరంజిబిరుదులయుడుపంబు గట్టఁ బాండ్యక్షమాకాంతతనయ
కళ గలపచ్చకంకణముల కాళాంజి దాల్పఁ గోసలమహీధవకుమారి
చకచక మించువజ్రంపుటీనెలకుంచె వీవఁ గర్ణాటభూవిభుతనూజ
తళతళ వెలుఁగు రేవెలుఁగుజానునుగిండి పూన మాళవధరాజానిపుత్రి

1. ట-గోణాము. 2. చ-దుప్పటివలెవాటు.

యఖిల వైభవములమించినట్టినాకు, వాంఛిత మొకండు లేదైన[1] వలయుఁ దెలుప
విన్నవింపఁగఁ [2]దగినట్టిచిన్న కొఱఁత, మనవి గల దాలకింపుము మనుజనాథ.

క. అని పలికి తెప్పతుదల, న్ననుసిగ్గు దొలంకఁ దనుఁ గనుంగొనుసత్యా
వనితతలఁ పెఱిఁగి చూడ్కుల, ననుపమ వాంఛితము లొదవ హరి కరుణించెన్.

క. జలజాతాక్షికి నంతట, నెల మసలెం జన్ను మొనల నీలిమ దోఁచెం
దెలు పెసఁగె మేనఁ గోర్కులు, దలఁపయ్యె న్నిదురమిగులఁ దావలమయ్యెన్.

క. నవలావణ్యాకర మగు, నవలా నెన్నడుము బలిసె నడ జడనయ్యెన్
లవలీపల్లవలీలల, నవలీల జయించెఁ జెక్కు లవదాతరుచిన్. 96

ఉ. నిద్దపుసన్న నెన్నడుము నింగి పరిస్ఫుటవృత్తిఁ బూనె లే
నిద్దుర [3]పైకొనం దొణఁగె నిర్మలలోచనవారిజాతముల్
గద్దఱిచన్నుజక్కవ మొగంబులఁ గప్పు దొలంకసాగె న
మ్మద్దియ చంద్రభాను నవమోహనసంపద మేనఁ దాల్పఁగన్. 97

గీ. అంతరస్థితరాజహంసార్భకాప్తిఁ, గాంతమానస ముత్కలికలు వహింప
[4]నౌర పద్మిని సరసాంతరంగసరసి, సరణి కాందోళనము గల్గె నరుదుమెఱయ.

గీ. చంద్రభానూదయము సమాసన్నమైనఁ
బ్రాచిఁ గనుపట్టుకాంతివైభవ మనంగఁ
జంద్రభానూదయము సమాసన్న[5]మైనఁ
బడఁతిమొగమునఁ గనుపట్టెఁ బాండిమంబు. 99

[6]శా. లోకప్రస్తుతచంద్రభానుకలితాలోకాత్మనాథానురా
గైకప్రౌఢిమఁ జంద్రభానుకమనీయాలోకసంపన్నయా
నాకళ్యాణికి సత్యకు న్సరియె నిర్వ్యాజైకచంద్రప్రభా
సాకల్యంబును బూనలేకెసఁగునాశర్వాణియు న్వాణియున్. 100

మ. ఒకనాఁ డంతట యాదవేంద్రుహృదయం బుబ్బంగ సౌభాగ్యసూ
చకనిర్వక్రగతిన్ శుభగ్రహము లుచ్చస్థంబులై భానుచెం
తకుఁ బోకుండెడుసన్ముహూర్తమున నాతన్వంగి గాంచె న్సుతు
న్సుకుమారు న్సురలోకదుందుభిరవస్ఫూర్తుల్ విజృంభింపఁగన్. 101

మ. కమలాధీశ్వరుఁ డంత గర్గముని యుక్తప్రక్రియన్ జాతక
ర్మము గావింపఁగ నాత్మసూతి కఖిలప్రహ్లాదకాక్షీణధా

1. చ-స్వామికెపుడు. 2. చ-ట-తగినది 3. చ-ట-గైకొనం 4. ట-ఔరపరపద్మినీరసనాంత రంగ, చ-ఔరపురపద్మినీ. 5. చ-ట-మగుట 6. ఈపద్యము ట-లో లేదు.

మముకల్మిం దగఁ జంద్రభానుశుభనామం బుంచె ధాత్రీసురో
త్తమమిత్రప్రియబంధువర్గహృదయోత్సాహంబు దీపింపఁగన్. 102

కం. తలయంటి జలకమారిచి,కలకంఠీమణులు నుదుటఁ గాటుక నిడి పొ
త్తులలోన నుంచి కూరిమి,చెలఁగఁగ నానాఁటఁ బ్రోదిసేయుచుఁ బెనుపన్.

ఉ. భూరమణాత్మజుండు నునుఁబొత్తులఁ దలయెత్తి యాడుచున్
బోరగిలంగ నేర్చెఁ బువ్వుఁబోణులు జోలలువాడ వీనులం
జేరుప నేర్చె నెన్నొసలి చెక్కడపుంబనిరావిరేక చే
సారెఁ దెమల్ప నేర్చెఁ గనుసన్నల నవ్వఁగ నేర్చె నల్లనన్. 104

[1]చ. పొలఁతులు మోవి గుల్కఁ గనుబొమ్మల నిక్కుటలు దోఁపఁ జూత్కృతుల్
చలిపి యుదల్చిన న్నగు నెలం జెయిసన్నలఁ బిల్చుఁ దొట్లపైఁ
గొలఁదిగ వ్రేలురత్నమయగుచ్ఛముఁ దప్పక చూచు నక్కునం
గలపులిగోరు లాల దొలఁక న్వదనంబున నుంచు నెంతయున్. 105

శా. కేలం బట్టిన కెంపుటాఁగొలుసులం గించిచ్చలోరోజదో
ర్మూలచ్ఛాయలు కుందనంపురవగుంపు న్నింప బాలు న్వచో
లాలిత్యంబున నిద్రపొమ్మనుచుఁ దొట్లంబెట్టి జోకొట్టుచున్
లాలోలాలి యటంచు నూఁపుదురు జోలల్పాడి లీలావతుల్. 106

[2]మ. అలసత్రోర్వదితుఁ డొయ్యనొయ్యఁ గమనీయావ్యాజవాగ్వైఖరుల్
చిలుకన్నేర్చె ధరాప్రసాధనములై చెన్నొందుపాదాంకని
ర్మలలీలం దగఁ జంద్రభానుఁడు చరింపన్నేర్చె సద్వర్ణితో
జ్జ్వలవృత్తిం గళలెల్ల నేర్చె విధుసంజ్ఞాతుండు సౌమ్యస్థితిన్. 107

శా. నానాఁటం బురిమెక్కు నంగముల నందం బై యురఃపీఠి వి
వ్పానెం జేతులఁ గండెముల్ దిరిగె లో నూహించె శృంగారలీ
లానందంబుల మానసంబు నడ నొయ్యారంబు దీపించెఁ గ
న్గోనల్ వింతలు[3]పూనె రాసుతునకు న్నానాఁగుఁబ్రాయంబునన్. 108

మ. కులుకుంజంద్రికపూరుమాలుకొనచుంగు ల్దాల బంగారుచి
లుకలగోణ్ణాముచెఱంగు మించుకటిసేలాదుప్పటిం గట్టి పొం

1. 2. ట-లోలేవు. 3. చ-ట-గోన

గళుకునవ్రజపుఁగీలు చేసరపణిం గన్పట్ట నారామునీ
ఘులలోఁ దాళము పూని యాకొమరుఁ డొప్పు ల్వెంటరాఁ ద్రిమ్మరున్.

[1]చ. ఉడిగపువారు చే సగతు లూనుచుఁ బజ్జలఁ జేరి పాద పా
వడెయులిరా గెనాంగద లెస్వామి యహా జతనయ్య యంచు వెం
బడిఁ బలుమాఱు నెచ్చరిక* వలుకుచుఁ గుల్కుచు రా వ్యామాయిత
త్తడి దుమికించుచుం జను నతండు వయాళి హయాళి గొల్వఁగన్. 110

క. తనకూర్మిసఖుఁడు సాత్యకి,తనయుం డగువిజయలోలుఁ దగఁ గూడి జగ
ద్వినుతుఁ డతఁ డట్లు మాధవు,నెనసినమకరాంకు[2]పగిది నింపొందుతఱిన్.

సీ. సర్వతోముఖమార్గసంచారియగు వాఁడు తన ప్రజల్ దనివొందఁ దలఁచు వాఁడు
భూదారవిఖ్యాతి భూషితుండగు వాఁడు హితునియక్కఱకునై యొసఁగువాఁడు
బలిగర్వసర్వస్వభంజనుండగువాఁడు పూనికదప్పని రూఢిఁ బొల్చువాఁడు
ధర్మాభి[3]వర్ధనతత్పరుండగు వాఁడు పరుపీటిసిరు లేటఁబఱపువాఁడు
వినుతసర్వజ్ఞతాస్ఫూర్తి వెలయువాఁడు,హరిదువాళింప నేర్పరియైనవాఁడు
దనుజలోకాభియాతి సంతతవిభూతి,నవని యేలుచు నొకనాఁడహర్ముఖమున.

మ. పలుమాఱు న్నముఖా యటంచుఁ బలుదబ్బ ల్పూని వేత్రాఢ్యు ది
క్తలరాజన్యుల నెల్లఁ గంచుకులు వక్కాణింప సాత్రాజితీ
లలనాభర్త జగాహజారమున జాళ్వాసింహ[4]పీఠంబుపైఁ
గొలువుండెం గురు[5]పాండవప్రభులు కింకుర్వాణులై యుండఁగన్. 113

—* నారదాగమనము. *—

సీ. స్వర్గాపవర్గము ల్సవదరించినబిరుదము నాఁగ మహతి యంసమునఁ దనర
నమితతపోనిధానముఁ గాచుభుజగనాయకుఁడు నా యోగపట్టిక యొసంగఁ
దనుకాంతి వెడఁదహస్తమున వ్రాలినవిశానేత నా స్ఫటికకుండిక చెలంగఁ
గంజవిభ్రాంతిఁ జెంగట డాయు తేంట్లు నా వలకేల నలినాక్షవలయ మమర
నారదుఁడు గానఁ బెనఁగొన్న నవ్యచంచ,లాలతలకై వడిఁ జటాకలాప మెసఁగ
నపుడు దివినుండి యుట్టిపడ్డట్లు వచ్చె,దివిజసంయమి హరిసభాభవనమునకు.

క. ఈరీతి నరుగుదెంచిన,నారదునకు నెదురుగాఁగ నడతెంచి నమ
స్కార మొనరించి యుచితా,చారంబుల నతిథిపూజ సలుపుచు నంతన్.

---

1. టు-లో నీపద్యము లేదు. 2. చ-కరణి 3. చ-వర్తన. 4. చ-పీఠంబునన్ 5. చ. పాండవాధిపులు. టు-పాండవాదికులు.

గీ. స్వర్ణమయపీఠమున మునీశ్వరునినునిచి, యతనియనుమతిఁ దానునర్హాసనమును
నధివసించి కృతాంజలి యై మురారి, ప్రబలజలధరధీ[1]రవాక్పటిమఁ బలికె.

సీ. మానిమార్తాండనీమహితపాదనిషేవ మామకపంకసమ్మర్ద మడఁచె
యతిశక్ర నీదుకళ్యాణధామప్రసంగతి సుధర్మావాప్తిఁ గఱపె నాకు
ప్రతిలోకచంద్ర నీరాక మద్వీక్షణోత్పలముల కామోదములు ఘటించె
మునిసార్వభౌమ నీఘనహస్తలాలనం బసమదానసమృద్ధి నొసఁగె నాకుఁ
బారికాంక్షిహర్యక్ష నీభాసమాన, గుణసమున్నతి యున్నతకుంభినీశ
గర్వనిర్వాపణధురీణుఁగా నొనర్చె, [2]నన్ను భవదీయవైభవం బెన్నఁదరమె.

క. అన విని నారదుఁ డిట్లను, వనజోదర నీవు [3]నరుని వైఖరి నీచొ
ప్పున నన్ను వినుతి సేయం, జనునే నినుఁ బొగడఁ గమలసంభవువశమే. 118

గీ. అఖిలసంయమివరులు బ్రహ్మాదిసురులు, ప్రస్తుతింపఁగ వసుమతీభార ముడుప
యాదవాన్వయమునఁ బుట్టినట్టినీవు, మతిఁదలంచిన నారమాపతివి గావె. 119

[4]మ. స్తనపానం బొనరించుచో శిశువునోజం బూతనాక్షీరజీ
వనకీలాలవిషంబు లొక్కమొగి దుర్వారస్థితి న్నీవు గ్రో
లిన నేకార్థవిబోధకంబు లయి పొల్చెం గాదె తత్క్షీరజీ
వనకీలాలవిషంబు లన్వదము లవ్యాజప్రభావోదయా. 120

మ. సురలోకేంద్రనియుక్తకల్పజలదస్తోమంబు లొక్కుమ్మడిం
గురియన్ ధేనులఁ బ్రోవ నెత్తునపు డాగోవర్ధనోద్యద్ధరా
ధర మింపొందదె నీభుజార్గళమునన్ ధారాధరప్రక్రియన్
[5]హరి నీవెప్పుడు నాదివర్ణము గురుఖ్యాతిం గటాక్షించుటన్. 121

ఉ. క్రుంగినకాళియోరగము [6]కూఁకటివేరు భుజార్గళంబు లు
త్తుంగతరప్రకాండములు తోరపునవ్వులు పూలు నర్తనా
సంగచలచ్ఛిరోజములు షట్పదపంక్తులుగా సురద్రులీ
లం గమలాక్ష కోరినఫలంబు లొసంగవె [7]యొట్టివారికిన్. 122

[8]క. ఏపట్టునఁ గువలయపీడాపహృతి యొనర్తు ననుచు యదువంశమునన్
దీపించియుఁ గువలయపీడాపహృతి యొనర్పఁ జెల్లునయ్య మురారీ 123

---

1. క-ట-వాక్ఫణితి. 2. ట-నన్న. 3. నరుని వైఖరియనుటలెస్స. 4. ఇదియు దీనిక్రిందిపద్యము-టలో లేవు. 5. క. హరినీ వెప్పుడునాదివర్ణగురువిఖ్యాతిన్ 6. క. కొమ్మలునీడు. 7. చ. ట. కల్పిరియాళికిన్ 8. ట-లో నీపద్యములేదు.

క. అని విన్నవించి యతఁ డో,జనార్దనా యిప్పు డేను సవసవగా నే
ర్చినపాటి యొక్క గీతము,వినిపించెద నంచుఁ జేతి[1]వీణె చెలంగన్. 12

క. సరిగమపధనిసమాఖ్య,స్వరసందర్భంబు మెఱయ సారెలమీఁదం
గరమిడి గమకము లేర్పడ,మొరయించుచుఁ గొన్నిగీతములు వలికింపన్.

సీ. ఒకలేమ యతనికి నుద్ది లేదని యిచ్చుకరము నా మదు పొందుకడకుసాఁ
గేయ మాఁ గాదన్న గెలువఁగొంగిచ్చెనాఁబావడయొకయింతిబయలొసం
నువిద యొక్కతె మెచ్చి యొసఁగూ నెనాఁజామరంబెత్తి వంచనేరకవసించెఁ
బరులవిద్యలు బరాబరిసేయుతెఱఁగు నా సుదతియొక్కతె మోదు్వసురటివిస
నిట్లు కొలువుననున్నపూర్ణేందుముఖులు,సమహితాశ్చర్యపరవశస్వాంత లై
హరియుఁ గన్నుల చెవులుగా నాలకించె,నాతపోధనుమహతీరవామృతంబు

శా. ఔరా మీటు బళీరె కంపిత మహో యాందోళితస్ఫూర్తి యో
హోరే మూర్ఛన బాపురే శ్రుతులు మే లుల్లాసితప్రౌఢి మ
జ్ఝారే లీనము చాఁగురే స్ఫురితముల్ శాబాసు ధా లంచు న
త్యారూఢప్రమదోన్నతి స్మరహరుం డాలించి వర్ణించుచున్. 12

గీ. హృద్యతరతద్విపంచికావాద్యవిద్య,[2]నభ్యసింప మనశ్శకుతూహలము పూని
తనదుచెంగట [3]నలరువైదర్భికూర్మి,సుతుని సత్యా[4]తనూభవుఁ జూపి పలికె.

క. ఓవాచంయమి కొన్నాళ్లీవిక్కడ నధివసించి యీబాలకులం
దావకశిష్యులుగా దయఁ, బ్రోవు మన న్నుఖసరోజమున నగవొలుకన్.

శా. అంగీకార మొనర్చి [5]మౌనివరహర్యక్షుండు వా రిర్వురన్
సంగీతాభ్యసనైకతత్పరులఁ జెంతం జేరఁగాఁ బిల్చి త
న్మాంగళ్యాచరణం బొనర్చి కవవీణ ల్గూర్చి కౌతూహలా
భంగప్రౌఢి నుపక్రమించె శుభదప్రఖ్యాతలగ్నంబునన్. 13

సీ. సప్తస్వరములమూర్ఛనలు తప్పకయుండ గుఱుతుపట్టుటకునై కొన్నినాళ్లు
సూళాదితాళము లొసఁగియ నలంకారగుంఫనం [6]బొనఁగూర్పఁ గొన్నినాళ్లు
వాగ్గేయకారవిరచితగీతంబులు [7]గుక్కవట్టుటకునై కొన్నినాళ్లు
గౌళనాటవరాళికాముఖ్యరాగము ల్కొదలేక పలికింపఁ గొన్నినాళ్లు

---

1. చ. ట. వీణియచెలఁగ 2. చ. ట. అభ్యసింపఁగుతూహలమాత్మఁబూని. 3. చ. ట నడరు. 4. చ.ట. తనూజుని 5. చ. ట. యామునికులాధ్యక్షుండు 6. ట. బొనరింప 7. చ-ట-గొంకులేకపఠింపఁగొన్నినాళ్లు.

వీన్నియప్రబంధములుమీఱఁ గొన్నినాళ్లఁ
[1]గోరి గాయంబు లాదవింపఁ గొన్నినాళ్లఁ
గాఁగ వారల కాజగరాగతపసి
నిరుపమవిపంచికాప్రౌఢి నేర్పి[2]యపుడు. 131

శా. ఆలేఖవ్రతి మున్ను రుక్మిణికి సత్యాతన్వికిం బూలకై
కైలాటంబులు దా నొనర్చుట మొదల్గా నెక్కుడౌ జాఠర
జ్వాలాశాంతి యొనర్పకున్కి మిగుల న్సంతప్తుఁడై యప్పుడ
బ్బాలుర్ దత్సుతు లౌట నెమ్మనమున న్భావించి సోత్కంఠుఁడై. 132

ఉ. ఆహరిసూను లిద్దఱు మహామతిమంతులు గాన సంతతో
త్సాహముతోడ నొండొరులచందము మెచ్చక వల్లకీకళా
దోహలులై చెలంగఁ గని తోడనె వారికి వాదువెట్టఁగా
నూహ యొనర్చి యందు మఱి నొక్కనిఁ గైకొని వీణనేర్పుచున్. 133

—* నారదుని పక్షపాతము. *—

గీ. అకటుకు గూటిపట్టి గయ్యాళితపసి, యెంతప్రియములు సెప్పిన నియ్యకొనక
చంద్రభానునిపేరన్న సైఁప కట్లు, పక్షపాతంబు మీఱ నుపేక్ష సేసె. 134

సీ. సారెలు బెళకినఁ జక్కఁజేయు మటన్న నిదెవత్తు నిలుమని నదికి నేగుఁ
దంత్రు లూడినయవి తగఁ గట్టి యిమ్మన్న జపవేళ యనుచు నిశ్చలతనొందు
శ్రుతు లెల్ల డిగ్గినచోఁ గూర్చి యిమ్మన్న దేవపూజావిధి దీర్చెద నను
నాలాపరక్తికి మేళవింపు మటన్న ధ్యానవేళ యొకింత తాళు మనును
మఱియు నేమాట యడిగిన మమత లేక, చెంగిచెంగి చరించునాచేష్ట లెల్ల
మౌనివరుపక్షపాతంబు గా నెఱింగి, చంద్రభానుఁ డసూయావిచారుఁడగుచు,

క. ఒకనాఁ డామునిసాగర, సికతాస్థలి నొంటి జపము సేయఁగఁ దనలోఁ
దుకతుకఁ దాళఁగ లేక చ, టికి సత్యాత్మజుఁడు చని నొడివెను మృదూక్తిన్.

శా. అయ్యా నీవు లతాంతసాయకునిపట్టై వల్లకీవాద్యముల్
నెయ్యంబుం బ్రమదంబు నేరుపడ [3]నిర్నిద్రస్థితిం దెల్పి స
న్సయ్యాటంబుల నిద్రవుచ్చితి రహస్యం బేమియుం దెల్పలే
దయ్యా యేనపకారినే తెలుపరాదా నాకు నాచందముల్. 137

1 ఈచరణము క-లో లేదు. 2. చ. ట. నేర్పి నేర్పి. 3. చ. ట. నిర్నిద్రుండవై తెల్పి

సీ. ఎదుటఁ బిమ్మట నైన నెప్పుడేనియు భక్తి సేయనే నన్నింత సేయనేల
యేయెడ నీ వానతిచ్చినదాస్యంబు సేయనే నన్నింత సేయనేల
[1]నిత్యకృత్యంబుగా నీపాదసంసేవ సేయనే నన్నింత సేయనేల
కలనైన నీమూర్తిఁ గనుఁగొన్న వినయంబు సేయనే నన్నింత సేయనేల
భావవాక్కాయకర్మము లీవశంబు, సేయనే నీవు నన్నింత సేయనేల
సవతిబిడ్డల కిట్లు మత్సరముఁ బెంచి, చివ్వ యొనరింప నింత సేసితివి గాక.
క. అని యిట్లు పలుకుపలుకు, ల్వని తనయత్నంబు కమ్మఫలించె ననుచు న
మ్మునిఁ యలరి రిత్తబొమముడి, గొని యప్పుడు తెచ్చికోలుకోపముతోడన్.
మ. తగు నయ్యా నను నిట్లు పల్కుటకు సత్యానందనా నీవు ము
న్నుగ నీవీణియ మీఁటి యాశ్రుతులసంధు ల్గూర్చి యాశుద్ధనా
శగభేదంబు లెఱింగి యాసకలమేళప్రాప్తము [2]ల్నేర్చి యుం
టిగదా పెక్కులు పల్కనేల బళిరే నీశిష్యతల్ చేకుఱెన్. 140
[3]మ. మరుఁ డెంతేనియుఁ దెల్పినం దెలియు నీమార్గంబు నీకంటె మా
సరవిన్ జొమ్మున నమ్మగట్టుకొని యాసాయంప్రభాతంబు ని
ద్దురయుం గూడును మాని తెల్పినను నీదుర్బుద్ధి యిట్లయ్యె నెం
తురె మా నేరమి గాఁగ నిట్టి వకటా ధూర్తస్వభావంబునన్. 141
క. తగ వెఱుఁగలేక యిటువలెఁ, దెగువరి వై పలుక నీకె తీరెనొ కుసుమా
శుగునకును నీకు నిపుడీ, జగడంబులు సేయఁగా నిచట నిల్పితినే. 142
సీ. చెల్లఁబో నీచేతివల్లకీరత్నదండము దాల్ప యోగదండంబె మాకు
[4]నయ్యయో నీచేతియసమవిపంచికగవిసెన ల్కాషాయకములె మాకు
నకటా నీచేతియలపరివాదినీతంత్రీలతలు జన్నిదములె మాకుఁ
గటకటా నీచేతికచ్ఛపీణియకాయ సలిలపూరితకమండలువె మాకు
బాపురే నీకు విద్య నేర్పంగవలసి, పడినపా టెల్ల నుగ్రతపంబె మాకు
హరిహరీ నిన్ను నిట్టిదుష్టాత్ముఁ డౌట, నెఱుఁగలేనైతి విడువు మిదేడగోడవ.
క. అనలినాత్ముఁడు నేర్పుము, గానమ్మని ప్రియము చెప్పఁగా [6]బాలుఁడుగా
పోనిమ్మని యే నిందుకుఁ, బూనినఫల మబ్బెఁ జాలుఁ బోపొమ్మనినన్. 144

1. చ. లో నీచరణము సాల్గవదిగా నున్నది. ట-లో నీచరణమునకు మాఱు 'పోరాని చెడకుండ గారాముతో భక్తిసేయనే నన్నింత సేయనేల' అని కలదు. 2. చ. చూచి యుం. 3. క-లో నీపద్యము లేదు. 4. ట. నయ్యరో. 5. చ-తంత్రీక ల్పలుజన్ని దములె 6. ట. పొలిపోటన్.

ఉ. ఆయదురాజసూనుఁ డెదురాడఁగ నులుకుచు విన్నఁబాటుతో
నాయెడ నుండఁగా నళికి యల్లన నైజనివాససీమకుం
డాయఁగ వచ్చి యాత్మనికటస్థితుఁ బ్రాణసఖాగ్రగణ్యు నై
నేయతనూజుఁ గాంచి మది నిండిన నెవ్వగతోడ నిట్లనున్ 145

ఉ. లోకమునందు నోవిజయలోల కటా యిటువంటిదిట్టప
ల్గాకి[1] మునీశ్వరు న్వెదకికంటిమె యే నిపు డేగి గానము
న్నా కొకయింత తెల్పు మనిన [2]న్నను జేసినపక్షపాతముం
గాక పొకాలు మంచుఁ గలఁకం బలికెం బనిలేనిపాటకున్. 146

మ. అరయ న్వీణెకుఁ దానె బ్రహ్మకొడుకే హంకారము ల్గాక తుం
బురు విశ్వావసు శంబళాశ్వతరు లుద్భూతప్రభావోన్నతు
ల్పరికింపం దనుఁ బోలలేరె యిఁక నేఁగా యీవితాజోలి యే
వెరనైనం గని కాంతు నిందొకరిచే వీణాప్రవీణత్వమున్. 147

క. అని సాత్యకితనయుఁడుఁ దా,నును దుంబురువలన నఖిలనుతవీణావా
దనవిద్య నభ్యసింపం,జనుటకు మార్గంబు[3] వెదకుసమయమునందున్. 148

సీ. కాసారతప్తోర్మికాసారపరిఖిన్నసారసం బున్నాళసారసంబు
భానవజ్వలనోగ్రభానవజ్వలనార్తకువలయం బామ్లానకువలయంబు
ఘనసారసౌరభఘనసారరతవల్లవీజనం బుద్భ్రాంతవీజనంబు
వారణాసైరిభావారణక్షుభితనీరాశయం బలసనీరాశయంబు
పాటలలతాంతమంజరీపాటలంబు, దారుణధరాపరాగసదారుణంబు
ధూమలలితాటవీవహ్నిధూమలం బు,దగ్రతపనాతపము మించె నాతపంబు.

[4]చ. పుడమి మహోగ్రతాపమునఁ బొక్కఁగఁ బాదము లూఁది త్రొక్కఁగా
జడియుచు భానుఁ డేగ దివసంబులు దీర్ఘము లయ్యె నర్థితో
నడరె మరీచికాచయము లయ్యనునార్తిసహింపలేక వే
యడుగులకు న్మడుంగు లెనయన్ దినలక్ష్మి యొనర్చెనో యనన్. 150

[5]క. బీరెండల జలజంతులు, దారిన యాదోవరుండు తహతహచే ని
ట్టూరుపు వుచ్చెనన సెగం,బేరినప్రత్యగ్దిశాసమీరము విసరెన్. 151

---

1. ట. తపస్వీము న్వెదకి. 2. క. ట. న్మనిచేసిన. 3. చ. ట. నరయు 4. 5. ట-లో నీపద్యములు లేవు.

క. మిటమిటనికటికిమెండం, [1]బటపటపటఁ బగిలి పాయవడినవెదురులం
బుటమెగయుచు ముత్తియము, ల్చిటిలినగతి నాడె శాల్మలీతూలంబుల్. 152

[2]చ. అనలుఁడు కేలినగ్రపమద మైనప్రభం [3]గెడగూడి యుండి వే
గ నతఁడు దారుణాశుగముఖంబుల వేఁడిమిచూప భీతిచేఁ
గనలుచు ధూమదామమిషఁ గైశికము ల్చెదరంగఁ గానకుం
జనియె వనం దనర్చెఁ దరుసంధుల దావహుతాశకీలముల్. 153

చ. సవితృమయూఖము ల్నెఱిలసందులఁ దూఱుట యొప్పె దేహసం
భవ మగునట్టిడప్పి యడఁపన్ ధరఁ గల్గుమహానదీనదాం
బువు నెడఁగ్రోలియుం దనివిఁబొందక భానుఁడు ధారిణీతలం
బవిలిచి భోగవత్యుదక మానఁ గరంబులు సాఁచెనో యనన్. 154

[4]మ. తరణిగ్రాహహుతాశహేతి ఫణిఫూత్కారార్చిఁ గాంతారదు
స్తరవైశ్వానరకీలఁ దప్తపథికశ్వాసాగ్నిన ర్కాంశువి
స్ఫురణం గ్రూరతపంబు సైఁచి యచలాంభోజాక్షవాత్యావిస్పృ
త్వరధూళీపరిపాటి విష్ణుపద[5]పదవ్యం బొందె నందంబుగన్. 155

చ. వికచముఖాబ్జము ల్మొగుల వేణులు దూలఁగ నూర్మికాంచిహం
సకవితతు ల్దొలంగ రవిబారి నజీవనలై తరంగిణీ
ముకురకపోల లెల్లెడ సముద్గతతాపము సెందఁ గ్రమ్ముఘ
ర్మకణికలో యనంగఁ జెలమ ల్దగు సధ్వగకల్పితంబులై. 156

మ. ఘనతాపంబున జంతువు ల్మొగుల మేఘశ్రేణి [5]లే కెందునుం
జనునే వీనిమహార్తి యంచు విధి తత్సామగ్రిఁ గల్పించె నాఁ
దనరున్ దావమునం బొగ ల్వ్యజనబృందవ్యాప్తి వాతూలముల్
మనుజాంగంబుల ఘర్మతోయము లినాశ్మశ్రేణికం దేజమున్. 157

శా. ఆవర్తానిలముల్ పరిభ్రమణవిద్యాప్రౌఢి సన్మార్గమ
ధ్యావాసంబులు గాంచుట ల్తెలిసి యీర్ష్యాప్తి న్నుపరోర్వరువం
శావిర్భూతవిచిత్రభవ్యవనమం దావిద్య సాధింపఁగా
నావేశించినరీతి మందపవమానాంకూరముల్ గ్రిమ్మరున్. 158

1. చ. పటపటమని 2. ట-లో లేదు. 3. చ. జతగూడి. 4. 154, 155, 156, 157, 159, 160 పద్యములు ట-లో లేవు. 5. చ. గాకేమిటన్.

క. ధారాగారప్రతిమా,కారార్పితయంత్రవారికణములు దనరెం
బేరెండ నచేతనులశ,రీరములను జెమటజడి కురియుచందానన్. 159

సీ. అతికాల సెగ సోఁకి చుఱుకనఁగాఁ జెట్లబడి త్రోవ నడిచిరి పథికు లెల్ల
బలుదప్పిచే నాలుకలు వెల్వడఁగఁజాఁచి దగదొట్టి పడియుండె మృగము లెల్లఁ
బొదలలోఁ దలఁ దూర్చి యొదిఁగి సారెకు శీకరములుచిఁదెడుసింధురమ్ము లెల్లఁ
దరుకోటరములలో నురిఁగి కన్నఱమోడ్చి తలనికరు రవిఁజూచెఁబులుఁగు లెల్ల
నుప్పరము లేచు కెంధూళిచప్పరములఁ
బాటలవిభావిభాసితాంబరము మెఱయ
నురిదిబలుగాడ్పు వేఁడినిట్టూర్పు లొలయ
శ్రాంతలై యుండె రవుసు దిక్కాంత లెల్ల. 160

ఉ. చక్కెరచింతపం డొడిని నందిట నేలకిచద్దివాళ్లిపైఁ
జెక్కినకానుగాకు వలచే జలకుండిక వీజనంబు వే
ఱొక్కకరంబునందుఁ బదయుగ్మమునం బిగివాళ్లు గల్గి న
ల్దిక్కుల నధ్వగు ల్బడలి త్రిమ్మరి రట్టెకడిందియెండలన్. 161

చ. పరఁటులపేరిపెన్బడియపట్టుల నీరము లుంచి యచ్చటం
దరుణులపేరిదీమములు దార్చి తదీక్షణరాజిపేరిపే
రురులు ఘటించి పాంథమృగయూథము లోపఱుపం దలంచి క్రొ
వ్విరివిలుబోయ తాపుకొను వేఁటపొలంబు లగుం బ్రపావళుల్. 162

చ. ఇరుగడఁ జిమ్ముధూమమునుపయిం దొలఁకం బువుసీరు పచ్చక
ప్పురమును మేళవించి మెయిఁ బూసి చలద్వ్యజనానిలచ్ఛటల్
నెరయఁగఁ గేళికృత్రిమధునీతటులం గలవట్టివేరుచ
ప్పరములఁ బవ్వళించి నరపాలురు నిద్దురఁ జెంది రయ్యెడన్. 163

శా. ఆవేళ న్స్మరవైరినందనుఁడు శైత్యాకాంక్ష నంభోధివే
లావిస్తీర్ణలవంగికాలవలికైలామాధవీకాయమా
నావాసాంగణసైకతస్థలములం దాలోలకల్లోలడో
లావిశ్రాంతమరుత్కిశోరజనితోల్లాసాప్తి నుండెఁ బ్రహీన్. 164

మ. ప్రణతాభవ్యవిదార దారకనకారజ్యత్పరీవార వా
రణసంరక్ష్యవతార తారధరధైర్యప్రౌఢిమాధార ధా

రణవన్మానససార సారససుహృద్రమ్యోజ్జ్వలాంకార కా
రణశూన్యోక్తివిహార హారహారవిభ్రాజద్యశోవైభవా. 165

క. దహరాజితరాజితచిద్గ్రహరాజ హరాజనుత జరాజననరుజా
రహిత యజరహితయతిజను,రహితల్ప యనల్పధృతిజితాబహిరహితా. 166

పృథ్వి. సదాశయ సదాశయాంబుగుహసంస్ఫురత్తుండికా
మదచ్యుతిమదచ్యుతశ్రుతిశమప్రసన్నాత్మకా
పదానతపదానతత్పర యపారబోధోర్మికా
ముదాత్తసముదాత్తసత్త్వగుణ ముక్తికన్యాభికా. 167

గద్యము. ఇది శ్రీమద్దత్తాత్రేయయోగీంద్రచంద్ర చరణారవిందవందనసమాసాదిత సరసకవితారసోదాత్త దత్తనామాత్యసోదర్య మల్లనమంత్రివర్యప్రణీతం బైనచంద్రభానుచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# చంద్రభానుచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమాహురనగరోన్నత, భూమీధరశిఖరనిలయ భూరిసుగుణ ల
క్ష్మీమహనీయాభ్యుదయ సు, ధామధురకథాభిధేయ దత్తాత్రేయా. 1

వ. అవధరింపు మాసమయంబున.

సీ. చిలుకంపపొదికిఁ దార్చిననెమ్మిపురిజల్లి చేనెక్కిడినచేగసెలసువిల్లు
గట్టిగా దట్టిగాఁ గట్టినపులితోలుఁ గుడివంక దోఁపినకుఱుచపిడెముఁ
[1]బేరడఁ జేర్చినపికిలిపూవులచేరుఁ గుడిసంది గురిగింజకుట్టుదండ
జుంజుఱుసికమీఁదఁ జుట్టినతలముళ్లు దట్టిలోపల నఱపెట్టుచుట్ట
కోరమీసలుమిడిగ్రుడ్లుగునుకునడుపు, బెదరుఁజూపులుఁగఱిమేనఁ గదురుకంపు
వలుదయొరచ్చలునుగల్గివచ్చె నెఱుకు పాళెగాఁ డొక్కఁడాచంద్రభానుకడకు.

గీ. వచ్చి సాష్టాంగ మొనరించి తెచ్చినట్టి, కానికలు మ్రోలనిల్పి దోఁగలుగనిలిచి
సారె నవి యెల్ల వేర్వేఱఁ బేరుగ్రుచ్చి, ఘనఘటాఘుర్ఘరధ్వానగరిమఁ బలికె.

సీ. ఈవచ్చిబదనిక లేపాటి నూపినఁ దఱుముసింగంబైన వెఱచి పోవు
నీవీలిగఱికోల లేపాటి కాఁడిన గజములైనను జాఁపకట్టు గూలు
నీపాఁపతలకెంపు లేపాటి గన్నను గబ్బిబెబ్బులియైనఁ గళవళించు
నీపెద్దవిలుమ్రోఁత లేపాటి విన్నను రొప్పుకోలంబైనఁ దప్పునుఱుకు
దేవ యీతెఱఁగు వానిలో నేవిపేరు, గ్రుచ్చినను జాలుఁ జనుఁగలగుండువడుచు
గండభేరుండవాహరిగవయశరభ, ఖడ్గములు నాఁగఁ గలుగుమెకంబు లెల్ల.

శా. సామీ దేవరపేరు సెప్పికొని యీసంద్రంపుఁ జెన్గోనలో
గీముల్ గైకొని చుట్టపక్కములతోఁ గీడెన్నఁడు న్లేక మా
భూమిం గల్గినవేఁటతోడఁ గడుపు ల్బారింతు మింతేనియుం
బూమె ల్మామదిలో నెఱుంగక దినంబుల్ ద్రోతు మిచ్ఛాగతిన్. 6

క. దేవరకు వేఁట వేడుక, గావలసిన నిపుడ రమ్ము కానలఁ దఱచై
యేవంకఁ జూచినను దగఁ, బోవఁగలే కాడనాడఁ బొరలుమెకంబుల్. 7

1. ట. పిరిదండఁ జేర్చిన.

[1]ఉ. ఏమని చెప్పవచ్చు జగతీశ్వర యీశ్వరుఁడే యెఱుంగు న
య్యామనిఁ బంటచేల [2]డిగి హావళిసేయు మహామహీజముల్
భీమనిశాతదంష్ట్రికల బిట్టగలించుచు నేకలంబు లా
హా మనవచ్చునే యవి మహారభటిన్ సెలకొట్టి రొప్పినన్ 8

క. మిలమిలనిగోళ్లఁ జిలుపలు,గులగులలుగఁ గొట్టునచట్క్రోల్పులు గవిం
బొలవోలయ నెఱిఁగి యెలుకులు,పులిపులియన్నపుడకవిసిపులిపులిసేయున్.

ఉ. త్రెళ్లవు వాఁడిడొంకెనలఁ దీఱవు చిల్కులకోరికోలలన్
డొల్లవు బల్లకోలల ముడుఁగవు మేటికటారిపోటులం
జెల్లవు చిప్పకత్తుల నశింపవు వ్రేఁకవు బాఁకుతాఁకులన్
భల్లము లచ్చటన్ హృదయభల్లములై తగు భిల్లకోటికిన్. 10

[3]క. తఱిమి పయి నంటుకుక్కలఁ,గఱచు న్వడిఁ దిరిగి యెముకుగవిసినకుందే
ళ్లటకిముఱి నే మని చెప్పను,నెఱి నెఱియలనూఱునాఱు నెలవై యుండున్.

గీ. చేత డేగఁబట్టి సెలకట్టె గైకొని,ప్రొద్దుపోక పొలమువోయెనేని
దినము వలసినన్ని తేవచ్చుఁ బులుఁగుల,వానితఱచుఁ జెప్ప వశమె నాకు.

సీ. మోటుదప్పకయుండ మూఁకనిల్పినఁజాలుఁ బలుతీవియలెయురు ల్పన్నఁగలవు
తెరువులఁ గుక్కల నిరవుకొల్పినఁ జాలు నెఱులె యోదంబులై నిలువఁగలవు
చెంతల దీము లుంచినఁ జాలు సుడిగాలి నెగయుదుమ్ములె తెర లెత్తఁగలవు
మొనసి మాఱుమ్ము లొడ్డినఁ జాలు నెండమావులెపోతనీరులై మలయఁగలవు
చో పిడినఁ జాలుఁ గారగ్గిసోఁకికనలి,మిగులు కొయ్యలె వసులయి మించఁగలవు
నీవు వచ్చినఁ జాలు ధాత్రీవరేంద్ర, వేఁట తనుదానె వేఁటఁ గావింపఁగలదు.

—చంద్రభానుఁడు వేఁటకేగుట—

క. అన వాని నరిదిరియొసఁగుల,ననిపి గృహంబునకు వచ్చి హరికి మృగయపై
ననురక్తిఁ దెలిపి యాతని,యనుమతిఁ బ్రియసఖునిఁ గూడి యధికోత్కంఠన్.

సీ. సవరని కెంబట్టుచల్లడంబు ధరించి గట్టిగాఁ [4]బైసూపుదట్టి గట్టి
సరిగెక్రొంబనికందుసాలెయంగియఁ బూని చలువచెంగావిపచ్చడము గప్పి
జిలిబిలిజల్లుపచ్చలప్రోఁగులు వహించి కమ్మఁగస్తురిఁ దిలకమ్ము దీర్చి
కుడివంకఁ బవడంపుఁబిడివంకి సవరించి యెఱుతఁ గెంపులతాళి యలవరించి

1. ఈపద్యము ట-లో లేదు. 2. చ-బడియావళి 3. ఇది ట-లో లేదు 4. క-బైనపుదట్టి.

బెళుకుడాల్ జాళువా వాగ్రేతపేరోజంపుఁ
దళుకు వన్నెకుళాయి యాదల నమర్చి
వేత్రధరహాంకృతు లెలర్ప విజయశంఖ
వితతులు సెలంగ సదనంబు వెడలుటయును. 15

1సీ. అడుగంటఁ ద్రొక్కిన యహితప్రతాపకీలములు నాఁ బసిఁడిలాళములు మెఱయ
జవభీతనిజమృగసంరక్షణకుఁ బాద మొందిన శశి యన నందె సెలఁగ
మహనీయగళదేవమణిపార్శ్వఘటితముక్తావళి యన గవ్వదండ దనర
ఘనతార్క్ష్యతాదష్టకవికాహినిర్మోకఖండంబు లన ఫేనకణిక లొలుకఁ
బట్టుపల్లంబుఁ గేడెంబుఁ బట్టియంబుఁ, దరకసంబును సింగిణి సిరిమితఱటు
జిగిదొలఁకు లేవ పాలాసి మొగసరియును, బూని సాహిణి యొకకత్తలానిఁ దెచ్చె.

గీ. తెచ్చినఁ దదీయముఖసముత్థితనితాంత, భద్రసూచకహేషకుఁ బ్రమద మంది
ఫణిహరతురంగసుతుఁడు సాహిణులు సారె, 2ధీరెయని సన్నుతింపఁగఁ దేజి నెక్కె.

క. అపు డెత్తిన నవబర్హాతపత్ర మవతంసబింబితంబుగ సత్యా
ధిపతనయుఁడు బాల్యాకల్పపరిస్ఫురితాత్మగురువిలాసముఁ దాల్చెన్. 18

గీ. త్రోపుత్రోపాడి యతని కుర్వీపతనయు, లెలమిఁ గత్తులతోఁ జేతులెత్తి మొక్కఁ
బసిఁడి పరుఁజులు కోటీరపటలిఁ బొల్చెఁ, దత్ప్రతాపంబు శిరములఁ దాల్చి రనఁగ.

గీ. సకలసేనలు గొల్వ నా చంద్రభానుఁ, డిట్లు వేఁటకుఁ జనుదేర నెఱిఁగి పురము
నలుగడలసంత వెడలిరి నల్లప్రజలు, గాఢమృగయామహోత్సాహకలకలమున.

చ. వలలు నురుల్ సిడుల్ పిసులు వంకరదుడ్డులు పందిపోట్లు దీ
ములు గొరక త్రైరల్ జిగురుమోకులు జోనలుఁ గాలియుర్లుఁ 3బోఁ
గులు మిడివిండ్లు 4బండగులుఁ గొమ్ములుఁ బాదులు వల్లెత్రాళ్లుఁ జి
వ్వలతడికెల్ ధరించి యిరువంకలఁ జేరిరి కొంద ఱుద్ధతిన్. 21

గీ. కొమ్ముటురులుఁ గాలిగుంటులు చిలువమోర, లఱుతగవ్వదండ లలఁతిగంట
లమర సారెఁ బెదవు లల్లార్చి గురగుర, మనుచు వేఁటయిఱ్ఱు లరుగుదెంచె.

చ. వెనుకరుమాలు లంసముల వ్రేలెడు కొంచెపుఁ జల్దిచిక్కము
ల్పనుపయి కావిబొట్లుఁ బదిలంబుగఁ గట్టినదట్లు గొండ్లఁ జే

1. ఈ సీసము మొదలు "కొమ్ముటురు" లను పద్యమునకు టం-లో లేవు. 2. న-ధీరయనుచు సన్నుతింపఁగ 3. చ-బొంగులు 4. చ-బండకులు

గ్రీసతరిసిల్బు[1]దండలును జే నణుజుల్గలఁ దేఁగ వేఁటరుల్
గునుకుచు రాజుౘ్రమోల సెలగోలలు సైకొని వచ్చి రుబ్బునన్. 23

ఉ. జాతర పుట్టచెండు నెఱజాణ గయాళి కరాళి దిట్ట చిం
బోతు తుపాకి జోగి సుకభోగి తుటారి తలారి మారి సం
గాతి లకోరికోల యనఁగాఁ జనుకుక్కలఁ గేలఁ బూని య
త్యాతతశృంఖలాఘులఘులార్భటి మించఁగ వచ్చి యుద్ధతిన్. 24

సీ. బోటుమాటలుగావుపొదరొప్పసింగంపుఁగోదమనైననుగూలఁగ్రుమ్మఁగలము
వట్టిమాటలు గావు పుట్టకూటికిడాయు నెలుఁగునైనను బట్టినిలుపఁగలము
పెక్కుమాటలుగావుగ్రక్కునఁ బైకొన్నపులినైనఁ జేయిచ్చిపొడువఁగలము
రిత్తమాటలుగావు హత్తికొమ్మునఁ జిమ్ముకిటినైనఁ జోరఁబాఱి కెడపఁగలము
వదరుమాటలుగావు దేవరపాలానఁ, గలుగుపులుఁగులనన్నింటిఁబిలువఁగలము
చిత్తగింపుము మమ్మని సెలవువిన్నఁ, బలుకగొడ్డంబుగఁగలబోయపాఁజగొలువ.

క. రయలటహాపటహాఢక్కా, జయకాహళభేరిపణవశంఖహుడుక్కా-
భయదార్భటిదెసలద్రువం, బయనం బయి యేగి చంద్రభానుం [2]డంతన్.

సీ. ప్రబలగంధావేశభద్రభేదిమృగేశమస్రుణకేసరమంజుమంజరితము
కుపితోగ్రచిత్రాంగఘోషభీతకురంగపటల[3]చారుకుడుంగపంజరితము
ఘనఘనాఘనలీలగాఢకాంతిస్థూలకుధరశిలాజాలకుంజరితము
దంష్ట్రిదంష్ట్రాభోగదళితపృథ్వీభాగపృథువిచిత్రపరాగపింజరితము
చటులఝంఝాప్రభంజనజవవికీర్ణ, [4]శాల్మలీకుజపుంజసంజాతతూల
[5]చక్రపలితపరీణాహసంజరితము, నైన వార్ధితటారణ్యమచటఁ గాంచె. 27

క. కాంచి యలయటవిఁ జొచ్చిన, చెంచులు మునుగలుగ నచటు సేరి నలుగడం
బొంచి వెలిపెడలుకడ లూ, హించి మృగౌఘముల నిగ్రహించుకడంకన్. 28

గీ. దుష్టమృగచయంబుఁ దూలించి వనసీమ, నాత్మవశము సేయ నాటవికులు
చుట్టుతోరణంబు గట్టినచందానఁ, బ్రమద మొదవఁ బ్రోవువారి రపుడు. 29

క. తమగజముల నచ్చటిసిం, గము లారడిపెట్టు ననుచుఁ గలుషించి ఋశా
సముదయము వననుఁ జుట్టిన, క్రమమునఁ దెర లడరె లుబ్ధకనిబద్ధములై. 30

1. గుండులు. 2. చ-ట. ఎదుటన్. 3. క-చార 4. క-శాల్మలికుజాత 5. చ-చక్రపరిచిత పరిణాహ.

గీ. నలుగడల నెత్తురకత్రెత్రాటివలలు సెలఁగ్గెనపుడుపటుపటహార్భటినదరిచుక్క-
వెండిచీలలు రాలఁ బైనుండ కిలకు,డాసినసరంధ్రిగగనఖండమ్ము లనంగ. 31

గీ. వనవరాహంబు లెదురుగా వని తలంచి,యాదికిటిపతిఁ బట్టుటకై కడంగి
తెరువు లెల్లెడఁ బలువుగఁ దీర్చిరనఁగ,రవ్వవేఁటరు లోదముల్ ద్రవ్విరపుడు.

వ. అత్తఱిఁ దండతండంబులై వండి రాలినచింతపండు మెసవినకతంబున మెం డుకొనుకండక్రొవ్వులు దండిపేరెండలఁ గరంగి వడియఁ బడియపట్లకువచ్చి యచ్చటనీరు గానక ఘోరఘుర్ఘురధ్వానంబులు గర్జితంబులును నెత్తురులో లుకుతత్తరంపుఁజూపులు దటిత్తులును నాస్యగళత్ఫేనఖండంబులు కరకలును గాఁ గఱకునెఱిమెఱుంగు దొరయనురవడి ధరియింపలేక ధరణీవివరంబుఁ జొరఁబూను ఘనంబులగుఘనాఘనంబులకరణి ఖనిత్రక్రూరపోత్రకోటికల వీ టికలు వడినవండుపెల్లలెగనెత్తి యుల్లన నూరుచిలుపచిలుపకలఁకనీట నా లుకలు తడుపు[1]నూకరనికరంబులకు నావాసదేశంబులగునెడ నలుదిక్కు-లఁజా ట్టువలలు గట్ట నియమించియు మఱియు, దట్టంబుగాఁ బుట్టిన పొట్టచిచ్చు మట్టుపెట్టుటకునై పుట్టలకుఁ జేరి దట్టంబు లగుఖరనఖర ధట్టంబుల నట్టెట్టె త్రవ్వి నెఱసు లేఱు తెఱంగున నభంగపూత్కారభీమగాభుజంగంబులఁ దివి చిప్పెచి మధుచ్ఛత్రాకావిభక్తంబులగు తదీయభక్తంబులు బుగ్గలకు నగ్గలం బుగా మెసవి బుసకొట్టుచు నుసురుకొనునన్నునఁ గన్నుఁగానక నిజనిలయ నికుంజవలయంబుల నిదురించుతఱి సురసురఁ దిగుగు సురకరువలిపరువుల దరువుల రవులు నెరగలిసెగలు దిగదిగనఁ దగుల గగనమణికిరణములనిగని గలు వెనుదగుల గవుల వెలువడుబెడిదంపుటెరుల గుంపులన మొల్లంబులై వెళ్లఁబాఱు భల్లూకతల్లజంబులు క్రేళ్లుఱుకు దెసల వసులొడ్డనియమించియు, మఱియు నుజ్జృంభితగండప్రదేశనివేశంబులును నుదారదంతవిశంకటంబులు నునుతరపాద ప్రకాండంబులు నున్నతవంశ దండంబులుం దనర దవదహన దందహ్యమానతాపంబులఁ గోర్వలేక పర్జన్యదేవతకు నాక్రోశించు గిరిశం బు లనఁ బ్రచండంబు లగునెండల మెండున బెండుపడి తుండంబు లెత్తి ఘోషించుచు నీరాశ నీరాశయంబులకుం గ్రమ్ము[2]కొమ్ముటేనుఁగు పదువులు మొదలుపదవుల నోదంబులు ద్రవ్వ నియమించియు, సకలమృగపాళినవా

1. వ-నేకచరానీకంబులకు. 2. కొమ్మేనుఁగని యన్నిప్రతులలోను.

తూలంబులఁ గ్రోలఁ దివురు విషమవిషవిస్ఫుటస్ఫుటావంతంబు లన వాలంబులు దూల నఖర్వగర్వో త్తరంగంబు లగుకురంగంబులపైఁ జెంగున దాఁటి వడింగెడపి మెడల వెడలునుడుకునెత్తురు కుత్తుకలబంటి గ్రోలి యఱిగొని గిరిదరులఁ దరలకయుండి మఱునాఁడు పేరాఁకట నేకటంబడుచుఁ బ్రబలతమతమోఘగుణరేఖావిమిశ్రితోదారసశరీర వీరరసంబులచందంబున మురుబాందులమెఱచి కఱచి పఱచు శార్దూలసంఘాతంబులసంకేతంబులఁ గ్రూరమ్ములగు మాఱిమ్ము లునుప నియమించియు మఱియుఁ గాఁపుపోతు కణఁతి మనుబోతు దుప్పి మొదలగు మృగంబులకుఁ దెరువు లగునిరవులఁ దత్తదుచితసాధనంబులు సవరింపంబంచియు, గాలి పరికించి యెగువదిక్కునకు నడిచి యక్కడక్కడ మీఁటు గలపొదలచాఁటునఁ బోటరుల నెదురుపాటుగాఁ గాకుండ నిలిపి పార్శ్వంబుల జాగిలంబులతోడివాగురికుల నునిచి పఱవాధకాహళాదివాద్యంబులు చఱపించియుఁ దుపాకి మొదలగు నగ్నియంత్రంబులు ముట్టించియుఁ జోపుడువెట్టించి తాను దగుపట్ల నుచితక్రమంబుల నాఖేటకార్యసాధనసన్నద్ధుండై విజయలోలుం గెడఁగూడి సంచరించుచుండె నట్టియెడ. 33

శా. త్రస్తైణంబు పతద్వలీముఖము నృత్యత్ఖడ్గ మత్యాహిత
గ్రస్తక్రోడము శోకమానశశ మాక్రందన్మృగేంద్రంబు వి
ప్రస్తద్వీపి పలాయమానకరి నిర్యద్ద్వాహావిద్వేషి వ్య
త్యస్తక్రోష్టృక ముద్భ్రమద్గవయమై యక్కానన ఘూర్ణిల్లెఁగా. 34

[1]సీ. జాగిలాలవసింజిసరిపెణ ల్సడలించి పట్టెడ ల్దుయుముడి గట్టువారుఁ
జాఁటునఁ గచుఁగొని మోటు తప్పకనిల్చి తెగనిండఁగా వింట్లు దిగుచువారుఁ
నదలించి బిరుదున నెదురేగి పందిపో ట్లుగ్గుటంబులచాయ నొడ్డువారుఁ
దెరలకు డాయ నిబ్బరవుబొబ్బల వేఱువఱిచి యోదములకుఁ దఱుము వారు
[2]నగుచు నానావిధమృగప్రహారఘోర
సన్నహనసావధానులై శబరభర్త

1. ఇదియు దీని తరువాయిపద్యమును క-లో లేవు. 2. చ-నగుచు నానావిధమృగవ్యావ్యసను లగుచు, విపినతల మెల్లఁ దామయై వెల్లివిఱిసి యొకనినొక్కనిఁ జీరుచు నోహటించి, యురుపరాక్రమయుక్తులై మెరసి రపుడు.

లధిప మమ్ముఁ జూడు మనుచు మహోమృగవ్య
విపినతల మెల్లఁ దామ యై వెలసి రపుడు. 35

సీ. పక్కనఁ జొరఁబాఱి పాలచేరులు వట్టి బలిమిమైఁ జదికిలఁ బడఁగఁదిగుచు
దిగుచుచోఁ గ్రక్కునఁదిరిగి కొమ్ములఁజిమ్మఁ దొలఁగియల్లంతనె నిలిచివదరు
వదరి పోవఁగనీక వచ్చి యడ్డముచేరి కెరలి [1]యల్లంతనె తెరువు గట్టుఁ
గట్టి యన్నియు మాలెగట్టిరొప్పకమున్నె కదుపులోఁజొరఁబడి చెదరఁద్రోలుఁ
ద్రోలిగుబ్బున వెనుకొనితోఁకఁగఱచుఁ,గఱచి వెనుద్రొక్కి పెడతలగంటిసేయుఁ
జేసియిటు లేకలంబులఁజిక్కవఱచు, శబరులారొరయునఁగొన్నిజాగిలములు.

గీ. దట్టికొంగు మెడకుఁ జుట్టి మెల్లన పొద, చాఁటుబడిన తెచ్చి శబరుఁడొకఁడు
బయలురొప్పువంది పైఁ గాటు మరిగిన, వేఁటకుక్క నంటవిడిచి పొడిచె. 37

క. వడి నొక్కఁ డేకలము వెం, బడిఁ జనుచో నెనుకఁ గవిసి పైఁ బడినపులిం
బెడమురలి కెరలి తనమొల, పిడియమ్మునఁ గడుపు చించి పెళపెళ నార్చెన్.

[2]సీ. జాఠరశిఖిశిఖాజాతధూమంబులచాడ్పున నల్లనిచాఱ లెసఁగఁ
గ్రోధద్రుమాగ్రసంరూఢపల్లవములచెలువున నిక్కునచెవులు దనర
సకలమృగానీకశాసనోద్ధత వేత్రవల్లికచందాన వాల మమర
నాన్యగవ్యారరసనాహీంద్రవిమలతాచ్ఛటలు నాఁ గఱకుమీసలు వడంక
నావులించుచుఁ గబ్బునకడరునీఁగ, మూఁకఁగమియుచు సెలవులునాకికొనుచు
భూరిభీకరభాంకృతు ల్పొదలఁగొన్ని, పొదలనడుచకిరు బెబ్బులిగదిసె నొకటి.

క. ఆపులి నిజతురగదిద్య, త్పాపరత న్నిగుడ దానిఘనపరుషరుషా
చాపలతం దూపు భుజా, చాపలతం దొడిగి శౌరిసంభవుఁ [4]డడిచెన్. 40

క. శూలమ్మున నొకఁడు సరి, తూలమ్మున ఖడ్గి నేసి కో యని యార్చెన్
వాలమ్మున నొకచమరీ, వాల మ్మొఱఁ జేసి యొకఁడు వడిఁ బొగడొందెన్. 41

గీ. కడిమిఁ గదియుకుక్కఁ బడఁగొట్టి యొకకిటి, మోటువెట్టి రొప్ప నోటినురువు
సెలవులందుఁ బొలిచెఁ దళుకుదంష్ట్రికలకు, సరవి నిడ్డబిరుదుజల్లులనఁగ. 42

గీ. ఒకఁడు పొదలుతూఱి యుఱికెదురుం దేటిఁ, గూడనేయ బల్లకోల దనరె
గలిమినుండి కృశతఁగడకేగె నిది యని, యలుకఁదఱుముచంద్రకళ యనంగ.

క. హరినుతుఁ డొకహరిణముపై, హరి నడ్డమునూఁకి యేయ నాశుగ మధిక
త్వరఁ బఱవఁజేసె దానిం, జరమాంగకమై నిజాఖ్య [5]సఫలతఁ బొందన్. 44

1. చ-యంతంతనె, 2. దీనిఁతోఁగ్రింది 4 పద్యములు ట-లో లేవు. 3. చ-నొకఁడు. 4. ఛ-సేసెన్. 5. చ-సఫలముగాఁగన్.

[1]గీ. గాలివంక గాలు గని యీరములు చేరి, తారిలాఁగలెల్ల మూరుకొనుచుఁ
గాలు ద్రవ్వియునికిఁగనికొమ్ముటుడుములఁగఁ బిచితిగిచెఁగొన్ని మొఱనడములు.
గీ. యమునిగదనిడ్డలోహఖడ్గనువిధమునఁ, జేతఁదగుతోఁచిగానికిఁజెమటప్రాఁత
యొత్తుగా ముష్టినమరించియొకఁడు వైచెఁ, గట్టెఁబొదసోపి వెలిచె పైగజ్జెగదల.
గీ. పొట్టిగుట్టులు గుట్టుగా [2]మట్టిమట్టి, గట్టెపట్టులు ముక్కునఁ గుట్టికుట్టి
యిట్టునట్టును రెట్టలఁ గొట్టికొట్టి, పట్టెఁ గుందేటి నపుడొక్క దిట్టలగుడు.
గీ. ఇట్లు తాము నిగ్రహించినమెకముల, నెల్లఁ దెచ్చి యెదుట నిడినఁ జూచి
చంద్రభానుఁ డపుడు చాల మెచ్చి పుళింద, వరుల కొసఁగె నుచితవస్తుసమితి.
క. అట్టియెడఁ గఱకుమేనులఁ, బుట్టినబడలికలతోడ బోయలు వేఁటల్
మట్టుపటిచి యాచెంతల, పొట్టెము లగుపొదలఁ జేరిపొదలెడు వేడ్కన్. 49
సీ. కొందఱు మునుమున్న గూలినమెకములఁ గాల్చేనికర్పింపఁ గడఁగి రపుడు
కొందఱు మనుబిళ్లఁ గోసి కుప్పలువైచి పాలు దప్పకయుండఁ బంచి రపుడు
కొందఱు బలునెల్లికొయ్య నింగలములు గల్పించి కఱకుట్లు గాల్చి రపుడు
కొందఱు తేఁకుటాకుల దొప్పగమిలోనఁ బసగలనంజుడు లైనవి రపుడు.
విపినతలమున నీరీతి వేఁటకాండ్రు
నసుచితోత్సాహములు మించ శౌరిసుతుఁడు
తీవిఁ బురినుండి బోనపుట్టికలురా ని
జాప్తపరిజనయుతుఁ డయి యారగించె. 50
చ. చలువలు చిందుకందువలఁ జంద్రశిలోపలసాంద్ర[1]వేదికన్
జలజలఁ జాలుగా సెలలు జాఱునొకానొకకోనలోనఁ బా
టలపటుకోరకోదరవిటంకనటత్ప్రవమానకందళుల్
చెలఁగెడునొక్క పూపుఁబొదఁ జేరి సుఖంబున నుండె నయ్యెడన్. 51

—చంద్రభానునికడకు సిద్ధుఁడువచ్చుట.—

సీ. ముడివీడుకుఱుచకెంజడలతో నివ్వొందుకఱపట్టుకుచ్చులిగంతతోడ
వలచేతిజలకమండలువుతోఁ బేరెద నిట్టలం బగుయోగపట్టెతోడఁ
బెఱచేతిబెత్తముమురువుతోఁ గళమునఁ దాల్చినసింగినాదంబుతోడ
[4]మూలికెల్లలకకపాలతో సందిటఁ గదియుకేదారకంకణముతోడ

1. ఇదియుఁ గ్రిందిపద్యమును క-లో లేవు. 2. చ-ముట్టిముట్టి 3. చ-ట-సీమలన్ 4. క-మాలికల్.

భసితచర్చికతో నిమ్మపంటిచాయ,దొరయునెమ్మేనితోడ సిద్ధుం డొకండు
మిగులవేడుకఁ జెట్టున దిగినయట్టు,వచ్చె గొబ్బున నయ్యదుపర్యుకడకు. 52

గీ. వచ్చుటయుఁగాంచి యెదురేగి తెచ్చి యొక్క-
సితకరోపలసీమ నాసీనుఁ జేసి
యర్ఘ్యపాద్యాదిసత్క్రియ లాచరించి
యతిలలితవాక్యముల నేమ మరసి పలికె. 53

సీ. తఱిమినారలు నిరంతరతమఃపటలంబు మస్తచంద్రప్రభామర్శనమున
యడఁచినారలుమహాభద్రగిరజోరాశి విజ్ఞానధారాభివృష్టికతన
నాఁగినారలు సముద్యద్వాయువలనంబు లీలమైఁ గుండలి మేలుకొలిపి
తొలఁచినారలు తనూమిళితపంకచయంబు లనితరసాధ్యామృతౌఘమహిమ
గణుతికెక్కు తపస్స్ఫూర్తిఁ గాంచినార,లనఘతరశీలహంసలీ రగుటఁజేసి
యట్టిమిముబోంట్ల వినుతిసేయంగఁ దరమె,భవునికైనను బద్మసంభవునికైన.

క. భూచక్రభరణమదకృత,నీచతచేఁ జాల నెఱిఁగొనినమాదృశులన్
వాచంయమి మీరు కృపం,జూచినఁ గా కేల కలుగు శుభవైభవముల్.

[1]గీ. అనిన మందస్మితము కనుంగొనలఁ దొలఁక,సర్వసర్వంసహాభారవహనదక్షు
బాహుశాలికి నాసత్యభామసుతున,కనియె యతి మత్తకేసరిస్వనము మీఱ.

సీ. ప్రతిమానసాంభోజసతతవికాసశీలనవిచక్షణుఁ డెన్న నినుఁడు గాఁడె
యుభ్యుపగతస్తుత్తమోహాంక్రియావిదారణసమర్థుం డెన్న రాజు గాఁడె
జటిలాపదహిగర్వసర్వస్వవిదళనధుర్యుఁ డెన్నఁగ నరేంద్రుండు గాఁడె
శమిరాజనిర్వ్యాజసౌఖ్యవాసవిధాయకుం డెన్న నచలేశ్వరుండు గాఁడె
యఖిలయతిమానసోత్తరాశావలంబ,ముఖ్యుఁ డెంచిన సార్వభౌముండుగాఁడె
కాన మముబోంట్ల నీవును గారవింప,వలయు ననవిని యదువంశవల్లభుండు.

సీ. సంయమిమీకటాక్షమున నెచ్చోటతిసౌమ్యమై రమ్యమై గమ్య మయ్యె
మానినీసంస్థానమహిమ నెచ్చోటస్తదైన్యమై మాన్యమై ధన్య మయ్యె
యతి నీపదాబ్జసంగతుల నెచ్చోటు నత్సేవ్యమై దివ్యమై భవ్య మయ్యె
ప్రతి నీమనఃప్రసన్నతల నెచ్చోటు వరేణ్యమై పుణ్యమై గణ్య మయ్యె.

[1] ఈ పద్యము మొదలు «జాళినాగోణఫుఁడెఱంగు" అనువఱకు క-లో లేదు.

జటిలశేఖర నీకృపాసక్తి నెచటు,పాత్రమై చిత్రమై యఘుదాత్ర మయ్యె
నట్టినెలవులఁ గలవింత లానతిచ్చి,ననుఁ గృతార్థుని గాఁ జేయు మన నతండు.

ఉ. భూవర సర్వపుణ్యపురము ల్దిలకించుచుఁ గుండినంబునం
గేవలరూఢి నారదుని గెల్చినగద్దటిఁ దుంబురుం గళా
కోవిదుఁ గాంచి యందు నొకకొన్నిదినంబులు నిల్చి రంగధా
త్రీవిభుఁ గొల్వఁ బోవుచు సుధీజనసేవిత నిన్ను గాంచితిన్. 59

చ. అన హరినూనుఁ డద్భుతమునంది మునీంద్ర సుధాశనాధినా
థుని నెఱమెచ్చుగాణ యగుతుంబురుఁ డిత్తఱిఁ గుండినంబునం
దనిశము నుండఁ గేమికత మానతియి మ్మన సావధానత
న్వినుమని పల్కె సంయమి నవీనవచోరచనాచమత్కృతిన్. 60

మ. కలఁ డున్నిద్రజయప్రయాణపటిమాగ్రగ్రాహ్యవాహ్యాళికో
త్కలికాభంగతరంగసంఘపటురింఖాపుంఖసంఘాతని
ర్దళితక్ష్మోశిరజోవ్రజావిలసముద్రస్వర్ధునీవ్యక్తదో
ర్బలసన్నాహుఁడు రుక్మబాహుఁడు శుభృత్పర్జన్యవాహుం డిలన్. 61

క. అతనికి సుతుఁడును సుతయును,వితతయశుఁడు వీరసేనవిభుఁడుఁ గుముదినీ
సతియును గల రామకొరుఁడు,శతమఖముఖవినుతనిజభుజాబలుఁ డనఘా.

సీ. పుష్కరప్రౌఢిమ పొలఁతికేలన కాదు బెళుకునెన్నడుమునఁ గలిగియుండు
నబ్జవిభ్రమము తన్వంగిగ్రీవన కాదు కలికినెమ్మొగమునఁ గలిగియుండు
విషధరప్రఖ్యాతి వెలఁదివేణిన కాదు మెలఁతలేయూరునఁ గలిగియుండుఁ
జక్రవిలాసంబు సతిగుబ్బలన కాదు ఘనజఘనంబునఁ గలిగియుండు
నలప్రవాళప్రభావంబు చెలియపాద,ములన కా దధరంబునఁ గలిగియుండు
ననుచు వినుతింపఁదనరునయ్యధిపుపుత్త్రి,దివ్యవనితావతారైకభవ్య గాన.

క. ఆరాజబింబవదన క,వారితసంగీతమై భవము నేర్ప సుధాం
ధోరాజు పనిచె వీణా,సారస్యధురంధరాగ్రసరుఁ దుంబురునిన్. 64

గీ. అనిన విని మహాత్మ యారుక్మబాహుభూ,కాంతమణికి నట్టి కన్య యయ్యె
సమరకాంతి యదిమహాద్భుతం బెటిఁగింప, వేయుటన్న నంయమీంద్రుఁడనియె.
వదరువట్రువహరివాణంబు గలమేటిబండికం జ్లేయూరిపాటిబంట్లు
లిబ్బిరాచూలి నేలినచాన మొదలైనపడఁతుక లేయూరిపడుపుఁగొమ్మ

లెడకాఁపురమువానికడియఱుగుందమ్మి తేనియ యేయూరి తేటచెలమ
జేజేలకోరికల్ చేఁపెడినిచ్చయామనిగడ్డి యేయూరిమందపసర
[1]మిచ్చమానిక మేయూరిరచ్చఱాయి
పెట్టెఁగుమ్మాఁకు లేయూరిపెరటిచెట్టు
లట్టిసుర[2]పురి యేలుచునమరపతి మ
హోన్నతైశ్వర్యధుర్యుఁడై యొక్కనాఁడు. 66

చ. సిరులఁ దనర్చుదివ్యసభఁ జేరఁగవచ్చి పరాకు జియ్య యె
చ్చరిక యహో యటంచు సరసధ్వనితో నిరువంకలన్ బరా
బరు లొనరించుచుం బసిఁడిబ్రద్దలవారలు దెల్ప వేలుపుల్
దొర లిరుగేలుఖడ్గములతో మకుటంబుల నుంచి [3]కొల్వఁగన్. 67

గీ. వచ్చి మించులు వెదచల్లునిచ్చమాని
కములగద్దియఁ గూర్చుండి యమరగురుఁడు
కవియుఁ బార్శ్వద్వయంబునఁ గదిసి బహువ
యస్థితులు దెల్ప నాలించునవసరమున. 68

సీ. సేనాని చిత్రవాజివిహారములఁ జేరి వలమానహేతియై వహ్ని వచ్చెఁ
జండాంశుతనయుఁ డుద్దండవైఖరి డాసె ఘనతమస్స్ఫూర్తి డగ్గఱెఁ బలాశి
వాహినీశ్వరులతో వరుణుండునను దెంచెబహువాసనలగంధవహుఁడుగదిసెఁ
జెందె మహారాజసేవ్యుఁడై ధనపతి గౌరీశుఁ డేతెంచెఁ గళ దొలంక
పండియును దక్కినయశేషవిబుధవరులు, నిర్నిమేషప్రభావసందీప్తు లగుచు
సరుగుదెంచిరి సకలలోకాధిరాజ్య,రమ్యవిభవాభిరాము సుత్రాముఁగొలువ.

సీ. బహులక్షణానురూపప్రభావంబులఁ గనుపట్టుసుకవివాక్యములచేత
నరిదరకరమహిమాధాయకంబులై తనరెడుగురునిమంత్రములచేత
శాస్త్రాధికరణచర్చాభీతవిమతమై కొఱలునూతనబుధగోష్ఠిచేత
శ్రుతహితవర్ణవిస్ఫురణమాధురిఁ జాల సొగయువిద్యాధరస్తుతులచేత
నుబుసుపోవఁ బురందరుఁ డూర్వశీశ
శిప్రభాహారిణీనృత్తాచితిలోత్త
మాప్రధానాప్సరోగానమంజులు గొలుప
నొసరి యొడ్డోలగంబయి యుండునపుడు. 70

1 ట-ఇచ్చమానిక. 2. ట-పురమేలుచు 3. ప్రొక్కఁగన్.

గీ. చారుఁ డొకఁడు వేగ సముఖమ్మునకు వచ్చి,నమ్రుఁ డగుచు నాననమునఁ గేలు
దోయి చేర్చి యొరఁగు డాయంగఁ జని నిక్కి,విన్నవించె నేమొ విబుధపతికి.

క. ఆమాట కులికిపడి యే,మేమీ యని తెలియ నడిగి యించుకవడి నె
మ్మోము మఱువంచి సశంకము,గా మరుదాచార్యు నెమ్మొగముగనుఁగొనియెన్.

క. కనుఁగొనఁ దత్కార్యము తన,మనమున నూహించి దివిజమంత్రి సుధాంధో
వనితామణు లుండఁగ నీ,యనుతాపముఁ జెందనేల యమరాధీశా. 73

సీ. బలిమాలఁ జేయరే ప్రతిసృష్టి గల్పించి యడరువిశ్వామిత్రు నంతవానిఁ
బనిబందఁ జేయరే పరమేష్ఠి నిష్ఠచే నతకరించిన కణ్వు నంతవానిఁ
జాలుమాలింపరే పంచేంద్రియోద్వృత్తి నడఁచిన శాండిల్యు నంతవానిఁ
గకుర్కార్తిపఱుపరే గాఢతపోరూఢుఁ డగుమందకర్ణు నంతవాని
నితఁ డనఁగ నెంత యెంతటియతులకైన
వేరువిత్తులు గారె యీవిపులనయన
లీవెలందులలో నొక్కయిగుఁబోణి
ననుపు మసమాస్త్రితోఁ గూర్చి యనిమిషేంద్ర. 74

చ. మఱచితె నీవు తొల్లి పురమర్దనుచిచ్చుఱకంటివెచ్చఁ బెం
పఱినమరుం దదీయకరుణామృతనూతనవర్షధారఁ గ్ర
మ్మఱ మొలపించి మామకసమంచితమంత్రబలాప్తి సాంగుఁడై
పరఁగఁగఁ జేసి మానిజనవంచన కుంచుట యెల్ల వాసవా. 75

క. అనుగురుని వాక్యములు విని,యనిమిషపతి వనుప వేత్రహస్తుఁ డొకఁడు వే
చని యఖిలంబును దెలుపఁగ,వనధిసూతాతనయుఁ దధికవైఖరితోడన్.

సీ. వలెవాటు వైచినవలిపెదుప్పటి పసపంటి బంగరుమ్రోఁత నతకరింప
నొరగుఁజంద్రికయొంటిపొరగుడ్డ కెంబట్టు చెంగులుకినలయుశ్రీల నేలఁ
జేరెద నందంద నూరుఘుర్మకణాలి హారమౌక్తికముల నసదు సేయఁ
దనువున రవసందిదండయొత్తులతఱుల్ కస్తూరి రేకులఁ ద్రస్తరింప
జాళువాగోణపుఁజెఱంగు నేలఁ జీరఁ,దలిరుసమ్మాళిగెలు మెట్టె లలన యోర్తు
చేరి కైదండ యీఁ బ్రిదఁ దేరుకన్నుఁ,గవ వలరుబంతి యొత్తుచుఁ గంతుఁ డంత.

గీ. చావడికి వచ్చి యొసపరితీవి మెఱయఁ,గొలువుసింగారమై వెంటఁ గొలిచి చైత్ర
కాబ్జమందానిలప్రముఖాప్తు లరుగు దేరఁ [1]జనుదేరు లక్ష్మీకుమారుఁ జూచి.

1. క-దనుజేరు.

ఉ. కట్టిక వారు సారె సముఖా యన వామపదంబు కెంపురా
మట్టిక నిల్పి గద్దెపయి [1]మార్వడ వేఱొకజాను వూఁది యా
పట్టపువేల్పు గొంతమురిపంబున నించుక లేచి కంతుఁ జే
పట్టిటు రమ్మటంచుఁ దనపార్శ్వమున న్వసియింపఁ జేయుచున్. 79

చ. పరమకుతూహలం బడరఁ బల్కు సుఖస్థితి నీది శాంతపా
లురు నితరామరుల్ కడుపలోపలిచల్ల దొలంకకుండ ని
ర్భరులయి దండి దాడి యనుపల్కు లెఱుంగక నీడపట్టులన్
దొర లయి యుండు టెల్ల హరిదోర్బలశక్తిని కాదె మన్మథా. 80

చ. అతనికిఁ బట్టి పీవగుట నాపద లీసురరాజ్యవైభవ
స్థితి కితరంబు లేమి మనుదెంచిన నన్నియు మాన్ప విక్రమా
ప్రతిహత నీకునుం బడినభారము గావున రూపవిభ్రమాం
చితసురచంచలాక్షులు భజింపఁగ నేగి కవేరజాతటిన్. 81

మ. వ్రతసంపత్తిఁ దపంబు సల్పెడుభరద్వాజాఖ్యమౌని న్నవ
చ్ఛితభల్లంబులపాలుసేసి లలనాశృంగారలీలాకళా
న్వితుఁ గావించి మదీయచిత్తజనితోద్వేగంబు మాయింపు మో
యతులప్రాభవ దేవకార్యఘటనాయత్తప్రయత్నంబునన్. 82

[2]క. విను మింక నేమనినఁ బ్రియం,బొనరించుట దోఁచు శక్తియుక్తుల నీయో
పినరీతిం బాటులుపడి,యనిమిషరాజ్యంబు నిలుపుమయ్య మనోజా. 83

గీ. అనుచు ననునయించి యగభేది రంభాది,దివిజవనజముఖులదిక్కు చూచి
వనితలార యిందు మునినాథువలపింపఁ,బడఁతి యొకతె యేఱుపడుఁడటన్న.

క. వారలలో నతిలలితా,శారదద్యుతిసాంద్రచంద్రకళ యనుసతి జం
భారాతియెదుట నిలిచి[3]యు,దారస్మితమాధురీసుధారస మొసఁగన్. 85

చ. పలుకుల కేమి దేవ బలభంజన నీకృపపెంపున న్మహో
జ్జ్వలగతిఁ [4]జేరఁబోయి యలసన్నుతిశాలి మహర్షిధూర్జటిన్
సలలితనిష్కళంకరుచిసంపదఁ గైకొని ముజ్జగంబు "లీ
యలికులవేణి చంద్రకళ యౌ" నని మెచ్చ ఘటింతుఁ బంతముల్. 86

1. చ-మార్కొన జానువునూఁది యంతనా. 2. ట-లోనిది లేదు. 3. ట-దారస్మిత
మధురమధుసుధారసమొసఁగన్. 4. చ-మమ్ముఁ బ్రోవనలస న్నతి.

గీ. సభ సహంకారములు వలరాజనదుకాక, విబుధవర్యభరద్వాజవిభ్రమంబుఁ
గోరి యిప్పుడె విటపాళిఁ గూర్చుకున్న, నమవిలాసిని యనుచు నెన్నంగవలదు.

సీ. చవిచూచునేకదా సావిఁ గెంజిగురులు నాలేఁదొగరుమోవిఁ గ్రోలఁడెట్లు
సరవి నుండునెకదా సైకతస్థలముల[1]నానితంబము డాయ మాను నెట్లు
తానమాడునెకదా తడయ కెప్పుడు నీట నాకమ్మఁజెమటల నానఁడెట్లు
కలసియుండునెకదా వలపుఁబూఁదీవెల మత్తనూసంగతి మరగఁడెట్లు
ముట్టునేకద మొట్టతమ్ములు మదీయ,చరణసంవాహనమునేయమరగఁడెట్లు
పలుపలుకు లాడ నేల మత్ప్రొద్ధి నేఁడు, చిత్తగింపు మటన్న శచీవరుండు.

గీ. మలినజలజాతమేని నీలలితకరస,మృద్ధి నలరదె గడునుతాలేని నిన్నుఁ
గాంచినఁ గరంగవే చంద్రకళ ధరిత్రి, వ్రతుల వలపించు టెంతభారంబు నీకు.

క. అని యనిమిషపతి తను దయఁ, గని తనచేఁ బసిఁడితట్టఁ గప్పురబాగా
లునుదొడవులొసఁగి యాసతిఁ,[2]బనిచినఁ దతాఁర్యభారపరుఁడై మరుఁడుఁ.

ఉ. గ్రక్కున లేచి గద్దియ డిగ్గి దివిజేంద్రుఁడు త్రోన డిగ్గి పే
రక్కున జేర్చి నాలుగయిదజ్జలు వెంటనె యేగుదెంచి నీ
వొక్కఁడ వుండ మేము సుఖముందుదు మెప్పుడు నేఁడు ప్రోవుమీ
దిక్కయి పంచబాణ యని దీవన లిచ్చిన సంతసంబునన్. 91

గీ. అమరనాథునివీడ్కొనియాలతొంగి, మొదలుగాఁగల తెఱగంటిముదితలుదిత
ధృతులయి భజింపఁబచ్చని తేజినెక్కి, వెడలెఁగలకంఠకంఠకాహళులు మొరయ

సీ. నిగనిగ మను గొప్పనిడుదయొంటులచాయ చెక్కుటద్దముల పైఁ జిరువాఱఁ
జెమటచేఁ గరఁగి పూసినకదంబముచాయ యరచట్టలో నుండి పరిమళింపఁ
బలుకుఁగప్రపుఁదావి వలుచుపీడెము కెంపు తేనెకెమ్మోవిపై నీనె చూపఁ
బరిజనంబులు వీచుసురటి తెమ్మెరల బంగరువ్రాఁతకుళ్ళాయి కళలు గదలఁ
జడిచెమట జిల్గుపావడఁ దుడిచికొనుచుఁ, గిరుదువాళినె పోనిచ్చ గెరలనీక
సంతరించుచుతనవాజినము తెఱంగి, యెక్కియాడుచుఁజనియెనాచక్కనయ్య.

మ. విరిసెం బువ్వులు తేఁటిజోఁటిగమి యువ్విళ్లూర నందంద గా
ద్పురసెం దావులు చిల్వచెల్వ పదువ త్త్రాడంగ లేవెన్నలల్

1. క-మన్నితంబము. 2. చ-బనిచెఁదతాఁ.

గురిసెం గోరికతోఁ జకోరమహిళల్ గ్రుక్కిళ్లు మ్రింగన్ ధను
ర్ధరుఁడై పంచశరుండు భూతలముఁ జేరన్ దిక్కులం దోకట్టన్. 94

చ. తొలఁకులఁ దేలి పుష్పములఁ దూలి మరందముఁ గ్రోలి కన్నెతీ
వలవయి సోలి క్రొన్ననల వ్రాలి హిమంబుల నేలి వాసనల్
గలయఁగఁ జేయఁ జాలి చలిగాలి తగ స్వారిచూలిమీఁదటం
బొలసె మరుద్రథానికటభూరుహకేళిఁ జలాళిపాళినై. 95

ఉ. క్రేవఁ గవేరకన్య లహరీవిహరద్బకసారసారసా
రావవిశేషమాన్య నళిరాజరథాంగకరాజరాజిరా
జీవకుటీరధన్యఁ బరిశీలితవారిభరాజరాజిరా
జీవకిశోరసైన్యఁ గని చిత్తజుఁ బల్కు వసంతుఁ డయ్యెడన్. 96

—* కావేరీవర్ణనము. *—

మ. సుడిరోదమ్ములుఁ దమ్మిపూఁబొదలు నాచున్బగ్గము ల్పూంచి న
ల్లడ సారంగపుదీము లుంచి దురితౌఘప్రౌఢ సారంగముల్
పడఁ దోడ్తోఁ దెరలెత్తి మ్రోయఁ దొణఁగెం బైపై శరప్రౌఢి చొ
ప్పడ నీసహ్యధరాధరప్రభవశుంభద్వాహినిం గంటివే. 97

చ. ఘనలహరీనినాదములు గర్జితము ల్పవి భీతిఁబొంది పైఁ
జనుకలహంసమండలముజాడ గనుంగొను మంగజాత యీ
యనుపమపుణ్యసింధుమణి యచ్ఛజలంబుల మున్గి ధన్యులౌ
మనుజులఘోరపాతకసమాజము వెల్వడురీతిఁ దెల్పెడున్. 98

మ. తెర సంధించి ప్రఫుల్లహల్లకశిఖాదీపచ్ఛటల్ నించి లోఁ
గర మర్థిన్ జలమానుషీప్రతిమలం గైసేసి యీసింధుసుం
దరి గంగావతరప్రసంగకథానాట్యంబు సూప న్సురల్
సరవిన్ వైచునొసంగులో యనఁగ నంచల్ వ్రాలెడిం జూచితే. 99

సీ. కవులకు జీవనక్రమమొసంగినయట్టియీసరస్వతి నుతియింపఁదరమె
పరరాజ హంసాళి భంగంబు నొందించునీవాహినీలీల లెన్నఁదరమె
యనిమిషప్రతతికి నమృతంబు లొనఁగూర్చునీసింధువాళినూహింపఁదరమె
కాదంబపితతి నుత్కలికలఁ దేలించు నీహ్రాదినిమహత్త్వ మెన్నఁదరమె

నూనసాయక తా మెంత సుడులఁబడిన,సాటిసేయంగఁ దగునె యసహ్యగోత్ర
జాత తానన్యనదుల నీసహ్యగోత్ర, జాతయనంతభువన విఖ్యాత కరయ.

గీ. తను విగాహించి హతులైన జనులకొసఁగ,శంఖచక్రశతంబు లీసహ్యతనయ
సంతరించినగతిఁ బొల్చె సరసశరక,నుంగొను వినిర్గళాంబురథాంగతతుల. 101

చ. కలమవనాళి పండి యొరఁగంబడి యెన్నుల నీరెడల్చుటల్
గలయఁగ వంక లైన మడికట్టల బీటలసందు దూఱఁగాఁ
జెలువు వహించె నెల్లెడలఁ జిత్రము పూవిలుకాఁడ వ్రేళ్లనుం
గొలుచుగఁ బండినట్లు కనుఁగొంటివె యీతటినీతటంబులన్. 102

శా. సారె న్నారికెడంపుబొండలము లీక్ష్మాఁ ద్రెల్లి తో ప్రీలుటన్
నీ శ్రైత్రె తొరఁగ న్స్వపర్ణపటలీ నిర్యన్నవస్థూలము
క్తారాజి స్నవబుద్బుదాళి నిలిపెం గాంతారకాంతారకాం
తారంబు ల్తిలకింపు మయ్య రతికాంతా రమ్యదేశంబులన్. 103

మ. ఫలభారావతనారికేళ వనరంభాపూగభూజావళీ
కలమారామచయంబుచే నతతరంగత్తుంగభంగాంబుని
ర్గలవాతంబులచేఁ దటస్థలకుఁ బ్రేమన్భక్తియు న్ముక్తియుం
గలుగంజేసి తనర్చునీతటిని వర్ణింపఁగా శక్యమే. 104

సీ. సరసరాజీవాజిచలరాజిరాజినినాద భేదములు సంమోద మొసఁగ
సమనమాలీనాళినుమధూళిపాళికారామసీమములు సంభ్రమముఁగూర్ప
దరవరాళీకేళివరబాలికాళీవిహార తీరములు నెయ్యమున ముంపఁ
దటతటాకానీకపటుసైకతాకరమంజుమంజరులు సమ్మదము దన్ప
నతతతతభంగపంగసంచారివారి, కరటిరటితాబ్దశబ్దసంఘాతభీత
నకలకలహంసనంసత్ప్రచారసార, యమితమితవాతపోతంబు లందగింప. 105

క. శ్రీరంగభర్త యీనది, తీరంబున నున్నవాఁ డదె తదీయశుభా
గారంబుఁ జూడు మణిరుచి, పూరంబుల నకృతచిత్రములు గలదానిన్. 106

—* శ్రీరంగపురవర్ణనము. *—

సీ. ప్రాతరాశుగమిళత్ప్రబలగోపురగవాక్షధ్వను లగల్యశంఖస్వనములు
రవిరథ్యఖురహతప్రాసాదనాదముల్ మధ్యాహ్నఘంటాసమక్వణములు

హర్మ్యతటీకులాయావిశత్కలరవపతత్రార్భటులు సాంధ్యపటహారుతులఁ
జంద్రద్రుతాబ్జాశ్మసౌధాంబునినదంబు లార్ధరాత్రికతమ్మ్రతారవములఁ
గలసి శ్రీరంగధామమంగళమహోత్సవాచరణవైభవంబుల నతిశయిల్లఁ
బౌరసంఘాతమతిలోకభావనాస,మంచితాశ్చర్యగరిమ నాలించు నిచట. 107

లయగ్రాహి.

కాంచితివె పైబిరుదుపించెములనం గబరు లించుకచలింపవసనాంచలపతాకల్
మించమణిఘంటలురహించఁగటిచక్రములుసంచలనమానఁగనుమించుటలుగుల్దీ
పించఁగుచఖేటకములుంచిబొమసింగిణులునించిజయమీవుగనసంచలరథంబుల్
పంచెమునుమున్నసురసంచయమనన్మెఱసిరంచనడనిందునతులించువిలుకాఁడా.

శా. వీరల్ తైర్థికవైష్ణవుల్ గనుము పూవిల్కాఁడ సద్భక్తిఁ గా
వేరిం దాన మొనర్చి రంగవిభు సేవింపం దమిం గాంచి యు
న్నారు న్మస్తకయుక్తరాజ్ఞు లయి "భో నాగేంద్రశాయి న్నమ
స్తే రంగేశ" యటంచు దేహళుల నెంతే నిక్కి వీక్షించుచున్. 109

[1]ఉ. ముప్పిరి గొన్న వేడుకఁ దముం జనము ల్గన మోక్షచింత లోఁ
దప్పక చేతికంచుచిటితాళపుమ్రోఁతలఁ బాయ కెప్పుడుం
జప్పటులన్ బుధోత్తములు సందడి సేయుచు మూఁక గూడ రం
గప్పను బాడుచుం జనుమహాత్ములఁ జూడుము సూనసాయకా. 110

చ. మడవ ల్మార్చుచుఁ దీర్చుచు న్లతలకుం బాదు ల్దగం జేసి యం
డెడ లాచోటుల నంట్లు నిల్పుచును నీరెత్తించుచుం గ్రొవ్విరుల్
దొడిమ ల్విచ్చి సరాలు గట్టుచును నెందుం దారవై పాటులం
బడుధన్యాత్ములఁ గంటివే మదన యీమాల్యార్పణాధీశులన్. 111

[2]శా. వీణావేణుమృదంగనాదముల కువ్విళ్లూరుచు న్మండప
స్థానుల్ ప్రాఁకియు మెట్టు లెక్కియును నచ్చోఁ గేళిక ల్సల్పున
య్యేణీనేత్రలఁ జుట్టువారుకొని కంటే కాంచుచున్నారు గ్రా
మీణుల్ నిశ్చలలోచనాబ్జులయి లక్ష్మీగర్భముక్తామణీ. 112

[3]మ. మునుముందాన మొనర్చి పుండ్రములు శ్రీముద్రాంకము ల్పూని నూ
ననికుంజావృతసైకతస్థలుల గంటల్ మ్రోయఁగాఁ గేశవా

1. ఇదియు దీని క్రిందిపద్యమును క-లో లేవు. 2. ఇది ట-లో లేదు. 3. ఇదియు దీనిక్రింది రెండు పద్యములును క-లో లేవు.

ర్చనముల్ చల్పి స్వపార్శ్వవర్తులకుఁ దీర్థం బిచ్చి సేవార్థమై
చనువారిం గనుఁగొంటివే మదన సాత్వాద్వైతసమానీశులన్. 113

ఉ. త్రోవను దృష్టి నిల్పి తడిదోవతి మూఁపునఁ దాల్చి స్తోత్రపా
ఠావళితాస్యులై శయచయంబులఁ జెంబులఁ బూని యేగునీ
కేవలపుణ్యమూర్తుల నకించనవృత్తుల రంగనాథస
ప్త్రావరణప్రదక్షిణపరాయణులం గనుఁగొంటె మన్మథా. 114

సీ. అగ్రహారముల మాన్యక్షేత్రములఁ బండుగరిసెలకొలు చరకాండ్రు నింప
సతతంబుఁ బైరుపచ్చలుఁ దోఁటదొడ్డులుఁ గావలు లరసి రక్షణ మొనర్పఁ
గీలార్లు పెరుఁగునుం బాలు మందలనుండి వడి తేపుమాపుఁగావడులఁ దేరఁ
బై వెచ్చమునకుఁ దప్పక రూకపాతికల్ ప్రియశిష్యతతి సమర్పించి యొసఁగ
నతిథిసంతర్పణంబె నిత్యవ్రతంబు,గాఁగ వ్యాఖ్యానమునఁ బ్రొద్దుఁ గడపి గేహ
దేవతార్చన మఱువక భావశుద్ధిఁ,దనరునచటిగృహస్థులఁ గను మనంగ. 115

సీ. అక్కున వనమాలికాగతభృంగమో శ్రీవత్సమో విభజింపరాదు
జఘనసీమ సువర్ణశాటీద్యుతియొ నాభినలినపరాగమో తెలియరాదు
పదమున దేవతాపగవీచియో నఖరేందుమరీచియో యెఱుఁగరాదు
తనువున నర్చనాదత్తసూనంబులో పాఁపమేపారలో యేర్పఱుపరాదు
కాంచితే మనోజ కించిదాకుంచితాంఘ్రి,యుగ మిలారమలొత్తఁగానొత్తిగిల్లి
కటినొకకరంబుసాఁచియొక్కటితలాడ,నమరఁబవళించియున్నరంగప్పనిపుడు.

క. ఈరీతిఁ జెలువు మెఱసిన,శ్రీరంగాధిపునినగరిచెంత మధురసా
సారసపారసమున్నత,సారసనారసరుతుల్ దిశాతతిఁ గప్పెన్. 117

—* భరద్వాజాశ్రమవర్ణనము. *—

క. అదె కనుఁగొంటివె మదనా,మదనాగకిశోరవదనమంజులరదనా
రదనాళకమలసదనా,సదనాహతవారికరిణి శశిపుష్కరిణిన్. 118

సీ. దరసమ్మదళసముద్గతనాళసితకంజగణములు పుండరీకంబు లనఁగ
నురుమీనమస్తరం ధ్రోత్థితానధారానికాయంబులు ప్రకీర్ణకంబులనఁగ
రయశాలిమారుతప్రచలత్తరంగజాలము లుత్పతచ్చహులహరు లనఁగ
నంబుపూరాంతరబింబితజలకదంబంబు ఘనాఘనౌఘం బనంగ
సమదకవిరాజహంసచక్రములుచేరి, సతతము భజింపఁ దీర్ఘరాజప్రసిద్ధి
నెఱపునీచంద్రపుష్కరిణీసరోవ,రంబు వినుతింప శక్యమే బ్రహ్మన. 119

క. నతింగనునీసరసియదూ,రతరక్షితిఁ జూచితే భరద్వాజమహా
యతిభవనం బతిభువనం,బతినవనంబునకుఁ బాత్రమై కనుపట్టెన్. 120

సీ. కలికాలవిప్రసంగతపలాశశ్రేణిఁ బటుశిలీముఖములపాలు సేసి
నిర్గళన్మధుమదోన్నిద్రపున్నాగాళి ధీరాశుగశ్రేణిఁ దెరలఁ జేసి
నిశితకంటకశరాన్వితమన్మథస్ఫూర్తి నమితమహాజిహ్మగముల నలమి
చటులశాఖాగదాసాంద్రశారికదళంబులఁ బత్రముఖసమాకలనఁ ద్రుంచి
చతురగుణయుక్తధర్మసంసక్తిఁబొదలి,బహుమహావనస్నాహభరితమగుచుఁ
గనుముచెలికాఁడమునితపోవనమొనర్పు,వలసినిలిచినగతిఁదపోవనముదనరె.

చ. అలయజుఁ డాకసంబునకు నాదరు వేమియు లేమిఁ బాపుగా
నిలిపినకప్పగంబములనీటుల నధ్వరధూమము ల్దగు
న్నలినపదుండు మానులసమక్షమునన్ శుచి యాట నాతనిం
బొలయక పాసి పోయెడుతమోగుణపుంజము బోలె నిచ్చలున్. 122

సీ. పుండరీకముల పెంపునఁ బొల్చుసారంగ మూహింపఁగా నిది యోగ్య మనఁగ
నలరుపంచాననైకాప్తినాగశ్రేణి యరసికాంచిన నిది యర్హ మనఁగ
నకులానుబంధనంధానంబుఁ గను చక్రి దర్శింప నిది యుచితం బనంగఁ
బరఁగుఁ గౌశికయుక్తిఁ జిరజీవివర్గంబు తలఁచిచూచిన నిది తగు ననంగ
విషమసాయక యిచ్చటివిబుధవర్య,లలఘుతరశబ్దశక్తి నాత్మార్థగతవి
రోధములుమాన్చిమనుపనారూఢమైత్రి,యావహిల్లుటచిత్రమేయహరహంబు.

గీ. ప్రాదినీసక్తులై కరకాభిరాములై యనంతపదాధీనులై నితాంత
వారితాహంకృతులునై నవారలిచటి,మునులు దఃపోసిచూచినఘనులుగారె.

చ. కళికలు చాలఁ జాలుకొనఁగాఁ దగుపాళెలఁ జాలుకీలకాం
చలములు నిండ ముత్తియపుజల్లుల మొల్లమిసూపఁ బూగముల్
చెలఁగెడుఁ గంటె శంబరవిజేతృకశాసనసుస్థితాత్ములై
యలరెడుమానిరాజులమహాతపవారణరాజులో యనన్. 125

సీ. శ్యామలు సౌరభ్యశాలిమధూళిచేఁ దైర్థికావళికిఁ బాద్యము లొసంగఁ
గొమ్మలు పాకానుగుణఫలప్రతతిచే నభ్యాగతులకు నాహార మిడఁగ
లతకూన లనిలలోలప్రవాళములచే వైదేశికులకు వీవనలు విసర
మహిళలు కుసుమకోమలదళశ్రేణిచేఁ బాంథసంతతికిఁ దల్పములమర్ప

ఘనరసాశయపద్మినుల్ కలితభృంగ,ఘోషభాషల నతిథులకుశల మడుగ
నంగసంభవ నిర్భరు లగుచు నిచటఁ,దపము సలిపెడుతాపసోత్తములఁగంటె.

సీ. అజిరతోరణములకై యుంచితిని జుమీ యతివ నీవీచిగుళ్లలమఁబోకు
మగ్రవేద్యర్చనకై యుంచితిని జుమీ యబల నీ వీమొగ్గ లంటఁబోకు
మజ్జనాభసపర్యకై యుంచితిని జుమీ కొమ్మ నీ వీవిరు లోఱయఁబోకు
మతిథిసంతర్పణకై యుంచితిని జుమీ తరుణి నీ వీపండ్లు దడవఁబోకు
మనుచు నొండొరుఁ బలుకుచు నలసగతులఁ
గౌను లసియాడఁ గుచములు గదలఁ గురులు
చెదరఁ బనఁటులు మూఁపునఁ జేర్చి లతల
కర్థి నీరార్చుమౌనికన్యకలఁ గంటె. 127

వ. మఱియు నీవనంబు నీవనం బురోవర్ధితశంబరం బైశంబరప్రవాహంబులీల వి
హారమాణహంసం బై హంసబింబంబులాగున వశీకృతగోప్రచారం బై గోప్ర
చారంబుంబోలె నవలంబితవృషం బై వృషపట్టనంబుకై వడిఁ బూర్ణసుమనో
జాతి యై సుమనోజాతిచందంబునఁ బవిత్రితగోత్రం బై గోత్రధరుకారుణ్యం
బుకైవ దేవదత్తామృతం బై యమృతాకరంబుతీరున ననంతసముద్భూతో
త్కలికం బై యుత్కలికలు సుమధూళిపరంపరలఁ గురియ సుమధూళిపరం
పరలు కదళికల నెరయఁ గదళికలు విమలస్థలసారసవనంబుల మొరయ విమ
లస్థలసారసవనంబులు శిఖికలాపంబుల మురియ శిఖికలాపంబులు మరున్ని
కరంబుల నొరయ మరున్నికరంబులు పున్నాగవర్గంబులఁ బొరయఁ బున్నా
గవర్గంబులు కుసుమభారంబుల విరియ సిరి యెసంగెఁ గనుంగొను మనుంగుఁ
జెలీ! యని నవవిలుకాఁడు తత్తపోవనంబు సొత్తెంచి. 128

—* మదనసైన్యము భరద్వాజునిగదియుట. *—

సీ. సహకారసహకారసాంద్రలతావృతాభోగయాగగృహాళి పొసఁగుచోటఁ
గరకాంతకరకాంతరరసార్ద్రభూమిభూమానిమానితతరు ల్మలయుచోట
ఘనసారఘనసారకలితానిలాకులాళిందకుందరసంబు చిందుచోట
వనజాతవనజాతవలితాపగానుగానేకకోకధ్వను ల్నెరయుచోటఁ
గేళికాశాలికాయితోత్తాలసాల,పాలికాశాలికాసారపద్మసద్మ
ఘూలికామాలికామదోత్తుంగభృంగ,బాలికాడోలికారతు ల్పరఁగుచోట.

గీ. తొగరువన్నె గుజ్జుచిగురుమామిడినీడఁ, జేరి కేలఁ బూలకోరికోల
మెఱయఁద్రిప్పుకొనుచుఁ బెఱ[1] కేలఁదియ్యవి,ల్లూఁతగాఁగనిలిచియుండుటయును.

సీ. నిడుచాలు వెనుచాయ నడకనిద్దపుఁదేఁటిగమి పీరజడలతో గంధవహుఁడు
చెలువంపు మైకప్పుజిగిసురమా వింతవగజగబిరుదుతో మృగధరుండుఁ
జొకరొంపుఁదుదిఱెక్కసోఁకుపుప్పొడిరేకపసుపుఁబావడలతోఁ బక్షి[2]కులముఁ
దొగరువన్నియమావిచిగురుమొత్తంబుగ్రొంబగలుపంజులతోడమాధవుండుఁ
ప్రకటగతి వచ్చి యహమహమికల మాక
మాక యుత్తరు వనుచు సంభ్రమ మొనర్ప
వారిఁ గరుణార్ద్రదృష్టిచే గౌరవించి
మునివరుని మీఁద సెలవిచ్చి పనుపుటయును. 131

ఉ. చొక్కపుఁబువ్వుఁజొంపములసొంపున మ్రాఁకులు విఱ్ఱవీఁగె నల్
దిక్కుల సావితావి నెలదేఁటులపాటల నీటునూపెఁ బ
ల్పక్కుల కాకలీకలకలధ్వని మీఱెఁ జకోరికోరికల్
నెక్కొనఁ బండువెన్నెలలు నిండె యథోచితవృత్తి నయ్యెడన్. 132

క. కనుఁగవ మోడ్చి నిదిధ్యా, సనతత్పరుఁ డగుచు మస్తచంద్రసుధానే
చనమునఁదనుఁదానెఱుఁగని, మునిఁ గనుఁగొని యేముదామునుందనికడఁకన్.

సీ. ఉడురాజు నిజనిశితోత్తాలకిరణసంఘము పేరిబలుచివ్వగడలఁజిమ్మి
మధుఁడు శాఖాన్యోన్యమర్శనవిస్ఫుతజ్వాలకావళిపేరి ఱాలఱువ్వి
పవనుండు పేఱెంబువాఱి గంధాయాత భృంగనిధ్వానంబు పేరఁ బిలిచి
శుకపికాదులు గరుత్ప్రకటధ్వనులపేర వివిధవాద్యంబుల రవళిఁజూపి
కేశవపదాబ్జచింతారసాశయాంత, రాళగతమానిహృదయశుండాల మవశ
మగుటవెలిఁ దార్పఁగాలేక హత్తియిట్టు,లమితనిజశక్తిమీఱఁబోరాడునపుడు.

సీ. తమ్ముఁబైకొనుకన్నుఁదమ్ముల శ్రుతులవతంసాళి రుతిపేరఁ దఱచుదూఱఁ
గరకంజరమకుఁ గంకణములంతర్మణిస్వనముల పేర నెచ్చరికఁ దెలుప
ఘనతరస్తనభారమున కుల్కి లేఁగౌను మొలనూలిరొదపేర మొఱలుపెట్ట
నడుగుఁదామరలకు హంసకంబులు చిఱుగంటమ్రోఁతలపేర గతులు దెల్ప
నడరు చంద్రకళాభిధానాప్సరోల, లామ లావణ్యవైభవాలంక్రియాభి
రామ యామన్మథునియగ్రసీమ నిల్చి, చిత్తగింపుము నన్నని సెలవుఁ బూని.

1. చ-చేత. 2. చ-గములు-ట-బలము.

క. వానికడ కేగె నతఁడును, మానసమానంగబలసమాగతివలనన్
ధ్యానంబు వదలఁ గాంచెన్, నానాదిక్కులను దక్షిణంబున నదియున్.

గీ. చెలులు సేవింప రత్నకాంచికలు మొఱయ, నల్లనల్లన[1] నతని డాయంగ నేగి
గరువమును నీటుమురిపంబుఁ గలికితనము, నారజంబును మెఱయఁ దదగ్రసరణి.

సీ. తరులకొయ్యన నిక్కి విరులందు నెపమున బాహుమూలద్యుతుల్ బయలువఱచి
ముంజేతిచిలుకకు ముద్దిచ్చు నెపమునఁ దావి కెంజిగురాకు మోవి సూపి
చెమటలార్పు మలంచి చెఱఁగూను నెపమున నిఱిగుబ్బచనుదోయి మఱుఁగుఁబుచ్చి
యలులు మోమునఁ జేరమలఁగెడు నెపమున నును వాలుఁగొప్పు గన్గొనఁగఁ జేసి
కినుక నుడిగంపుఁ జెలి నల్గి కను నెపమున
గొనబు నెలవంకబొమల జంకెనలు దెల్పి
యనుఁగుబోటులతోఁ గూడి యామ్య గాష్ఠి
సముచితవిలాసముల డాయు సమయమునను. 138

శా. కేలం బంగరుగచ్చుకోల లమరన్ గీర్వాణబాలామణుల్
శ్రీలీలావతిపట్టికట్టికలవారిం బోలి తజ్జైత్రవి
ద్యాలాలిత్యము లుగ్గడించి మృదులాలాపంబులం బాడుచుం
గోలాటంబులు వైచి రాయతి తనుం గూర్మిం గటాక్షింపఁగన్. 189

క. మలఁచి వలమూఁపుపైఁ గీ,ల్కొలిపిన పాదంబుమీఁదఁ గొమరగు లికుచం
బలఘూన్నాళాంభోరుహ, తలకర్ణికఁ దెగడ నొకతె తాండవమాడెన్. 140

[2]గీ. పాంథమృగయుకుఁ జనుమారుపక్షిఁ ద్రిప్పు
భ్రమయదండబర్హాతపత్ర మనఁగ
మెఱుఁగుమెయిదీఁగ వలగొనఁ దుఱుము బాదలఁ
దెఱవయొక్కతె బిఱబిఱఁ దిరుగఁ బట్టె. 141

గీ. తముఁ గలసి యష్టభూతు లింతకును గొనరు
వేల్పు లని తెల్పుగతి బొటవ్రేల నెనయఁ
దర్జనిఁ జెఱంగుఁ లించి తక్కువ్రేళ్లు
మించి నిక్కంగ దేశినటించె నొకతె. 142

1. క-మాని. 2. ఇదియుఁ గ్రిందిగీతమును ట-లో లేవు.

మ. ఉరుభోగోన్నతి మీరుతాళనులు సొంపూనన్ శిలాముక్రహిం
గరఁగ న్నిర్విటపాప్తి నిశ్చలతరు ల్గాఢానురాగాంకుర
స్ఫురణం బొందంగ హంసరాజిగతిచొప్పు ల్దప్పఁగా నొక్కనుం
దరి గీతంబులు పాడె నాత్మహృదయోత్సాహానుకూలంబుగన్. 143

చ. అరుదుగఁ జంద్రరేఖ యతి నప్పుడె కన్గొనినట్టు లందియల్
మొరయఁగ మేను సోలఁ గుచము ల్పొదల న్నెఱివేణి జాఱఁగా
సరభసవృత్తి నేగి యొకసంపఁగిక్రొవ్విరి మొగ్గ సిగ్గునం
గరకమలంబు సాఁచి కయికానుక గాఁగ నొసంగి యత్తఱిన్. 144

గీ. ప్రసవబాణుని నీయింటి బంటుగాఁగ, నిలువఁ జేసెద ననుచు నందియముదీఱ
నానయిడి చాల నమ్మింపఁబూనినట్టు, లమ్మునీంద్రునిపాదంబులంటి మ్రొక్కె.

ఉ. మందసమీరలోలలతమాడ్కి నొకింత వడంకు నూనుచున్
ముందఱ కేగి యాజటిలముఖ్యుని డాయఁగఁ గొంకి డెందమున్
డిందువడంగఁ జేయుచు వడిం బురికొల్పఁగ బుజ్జగించుసూ
టిం దరళస్ఫురత్కుచతటీఘటితాంజలి యై నయంబునన్. 146

సీ. తొడుకుబాబారొతుజడదాల్పువాడనిపూ వేలతాంగులవుట్టినిల్లు
జేజేలకవ్వు మాన్చినవదాన్యునిగన్నవనధి యే లేమలజననసీమ
మున్నీటనిల్లటంబువసించు దొరయూరుకాండ మేకాంతలఁగన్నకడుపు
వెన్నుపొక్కిటితమ్మినున్న వేలుపుమానసం బే వెలందులజన్మభూమి
నలువతలకోరగల మేటినెలవు మొదలు, [1]గాఁగలపదంబు లేనీలకచలయునికి
లట్టియచ్చరకులమునఁ బుట్టినట్టి, దాన నను జంద్రకళయండ్రు మానివర్య.

సీ. కమనీయతరగానగాంధర్వలాస్యతాండవకలారూఢిఁ బ్రౌఢ నగుదాన
సకలసౌఖ్యముల కాస్పదమైన దివి నేలు బలభేదిసవిధంబు కొలువుచెలువు
చిత్రరేఖా ఘృతాచీ ధాన్యమాలినీ రంభాదిసతులు నాప్రాణసఖులు
శ్రీరంగనాయకు సేవింప నిటకు నిచ్చలు రాకపోకలు నలుపుచుందు
నిన్ను సేవింపవచ్చితి నేఁడు దివ్య
మానివర తావకాలోకమహిమవలన
నలఘుసాత్త్వికభావంబు గలిగె నాకుఁ
దలఁపెఱిఁగి నన్నుఁ గరుణింపవలయు ననుడు. 148

1. చ-గాఁగనచలంబు.

క. కదలక మెదలక పైపైఁ,బొదలెడు గాంభీర్యధైర్యములతో యతి య
మ్మదవతిఁ దదనుచరుల న,య్యదనం గైకొనక యచలుఁడై యుండుటయున్.

సీ. చవిమెఱుంగవుగాక యపుదలచంద్రామృతంబుతొయ్యలియధరంబుసరియె
విన నెఱుంగవుగాక విశదనాదానుభావంబు పైఁదలిమణితంబుసరియె
తగ వెఱుంగవుగాక యగణితాసననిబంధము లింతిసురతబంధములసరియె
తలఁ పెఱుంగవుగాక దహరోద్గతారవిందమ్ము భామినివదనమ్ముసరియె
కానఁ దనుయోగమునకు సమాన మగునె
కానఁ దనుయోగమునఁ జెందఁగలసుఖంబు
మదనుమత మింత తలపోసి మాని యింక
మదనుమత మాత్మ వదలక మనఁగదయ్య. 150

ఉ. తేరకుఁ దేరఁగా భవదదృష్టవశంబున నేఁడు చెంతకుం
జేరిన మమ్ము గారవముసేయ నెఱుంగవుగాక యాత్మలో
నారసిచూడు మేమిఫల మందుట కుంకువలై తనర్చునో
ధారిణిఁ జేయుజన్నములు తాపసవృత్తులు వీరకృత్యముల్. 151

సీ. ఏడాకులనఁటుల నెనయుక్రమము గల్గ బూది నెమ్మెయినిండఁ బూయనేల
వైణవమౌక్తికవ్రాతమ్ము గలుగంగఁ బటికంపుఁబేరుఁ జేపట్టనేల
పూచినగురివెందపాదరుటింపులు గల్గఁ గాఱాకుగుడిసెల దూఱనేల
మృగనాభికాగళన్మృగనాభి కలుగంగ బిల్లవేలిమిబొట్టు వెట్టనేల
[1]జడనుబూని కటా సదసద్వివేక,చాతురి మనోజ్ఞమునఁ బూనవైతిగాక
తెలియనేర్చిన నీకానఁగలిగినవియె,యరసిసుఖియింపఁగారాదె సరసులకును.

మ. అనుధావద్వరహంసమండలము మాయానంబు దాస్యావలం
బనసోత్కంఠవనప్రియప్రకరము ల్మాపాట లింతేల మా
యనుఁగుంబ ల్కనుభావమాణశుక మాహాయిట్టిమాబోంట్లకా
తనరీత్యారుచిధార క్రబమె భరద్వాజా నినుం బైకొనన్. 153

క. కిలికించితలీలాగతిఁ, దిలకింపవు మృదుమదీయదేహాసక్తిం
బులకింపవు లేనగవులఁ, జిలికింప వి దేమి బాఁతఁ జేసిరె నిన్నున్. 154

క. అని చంద్రరేఖ యీగతి,మునిపతిఁ గొసర న్వసంతముఖ్యులు గడిమిన్
మొనసి తమతమకతమకం,బునఁ గదియుచు మరున కిదియెపో నం దనినన్.

---

1. చ-ట-జడత

ఉ. కాయజుఁ డల్లిపూబొమిడికం బిడి గేదఁగితేకుబాఁకుదా
రా యమరించి కల్వలజిరాపయి లేఁజిగురాకుచొక్కపుం
జాయల జాళువాకమరు చాల బిగించి ద్విజాళి మ్రోల జే
జే యన మందగంధవహాశ్వికరాదులు సందడింపఁగన్. 156



ఉ. తొక్కుల తేజి నెక్కి నన తేకుమిటారపువంకి నూటిగాఁ
జెక్కి బళీ యనం దరటునేసి ఘడాఘుడి రెండువీథులం
జకరుఁగ నూఁకినం జెమట జాఱ నొకించుక వన్నె సోఁకినం
ద్రొక్కినచోట్లు ద్రొక్కనిమరుం గని పల్మఱు మస్తరించుడున్. 157

ఉ. తోడన నూఁకి మల్లెననతూఁపులఁ గూడఁగ నేసి మర్మముల్
గాఁడఁగ మొల్లపూగొలకలం జుఱుకంటఁగ నొంచి తమ్మిపై
న్గేడెము చాఁటుచేసి తొవనేజముకొల్దికిఁ గ్రుమ్మి దిక్కుల
ల్లాడఁగ జాజిపూసబళ మంది ఘనధ్వని మీఱ నార్చుచున్. 158

ఉ. పూవిలుకాఁడు కీరహయము న్మని నంటఁగఁ దోలి నిల్పి తాఁ
బావడ లూఁది త్రొక్కి పరిపాటిగ ముందఱ సాఁగి నిక్కి ముం
జేవడిఁ జూఁపి యాఘునునిచిత్తము లక్ష్యము చేసి వైచె గా
త్రావళి నిర్గళన్మధుపరంపర నెత్తురు వోలెఁ గ్రమ్మఁగన్. 159

క. మారుం డంతటఁబోకన, దారుణగతి మించుమావితలిరాకుఁగటా
చూరిఁ గొని నఱకి పచ్చని, వారువముం డిగ్గి కదియ వచ్చి కడంకన్. 160

క. పేరెంబువాఱి హల్లక, కోరకకుంతంబుఁ గేలఁ గొని భీమణవాలం
కారంబు మీఱ నదలిచి, క్రూరత నమ్మాని మది చుఱుకుఱనఁ బొడువన్.

గీ. అంబరాంచలభాగదృశ్యంబు లగుచుఁ
దనరుతట్కాంతపృథుపయోధరము లవుడు
లలితనవచంచలాలోకములఁ బెనంగి
పొదలి యావాంసుఘనతమస్ఫురణ మడఁప. 162

సీ. అడరి జాత్యైనఘర్మాంబుపూరంబుచే వదలఁజాలనిధృతి వదలిపోయె
దట్టంబుగాఁ బర్వనిట్టూర్పుగాడ్పుచే నెడల నేరనిశీల మెగసిపోయెఁ
బెనఁగొని యందంద మొనయుకంపంబుచేఁ జనలేనిమహాగ్ర్యంబు జాఱిపోయె
వడిఁ బట్టు లేక మెల్పడుపులకాళిచే విడువ నోఁపనిలజ్జ [1]విడిచిపోయె

1 చ.ట-పీటిపోయె.

నకట యంతటిలోనె యొండొకటి మీఱి
తత్తఱము మోహమును దిట్టతనము గాఁగ
నఖిలమానులు వెఱగంద నరుగుదెంచి
ధరణితలనాథ మునిఁ గఱకటి యొనర్చె. 163

క. అతనుశరవర్షధారా,హతి నిట్లు మహోజడాశయం బవిసిన నా
యతి యతులబోధసేతు,ప్రతినవయత్నమున నిల్పి పటువిస్మయుఁడై. 164

మ. తనవిజ్ఞాననిరీక్షణస్ఫురణ నత్యంతంబు నూహించి త
ద్వనితాసన్నిధిదోషరోషభరనృత్యద్భ్రూయుగాభీలుఁ డై
ముని[1]కన్దోయి మిడుంగుఱు ల్గురియ సంభూతశ్రమాంభోనికుం
భనగర్జాయుతహుంక్రియార్భటి జనింపం గంపమానోష్ఠుఁ డై. 165

ఉ. త్రాస మొకింత లేక సవిధంబునఁ గారులు పల్కె దేల యో
సోసి మదాంధురాల తలపోసి భవ[2]న్నుతజాతిగర్వరే
ఖాసముదగ్రవైభవవికారము లిప్డ యడంతు నంచుఁ జే
రీసువడి న్శపించె నల యింతి నరాంగన యై జనింపఁగన్. 166

క. ఈకరణి నమ్మహర్షివి, భాకరునెఱిమినుకుల న్నవబంధురకాంతి
శ్రీకామనీయకవిశా, న్యాకృతి యై చంద్రరేఖ యడలుచుఁజనియెన్. 167

సీ. అరయ ననగ్నికుండాహుతిస్తోమమై బూదిఁ గూడె సుమాస్త్రిపోఁడిమెల్లఁ
జర్చింప నూషరస్థాపితబీజ మై ధూళిఁ గూడె సమీరుహాళి యెల్లఁ
జింతింప వఱదఁ గూర్చినచింతపం డయి నీటఁగూడె హిమాంశునేర్పులెల్లఁ
గనుఁగొన నడవినిగాచినవెన్నె లై చెట్లఁగూడె వసంతుచెల్వ మెల్ల
నకట చట్రాతిపై వాన యగుచుఁజెదరి,పఱచెనలువంకలకుఁబక్షిబలములెల్ల
విశ్వభూనాథ విను పదివేలమంది, మన్మథులకైనవానిదెమల్పవశమె. 168

క. ఆవేళ వాలుఁ బోవం, గావైచి లతాంతశరుఁడు కట్టా మునుము
న్నీవిధ మరయక [3]యిట్టులు, రావచ్చునె మనసుతావరంబుననుచున్. 169

క. వెనువెనుకకుఁ జని యొకపూ, చినసంపెఁగకొమ్మ రెండుచేతుల నవలం
బనముగ నొనరిచి పదముల, నెనయించినదృష్టి మస్త మెత్తక తనలోన్.

1. క-కన్దోన. 2. చ-భవత్సురజాతి 3. చ-ట-నాకున్.

క. సమదగతినిగిడిచిన వ్యర్థములై శతధాసహస్రధా నానాళీ
కములెల్లన్ జనియెను దళి, తములై చట్రాయి వానితలఁపు కటకటా. 171

సీ. [1]వెలవెలఁ బాఱెదు వేళఁ బెన్నట్టు క్రేవలఁ బట్టికుందెడువాని నమ్మి
వనములపాలయి మునుపున్నదళముల వదలి జాతికిఁ బాయువాని నమ్మి
తనరాకపోకలు గననీక మాయమై వడఁకుచు వర్తించువాని నమ్మి
కొమ్మలలోఁ డాఁగి కొదికి లావులు డాఁచి వంచినతల లూఁచువానినమ్మి
కటకటా దేవసభలోనఁ గండక్రొవ్వ
మాటలాడితిఁ గాని యీపాటివారె
యాప్తులనియెంచలేనైతి [2]శపజయంబు
పాల్పడితి నంచుఁ జనియె నాభావభవుఁడు. 172

క. ఆచంద్రరేఖయును దద్వాచంయమిశాప మెనసి వసుధ నవసుధా
రోచి యగురుక్మబాహు, క్ష్మాచక్రేశ్వరునకుం గుమారిక యయ్యెన్. 173

శా. ఆవృత్తాంత మశేషము న్విబుధలోకాధీశుఁ డేతద్వయ
స్యావాక్యంబుల నాలకించి సురకార్యాపన్న కావేలువుం
బూవుంబోణికి ధాత్రి నామరపురీభోగోన్నతు ల్గల్గఁ జే
తోవీథిం గరుణించి పంచె శుభగీతు ల్నేర్పఁగాఁ దుంబురున్. 174

శా. ఆగంధర్వుఁడు వచ్చి నాఁ టగోలె నత్యానందసంయుక్తుఁడై
రాగప్రౌఢిమ మీఱ గీతములు నేర్ప న్వేడ్క నే నమ్మహా
భాగుం గన్గొన నేగి యిప్పు డతఁ డంపన్నవ్యాకన్యాతటీ
భాగావాసుని రంగనాయకుని సంప్రార్థింపఁగా నేగెదన్. 175

క. అని పలికి విజయలోలువ, చనముల నాచంద్రభానుచర్య సకలమున్
విని ముని సమ్మదయుతుఁడై, పనివినియెం బిదప సత్యభామాసుతుఁడున్.

మ. సకలక్ష్మాతల[3]పుణ్యగణ్యపురవీక్షాదక్షుఁ డైనట్టిమా
నికులో త్తంసము వాగ్విలాసములు వింటే నెచ్చెలీ యెందు ని
ట్టికృతార్థుం గనుఁగొంటిమే యితనిసాటిం బల్కనిద్ధాత్రిలో
నాకసిద్ధుండును లేఁడు పో యనుచు నత్యుత్కంఠితస్వాంతుఁడై. 177

1. ట-వెలవెలఁబాఱుచు వేగబెన్గట్టుక్రేవంబడి. 2. చ-ట-నపయశంబు. 3. ట-చక్ర
పుణ్యాపుర.

క. చెలికాని కేలునం గేల్, నిలిపి కొలిచి వచ్చుజనుల నిలునిలుఁ
బలుమాఱు మానిచర్యలు, పలుకుచు వేత్రోక్కపువ్వుఁబందిలి

శా. గాంభీర్యాంబుధిరాజ రాజధరవాక్ప్రాణేశపత్రిప్రభా
శుంభత్కీర్తిసమాజ మాజనకచక్షుర్వైఖరీవంచితా
హంభావామరభూజ భూజననికాయస్వాంతభృంగావళీ
సంభావ్యాంఘ్రిపయోజ యోజకవిధానప్రీణితారణ్యకా.

క. అక్షీణయోగశిక్షా, దక్ష జగత్త్రితయసాక్షితాదీక్షిత దు
ర్లక్షచిదక్షుహృదక్షను, దక్షవణక్షుమధురాపద క్షాంతినిధీ,

తరళము. స్వరధిరాజసదనరాజసఖముఖీజనాతిభా
స్వరశిరోజనవసరోజసరసమాజసంతతా
చరితపూజ సవితృతేజ జపితృయాజకచ్ఛటా
సురధరాజ శుచిధరాజశుభసభాజనోన్నతా.

గద్యము. ఇది శ్రీమద్దత్తాత్రేయ యోగీంద్రచంద్రచరణారవింద వందన
తసరసకవితారసోదాత్త దత్తనామాత్యసోదర్య మల్లనమంత్రివర్య
చంద్రభానుచరిత్రంబనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు.

# చంద్రభాను చరిత్రము.

తృతీయాశ్వాసము.

క. శ్రీదత్తాత్రేయ సదా, మోదితసకలాదితేయ మునిగేయ చిదా
స్వాదాప్రమేయ యనసూ, యాదేవీశుక్తిమౌక్తికానఘకాయా. 1

వ. అవధరింపు మాసమయంబున. 2

గీ. అచట హితుఁ జూచి హరిసుతుం డనియె మనల
కిచట మ్రొక్కంగఁ జన దేవుఁ డెదురువచ్చె
మునివచనభంగి రెండొకపనియ గాఁగఁ
[1]దెలిపెఁ గుండినమునకుఁ బోవలయు మనకు. 3

క. మనవీరసేనునకుఁ గుం, డినమునఁ దుంబురుఁడు వీణ నేర్పెడునఁట యా
తనియనుజ యొకతె కుముదిని, యనఁ గలదఁట కార్యసిద్ధి యగు మన కచటన్

[2]ఉ. కావునఁ బంచసాయకుఁడు గంజభవాత్మజుచేతఁ గానవి
ద్యావిదుఁడై ప్రసిద్ధిఁ గనునంతకు మున్నుగ నేగి గేయలీ
లావిధు లెల్లఁ జాలఁ బదిలంబుగ నేర్చి యెట్టులైన నే
నావనజాక్షిఁ దెచ్చెద సఖా యట కిప్పుడు సంభ్రమంబునన్. 5

క. నావెంటనె రమ్మిఁక మన, మీవిధము పురంబుఁ జేర నేగి హరికి స
త్యావనితకు నెఱిఁగించినఁ, [3]బోఁ గనీ రిదియ వెడలిపోఁ దఱి యనినన్ 6

చ. అతఁడును నట్లకాక యన నప్పుడ వారనహాయశూరులై
ప్రతిదివసప్రయాణములఁ బట్టనపక్కణదుర్గదుర్గమా
యతతటినీవనీగిరు లనంతము లొక్కట దాఁటి పోయి రు
ద్ధతగతి వంత నిచ్చటఁ దదాప్తచమూనివహంబు లెంతయున్. 7

చ. క్రమమున నెల్లెడ న్వెదకి కానక క్రమ్మఱిపోయి యయ్యదూ
త్తమునకు విన్నవించుటయుఁ దత్ప్రమదాసుతబాంధవాప్తవ
ర్గము లడలొంది భావిశుభకార్యము నారదుచే నెఱింగి హృ
త్ప్రమదముఁ గాంచె నిచ్చట నృపాలకుమారవతంసు లొక్కెడన్. 8

1. చ - దెలిసి. 2. ట-లోలేదు. 3. చ - బోఁ గనీ రిపుడ వెడలిపోవుద మనినన్.

క. కని రలదుర్వాసుతపో, వనము స్సతతోజ్జ్వలత్సువనముం బుణ్యా
వనము న్నందయమిపదపా, వనముం జనదుష్క్రియానివహాధావనమున్. 9

క. కనుఁగొని యానందము నె, మ్మనమునఁ దళుకొత్త ధరణిమండలపతు ల
వ్వనమధ్యము దఱియఁగఁ జని, కనుఁగవలకు మోద[1]మొదవు నొకానొకచోటన్.

ఉ. మార్గాయాసము పో నికుంజపటలీమధ్యంబు సొత్తెంచి యం
తర్గేహంబునయందపోలె సుఖనిద్రం జెంది కల్లోలసం
సర్గానర్గళభానుజానిలసదాసంస్పృష్టరంభావనీ
వర్గోత్తాలపలాశవీజనముహుర్వ్యాధూతఘర్మంబుగన్. 11

ఉ. ఆయెడ నాశ్రమైణయుగ మచ్చట నచ్చట లేఁతపచ్చికల్
మేయుచు సారె నొండొకటి మేనులు మూర్కొనుచు న్నయంబునన్
డాయఁగ వచ్చి యాధరణినాథుల [2]మానిజనభ్రమంబునన్
రాయిడిఁ జేసెఁ బైఁ బడి చిరంతనతాదృశవాసనారతిన్. 12

చ. అలయిక నిద్రవోవుతఱి నాగతి సారెకు రాయిడించినన్
దెలిసి తటాన మేలుకని దిగ్గన లేచి యదూద్వహు ల్ద్ధముం
గలఁగుచుఁ జూచి చెంగునను గంతులు వేయుచుఁ బోవునట్టి జిం
కల బెదరించి జోడు దలఁగం గలగుండువడంగఁ దోలినన్. 13

చ. మిగుల భయార్తి నొండొకటి మించఁగ రెండును రెండుదిక్కులై
తగ బుసకొట్టుచుం బొదలు దాఁటుచుఁ గ్రమ్మఱి చూచుచు న్నురం
బెగయుచు గాలిఁ దీవ చలియించినకైనఁ దొలంగిపోవుచున్
దిగులున వచ్చి యమ్మునిపతిం గని యుల్కుచుఁ జెంత నిల్చినన్. 14

శా. ఆదుర్వాసుఁడు వానిఁ జూచి యవు డత్యంతానుకంపాంగవి
షౌధామంబులు దిగ్వటంకముల నుల్కాజాలము న్నింప వ
ర్యాదాలంఘనజాంఘికాగ్రహముతో నాఁడా మదీయాటవీ
లాదాంపత్యముఁ బాపె నెవ్వఁ డని యుల్కన్ ధ్యానసంస్థుఁ డై. 15

క. యదునాథనందనులఁ గా, మది నెఱిఁగి కటంబు లదర నూని కటకటా
తుదమొద లెఱుఁగక మదమునఁ, జెదరిసమదనింత సేయుఁ [illegible]ననుచున్.

సీ. ఎఱుఁగరే దేవతాధీశుసంపద లెల్లఁ గడలిలోఁ గలిపినగబ్బితనము
మఱచిరే సత్యభామామురారుల బండి[3] గొడ్డులఁ జేసినగొడ్డతనము

---

1. చ - మొసఁగఁగా. 2. చ - మానిభ్రమంబునన్వడిన్. 3. చ - గొంటుసేసినయట్టి.

తలఁపరే యరవిందభవునిల్లాలి ధాత్రికిఁ గూల ద్రొబ్బినదిట్టతనము
చూడరే రోఁకటిచూలికై సాంబుతోఁ దమునెల్లఁ దిట్టినదంటతనము
పెక్కులేమిటి కరయరే భీషణాక్షి, వీక్షణోత్క్షుద్రరూక్షాశుశుక్షణిక్షు
ణోష్ఠిస్ఫులికలలోక మొక్క మొగిన, భస్మముగఁ జేయఁజాలినబంటుతనము.

క. అని శమము లోఁ బోయన ముని, యనిశము లోనడరురోష మగ్గల మగుచుం
గనికరము మాసఁ జుఱచుఱఁ, గని కరమున శాపజలముఁ గైకొనునంతన్.

సీ. బహుకాలసాధ్యతపస్స్వ మేటికి మంటిపాలు సేసెద వని పలికె నత్రి
యావవాస్వయుఁడట యన్న యీతెగువ నీకనుచితం బనెఁ గర్దమాత్మజాత
సాంజలిగ్గౌ యుపాధ్యాయ యీయొకతప్పు సైరింపు మనియె శిష్యవ్రజంబు
అంతకు నెంత నీ వటుపలెఁ గోపింప నది లక్ష్యమా యని రన్యమునులు
వటితయుఁ దలకొకమాటగా మౌనినాథ, తాళుమన నద్దసేయక తపసి నిజమ్మృ
గంబు లెల్లట్ల వారును గన దొఱంగి, కలఁగ నిమ్మని శాపోదకంబు విడిచె.

క. అట్టిమహారభసపుఁదటిఁ, జెట్టున డిగినట్టు లగ్రసీమ మొలచిన
ట్లుట్టిపడినట్టు [1]మానులు, కట్టెదుట న్వ్యాసమౌని గనుఁగొనఁదయ్యెన్. 20

సీ. సత్యవతీమానసము నొందుహంససేంద్రు ముడివడునిడుద కెంజడలవాని
భరతనామాస్వయోద్ధరణుఁ దైపాను సౌమ్య విరిదమ్మిపూసలసరమువాని
వాసిష్ఠవంశాప్తి వఱలుముక్త్యాగ్రణి పలుచనినిడుయోగపట్టివాని
సంస్కృతభారతకళాకలితుఁ బోసత్ప్రతిఁ బలుత [2]పప్పళివన్నె చేలవాని
బ్రహ్మసూత్రవచోవిభాగసైన పథువీథిఁ, గేల మున్నీటిక్రొన్నీటిగిండివాని
నాగనాశరపుత్రు నుదర్కసౌమ్య, సాంద్రతరనేత్రుఁ గాంచి దుర్వాసుఁడపుడు.

క. వినవినవిని యయముఁ బిక్కుచు, ననునగతిఁ దోడి తెచ్చి యాతిథ్యంబుల్
నడపించిన సమ్మునిపతి, యని గైకొన కనిదెను భీషణోక్కటి మెఱయన్. 22

ఉ. బాలుర పుట్టుభోగులు నృపాలతనూభవు లెండకాఁకచేఁ
దూలినవారు గిర్వ్రతముఁ దోఁగెడువా రొకతప్పు సేసినం
జాలక యింత శాపమున నృపియించితి వోయి యిట్టినీ
కేల మునిత్వ మేల జప మేల జటాభర మేల సేవముల్. 23

[3]సీ. మునుమున్న యుపక్షిజని యించినటియించు నామీఁద భ్రూయుగం బొడసుదుట
ముంగలదూరిసమూహాంబుబుజయించు నామీఁదఁ బులకంబులంకురించుఁ

1. వ - తపసులు. 2. వ - పుప్పొడి. 3. ట - లోఁతేదు.

దోలుదొల్త నఖిలవిద్యలును నీరై జాఱు నామీఁద ఘర్మాంబు వడరు మేన
మొదటనే తపము సమూలంబుఁ జలియించు నామీఁదఁ బెదవి బిట్టదరసాగుఁ
గాన నూఱక శపియింప మానిపతికిఁ, దీరునే యోయిమానిసి దిండితబిసి
విసపుఁ జెట్టున్న కూడలు [1]విడిచినట్లు, జడలు జనియించి చెఱిచె మస్తమున నీకు.

చ. ముని నని పేరు వెట్టికొని ముక్కునఁ గోపముఁ దాల్చి యీగతిన్
జనుల శపింప దీన నొకసద్గతి గల్గునె మర్త్యమాత్రులే
వనజదళాక్షునందనులు వారలు వారలఁ జూడకున్న న
ద్దనుజవిభేదిఁ జూడవలదా ఖల దారుణ ధూర్తవర్తనా. 25

[2]క. అని యనితరసహ్యంబైఁ, గనగనమనుచూడ్కిఁ గోపకళ క్రాలుకొనన్
ముని మునిసి యత్రితనయుం, గని కనికర ముడిగి పలికి కటకటఁ బడినన్.

క. రోషారుణాక్షివీక్షా, భీషణవదనంబుతోడఁ బెదవు లదర నా
దోషాకరానుజుఁడు కటు, భాషణముల వ్యాసుఁ జూచి పలికెను గలఁకన్.

ఉ. వంచన నావనంబునకు వచ్చి మదించి దయావిహీనులై
పెంచిన యేణశాబముల బిట్టదలించినఁ జూచి నేను గో
పించి యథోచితంబుగ శపించితి నిందుల కీవు వచ్చి గ
ద్దించఁగ నేమికారణము దెల్పఁగదోయి భవత్ప్రతాపముల్. 28

[3]క. వాకిలి దెఱచినఁ జాలున్, సాకిరి బలికెద నటంచుఁ జనుదెంచి కడుం
జీకాకువడఁగ నాడిన, నీకు న్వెఱచెదమె తెలియనేరవు మమ్మున్. 29

చ. నను మునిమాత్రు నాడుగతి నాటఁగ నాడిన నేఁడు నీకు నే
ననునయభాషణంబులఁ బ్రియంబులు వల్కుదునే యమర్షసం
జనితనితాంతభీషణనిశాతకశాతరశేక్షణంబులం
గినుక నడంతుఁ గాక వెడగి[4]ర్పులు నాయెడ మాను మంచొగిన్. 30

స్రగ్ధర. క్రుద్ధుండై బల్విడిం బల్కుచు నపుడు దృఢాంకూరితాహంక్రియాసం
బద్ధద్వేషంబుతోడం బ్రళయశిఖిగతి న్మండుదుర్వాసు వ్యాసుం
డిద్ధామర్షంబుతో బిట్టెగసి పలికె వా రిద్దఱుం దాళలే క
త్యోద్ధత్యం బొప్ప నన్యోన్యము శపనవిధాయత్తులై యుండునంతన్. 31

---

1. చ - వీఁగినట్లు. 2. ట - లోఁబద్యమునకుమాఱు "అనిన" అనుమాటమాత్రముగలదు. 3. ట - లో దీనితో నైదుపద్యములకు "ఆయిద్దఱుం బెద్దప్రొద్దువిడిం బిఱుతివియక పోరునెడ నబ్బాలకద్వయంబు" అనువచనముమాత్రము గలదు. 4. చ - వెడకిర్దలు.

క. విఱిగె ధర జరిగె నుడుతతు, లొఱిగె నభం బరిగె వార్ధు లూటాడె గిరుల్
వెఱచె జగ మఱచె దిశ ల, త్తఱి వారలరోషగద్గదధ్వానములన్. 32

ఉ. గ్రక్కున లేచి యంపసెలగల్ దగు పెన్పొదులూని సింగిణీ
లెక్కిడి చేత నాలుగయి దేర్చినతూపులు సంతరించి నల్
ప్రక్కలఁ జూచుచుం గలకలం బుదయించినత్రోవ నిల్చి యా
దిక్కునఁ బాఱుసంయములు దెల్పు నశేషము నాలకించుచున్. 33

మ. చని యుగ్రావని వారు గాంచిరి జటాసంఛన్న[1]సర్వాంగులన్
జనితేర్ష్యావశులన్ మిథశ్శపనదీప్తాస్రప్రస్ఖలద్వాక్యులం
గనదాలోకవికీర్ణపావకుల హుంకారోర్జితాన్యోన్యత
ర్జనులన్ భ్రూకుటిభీకరాకృతులఁ బారాశర్యదుర్వాసులన్. 34

[2]క. కాంచి ప్రదక్షిణవిధు ల, త్యంచితగతి నాచరించి సాష్టాంగము ల
ర్పించి యలమునుల వారు ను, తించిరి గంభీరభారతీగుంభనలన్. 35

సీ. శౌరిపాదాబ్జసంసక్తాయ ముక్తాయ సోమచూడారత్నసోదరాయ
సకలపురాణప్రశంసాయ హంసాయ బలభేదిగర్వవిభంజనాయ
సత్యవతీగర్భజాతాయ పూతాయ కర్దమజానందకందలాయ
శ్రీవసిష్ఠకులప్రసిద్ధాయ శుద్ధాయ శాంభవతేజోంశసంభవాయ
సతిరమర్త్యనుతాయసుప్రతిహితాయ, సతిరవార్యనవార్యమద్యుతియుతాయ
సతి రతివివిక్తతనయాయ తతనయాయ, సతి రశేషవిశేషమత్యతిశయాయ.

క. అని యిరువురఁ బొగడిన నం, దనసూయాసుతుండు శాంతుఁడై నిజశాపో
క్తినిశాతశూలకృతశా, తనుల యదూద్భవులఁ జూచి దయతోఁ బలికెన్.

ఉ. మీ రొక యేఁడు జో డెడసి మీఁదటఁ గుండిన[3]పట్టనేందిరా
గారములోన నొండొకని గన్గొని వాంఛితవైభవంబు చే
కూరిన నింపుసొం పెసఁగ గోపవధూపతితోడఁ గూడి మీ
ద్వారవతీపురంబునకు వత్తురుగాని తలంక నేటికిన్. 38

క. అని పలికిన దుర్వాసో, మునిచేఁ బనివిని దయాసమున్నతు వ్యాసుం
గని పునరవనతి సలిపిన, ననుపమవాత్సల్యగరిమ నతఁ డిట్లనియెన్. 39

---

1. క - దివ్యాంగులన్. 2. ట - లో దీనితోఁ బై మూఁడుపద్యములకు మాఱు "చూచి ప్రదక్షిణనమస్కారంబు లర్పించి యున్నం జూచి యనసూయాసుతుండు దయార్ద్రచిత్తుండై" యను వచనముగలదు. 3. చ - పట్టనామరా.

చ. అభిమతకన్యకాపరిణయైకకుతూహలశాలులై మహా
విభవవిశాలురై మనుజు విశ్వధరావలయంబు మెచ్చ నో
శుభమతులార యంచుఁ దముఁ జూచి యనుగ్రహ మాచరింప వా
రభినవధైర్యధుర్యహృదయాంబుజులై చనుచు న్వనంబునన్. 40

[1] సీ. వనతరుల్లలులైనఁ గనకపోదుమొ యంచుఁ దమపరస్పరవదనములు గనుచు
గెడవాయఁ దెరువున నెడసిపోదుమొ యంచు నన్యోన్యహస్తములలమికొనుచు
ఘనఝిల్లికార్భటి వినకపోదుమొ యంచు సారె మిథోవాక్యసరణి వినుచు
మదగజాదినిరీక్ష మఱపువచ్చునొ యంచు నితరేతరవిమర్శ మీాయకొనుచుఁ
దఱచు వంకల ననుచుమాధవులఁ బెనచు
జమళిమల్లియ లనుచు వాసనలఁ గొనుచుఁ
బొలయుగాడ్పుల నినుచుచల్వలనె మనుచుఁ
గలయఁ దేఁటులఁ బెనుచు మార్గములఁ జనుచు. 41

క. ఈఱములు గుబురుకొను నెడఁ, దాఱుచు వారేగు తెరువు దప్పి చెమటమై
నేఱులుగఁ గాకి దూఱని, కాఱడవిని బోవుచో నాకానొకచోటన్. 42

ఉ. అధ్వగదత్తతిలాక్షతగ్రహణసంకులమూషికారాజికూజితములు
శ్లథవప్రపాషాణసంధిజాతవటానసీరుహాలోలఝిల్లీరవములు
లూతాఘటితతంతుజాతాభిసృతదారుగోపానసీ[2]సటద్ఘుణారుతములు
ప్రశిథిలప్రాసాదభాగగేహాన్యోన్యనిషభ్రమచ్ఛుశీనిస్వసములు
జీంప్రుచుని మ్రోయఁ జెదరినచిత్తరువ్రులఁ, బడినగోడలనొరగుకంబములఁబట్టు
వదలుగారలతోఁ గానవచ్చె బహుళి, పాలయుం బైనశూన్యశివాలయంబు.

మ. ఘనహాళిం బెనఁగొన్నబల్లిపరరేఖాచంద్రుఁ డంగంబుఁ జెం
దినజీర్ణోరగకంచుకచ్ఛటలు తాదృగ్భూష లందంద చిం
దునుసుల్ భూతిరజంబునై తనరు రుద్రుం డట్టిశూన్యాలయం
బునఁ గాఁపుండియుఁ గాంచుఁ బ్రాక్తనమహాభోగంబు లెల్లప్పుడున్. 44

గీ. ఆమిషభ్రాంతిచేఁ జించినట్టిజీర్ణ, చిత్రపటఖండములు పైనిఁ జెదరి రాలఁ
దాల్చి తగు నందు మూషికతతి గణాధి, పతికుథాలంకృతానేకపము లనంగ.

సీ. అన్యోన్యనాదకుపత్సింహహుంకృతి హోరనురొదఁ దలయేరు వాడమ
భుజగభీమాలయభూమిఁ బేర్కొనిన పిచ్చిపిషంబున నోరు చేదుదాల్పఁ

1. ట - లో లేదు. 2. చ - సపద్ఘుణరుతములు.

జటులరఘుంఝగా ప్రభంజనసముహోద్ధతిఁ గ్రమ్మురమంటఁగనుఁదమ్మిచుఱుకుఁ బూన
ననువవాహోరివిషాణఘట్టనభీతి నిగుడునన్నున మేనునగము గాఁగ
నహూహాచక్రాతిసంటివాఁడగుటనచట, శంభుఁడో కయంచు కేనియుశంక లేక
నిలిచెఁ గాక మహేశ్వరుఁ దలఁచి లేని, తోలు నెమ్ములుఁ గనుపట్టఁ దూలరెట్లు.

చ. మును గజశైరి యం చడుగుముట్టఁగ వస్త్రము ద్రొబ్బి తో గజా
ననజనకత్వ మెంచిరొ వనద్విరదమ్ములు దుమ్ముఁ గర్ణచా
లనములఁ ద్రోఁచి హస్తసలిలంబున దాఁచి ఘటించుఁ బద్దినీ
ఘనవనయోగసంతతవికస్వరపుష్కరము ల్తదీశుపైఁ. 47

[1]సీ. చీలలు చెవరి బచ్చెన చిట్లి వానలఁ గూలుకొమ్మలతోడి గోపురములు
పాడుగూర్చిప్రజ పాడుపాలము మేఁపుచు రేలమందలాఁగినభోగమండపములు
నుసిపట్టి పసి నుగ్గునూఁచంబులై బండికంపు దక్కఁగ నేలఁ గలియు తేరు
లెడలేక తఱచు ప్రేలెడు జిబ్బటీలచే గబ్బులు వెదచల్లు గర్భగృహము
లోరఁగలుఁజాలుపసితానలూడి ప్రాఁచి, బూరటిలినీరుగననీకపూరిమొలచు
బావులును గల్గునచట భూపాలసుతులు, చేరియొకచోట నలఁతవసించునంత.

క. భీమతరహాయహేషా, ఘోషము వినవచ్చుటయును గుఱుగట వార
స్వోషించి కాంచి రస్త్రవి, శేషోజ్జ్వల మైనయొక్క చిత్రరథంబుఁ. 49

ఉ. కాంచి తదగ్రధీరతురగస్ఫురణంబుఁ దదీయలోహచ
క్రాంచలపాటనంబును దదస్త్రసమృద్ధియుఁ దత్పతాకికా
భృంచితకాంతియు స్నయమనస్వముగాఁ జెలికాని సూతుఁ గా
వించి ముకుందనందనుఁడు వేడుకఁ దద్రథ మెక్కె తోలఁగఁ. 50

సీ. పంకరకాంకరవలుదకోఱలు మించు సెలవులపాల కీఁగ లలమిమూఁగఁ
జెలుచ బీఱపురాలు పసఁగొన్న ముక్కొంకబరుసుగుత్తుకఁ బ్రేవుసరులు ప్రేల
నీచవోయినముట్టియూఁచవిఱుందుపైఁ గఱకుతోల్చట్టి పెన్నుటికి వలన
నిఱుకటంబుగఁ గ్రుంగియొఱగువోయినగూడమూఁపుపైగదమిన్నుముట్టివెలుఁగఁ
గోఱవిూసల గిజిగానిగూఁడువోసి, నోర మానిసితలలు లేనారికెడపుఁ
బొంగ్లములనలెఁబిల్చుచు భువనభయద, కాయుఁడొకరక్కసుఁడువారిఁగదియవచ్చి.

[2]మహాస్రగ్ధర. కఠినోగ్రగ్రంథిసృక్వగ్రథితపిశితదుర్గంధసంబంధశశ్వ
చ్ఛ్వాసనాసాదేశవాసిశ్వసనవిసరసంచారఘోరాననాయః

---

1. ట - లోనిదియు దీని క్రిందిదియు లేవు. 2. ట - లోలేదు.

పిశరప్రవ్యక్తదంష్ట్రాపృథుమథనభవత్ఫేనసంతానకుల్యా
లుఠనార్ద్రోన్నిద్రజిహ్వాలుఠనభయదఫల్గుధ్వనిః రాజు బల్కెన్. 52

ఉ. ఓరి వరాక నేఁడు మది నోడక మామకకాననాంతముం
జేరుట యెట్లు చేరి పయిచేటు గణింపక కండక్రొవ్వునం
దే రిది యెక్కుటెట్లు విధి ద్రిప్పుకరాఁ బొలకై కడంగునా
బారికి నగ్గమైతి విదె [1]బల్విడి ద్రుంగెద నీక్షణంబునన్. 53

క. ఏచటికి నరిగెద వని రా, త్రిచరుం డాభీలశూలశేఖుఁ [2]జదలఁ ద్రి
ప్పుచుఁ జటులవహ్నుంక్రియాగ్భటి, నచలము లూటాడ నతిరయంబున నైవన్.

[3]స్రగ్విణి. గాఢనక్తంచరగ్రామభస్మీకృతి, ప్రౌఢరుద్రేక్షణప్రాయశ్శృంగత్రయీ
లీఢఘంటారవాళీకరాళాంతకృ, ద్రూఢగర్జాప్రజారుంతుదధ్వాన మై 55

శా. ఆశూలం బసుదేరఁ గ్రూరతరబాహాగర్వదుర్వారుఁ డై
యాశాభూధరకూటకోటి వడి నూటాడంగ బిట్టార్చి ధా
త్రీశోత్తంసము విల్లువంచి గొనయం బెక్కించి చే మించి నా
నాశాతాశుగము ల్నిగుడ్ప నది సాంద్రజ్వాలికాభీల మై. 56

భుజంగప్రయాతము. కరాళాశుగౌఘంబుఁ గైకోక పైపై
నరాళాకృతి న్నా మహాబాహువీచీ
మరాళచ్ఛటానూ్ఫర్తిమద్వజ్రహేతి
త్వరాలక్ష్మిఁ దచ్ఛూలదండంబుఁ ద్రుంచెన్. 57

గీ. త్రుంచుటయు నఖర్వదుర్వారకోపుఁ డై, యసుర శక్తి నైవ పారినుతుండు
దానిఁ బటుకృతాంతదంష్ట్రాసితాంతశి, ఖాంతకాంతకుంతహతి నడంచె. 58

క. తనశక్తి యిట్లు వడనం, తన భక్తివహింప కసుర తత్సమరమునం
దనుశయముఁదొఱఁగిక్రమ్మఱ, ననుశయమునలీలనొకమహాగదగొనుచున్.

[4]మత్తకోకిల. రాజరాజయశాంశు న న్నెదుర [5]న్నరుం డితఁ డెంత యా
రాజరాజసఖుండు నోపఁ డరాతిఘాతిధృతాసిధా
రాజరాజున కస్త్రవస్త్రపరంపరల్ జత జంభవీ
రాజరాజముఖామరావళి నైన నే [6]నలయింపుదున్. 60

మాలిని. అని యనితరధార్యాహార్యశౌర్యాస్పదం బై
కనకన మని నిప్పు ల్గ్రక్కునుద్యద్గదం గ్ర

---

1. చ - ట - బట్టిమెసంగెద. 2. చ - ట - జెదరఁ. 3. ట-లో లేదు. 4. ట-లో నీక్రింది నాలుగుపద్యములు లేవు. 5. చ - శరన్నరుఁడెంతయా. 6. బొలింబుంచెదన్.

క్కనఁ గనలుచు రోషాయత్తచిత్తంబుతో వాఁ
డని నవియతమార్గుం డౌచు రాచూలి వైచెన్. 61

ఉ. వైచిన నమ్మహాగద యవార్యగతిం దను డాయ వచ్చినం
జూచి నృపాలుఁ డోరసిలి శూరతమైఁ బరిఘంబు సాఁచి రెం
డై చటులాకృతిం బడ రయంబునఁ ద్రుంచిన నన్నిశాచరుం
డేచినకిన్కతో నొకమహీరుహముం బెకలించి యార్చుచున్. 62

క. బిరబిరనఁ గేలఁ ద్రిప్పుచు, దురదుర నేతేర ధరణిధూర్వహుఁ డతనిం
బరిమార్పఁగరా దొండొక, తెరువున నని యనుసమరదృఢసంభ్రముఁడై.

వ. ఆసమయంబునఁ బగఱపాఁగ రిగుర నెగుచుతేజి సబలంబు లగుసబళంబు
లును విలిప్తహాటకంబు లగుఖేటకంబులును మునురువిసమున నెసక మెసఁగుచి
లువపిలుకలఁ గలకల నగుతళతళనిచిలుకుములుకులును నవక్రరుచిక్రమా
క్రాంతదిశాచక్రంబు లగుచక్రంబులును బరరాజసమాజంబు నాజిం బరా
జయంబు నొందించు తేజంబులు గల నేజంబులును నిజకమణజనితవిస్ఫుటస్ఫు
లింగసంఘసంఘృష్టవియత్తలంబు లగునత్తలంబులు మొదలగు నానాయుధం
బులు గల్గ నాయోధనంబులం బ్రతిపేరవరదం బగునరదంబు నడిపి నిర
పమప్రభాప్రభాతభానుం డగుచంద్రభానుం డాతత కేతనాకుంతఘంటాఘణ
ఘణాత్కారంబులును రంగత్తురంగగళకలితకింకిణీక్రేంకారంబులును సఖిజ్య
కోదండశింజినీటంకారంబులును సైంధవతోలనాలోలవిజయుల్లోలహుంకా
రంబులునుం గలసి యుద్వేగకలకలంబుఁ జిలుక నలుక సమిద్ధరయంబున
నెదురుపడి కదిసినఁ జుట్టుముట్టి రట్టడియై మట్టుమీఱి నెట్టుకొనిన దిట్టతనం
బునఁ బుట్టు నట్టహాసంబున ధరాధరథట్టంబులు బిట్టవియ నొక్కట నా
రక్కసుం డుక్కుమిగిలి గ్రక్కున నక్కుమారశిరోమణి కిరీటపాటనత్వరా
పరాయణంబుగా (ముత్తాలసాలం బాభీలగతి గిరగిరం ద్రిప్పి వైచె వైచిన
నుఱక రాజు దాని నఱకె నఱికినం బిఱికిగొనక యయ్యసుర కుప్పించి
యెగసి మగతనంబున సారథిపేరురంబున బోరన ధారాళరక్తంబులు గురియ
సురియఁగొని పఱియలువడ నడిచినప్పు డప్పుడమితేఁడు కడువడిం దొడరి
కడలుకొను కడిమిం బొడముసిడిముడిఁ దడఁబడక గడిసేసి నసురనిడుద
యొడలు నుడివడఁ దొడివడ నలుగడలు గడగడగడ వడంకి జడిగొని
నెవలు వెడందవాలికడిందియంపఱ నింప నన్నిలింపారి తలఁపోఱి కరకె

( ) ఈగ్రంథము చ - లో మాత్రమున్నది.

మానమానసుండై దరిసి మురిసి(యు) వివిధసవిధకుధరకూటఘాటంబులతో నిరాఘాటపాటవంబున నుత్పాటించి మించిన క్రొవ్వున సప్పిరవరేఖ్య నెడ ముఖ్వి నవ్వుచు నార్చి కార్చిచ్చుపగిదిఁ బేర్చి వికటకటతటనికటదంష్ట్రాపుటంబులు గిటకిట గీఁటుచుఁ గుటిలగతి నుడుమండలంబు సోఁక నేకజాంఘికత లంఘించి మించినం గాంచి యమ్మించువెలుంగుకోలముదార మెచ్చి యిచ్చోం బొగమున నెయ్యెడన గగనతలంబుననుండి మగిడి రథచక్రంబు లిరుసులకొలఁది దిగఁబడ నొగలిమీఁదికి దుమికి కేలు కసకుండ సూతు నాతతకరచపేటాస్ఫోటంబు పెల్లునఁ ద్రెళ్లి మూర్ఛిల్లం జేసి యుబ్బి బొబ్బ లిడునబ్బలియుని జూచి యద్దానవరిపుసూనుండు నిజనిశితకరకరవాలధార నురంబు చుఱుకుచుఱు కన నఱకినఁ బిటికితనంబున వెఱచఱచి పిఱుతిగిచి యుఱికి పఱచుటయుఁ దానును వానివెంట నంటి బంటుతనంబునఁ బ్రఘుతరరథావతరణంబొనర్చి యఖండకోదండపాండిత్యంబునఁ జెఱచుమెఱుంగులు గిఱికొన మిఱుమిఱు మెఱయు నుఱిది గొఱక లురవడిం గెరలి సరిపెణం బఱపి సెలవుచుచుఁ దఱిమినఁ దెఱపి గనలేక నాకిద్వేషి కాలికొలందికి సరిగియుఁ దిరిగి మరలం బిరుదుమెఱసి తరుపరంపరల మాటుగొని సమీపశిలాశకలంబు లదవదం బదంబుల నందికొని యనుపమానగతిఁ జిట్టుచిట్టున వైచుచు రాచూలిం గదిసిన నతండు ఖేటంబు చాటుగా వెనుకసడ సపరి తేరెక్కి నెవ నెక్కుడుజవంబున నక్కఱకుఁబోలనుఁ దిండి గండుమీఱితే యుంపెటుంగికో తదీయస్యందనంబు క్రిందికి మోరత్రోపునఁ జొరం బాఱి మూలచాఁవు గల మూఁపుల నెత్తినేలఁ గూలంబడ నెట్టిన నట్టులు వీడి పుట్టచెండుమొండున మిక్కుటంబుగఁ బుటంబు లెగయ నిజేచ్ఛం జనుహాయంబులు తోడివడంబోవుట చూచి రాచవారు రథికప్రమేయులు గాన బిగ్గిలి చనుయుగ్యంబులఁ బట్టి యరదంబు మెఱపు మెఱసినచందంబున నందంబునూన మరల్చి యేపున ససహ్యారంహసింహనాదంబుగఁ గోదండంబు సారించి పేరించి యాశీత్రాశి నాశీవిషసమాననానాసూనబాణసంతానంబులు మానంబు దూలించి కీలాలజాలంబులఁ దేలించిన నించుకవడి బెడఁగుపడి యదవంబున నిమునుకొను బడలిక నొకయనోకహంబునీడ నొఱంగి వెఱఁగుపడి పరికించుతఱి నెవమీఁక పొడమి రథచోదకుం డొదటఁ గ్రుద్ధుండై బిట్టువైరంబునఁ బ్రేంఖత్కంఖాణ బాణపుంఖసంఘాతసంజాతజ్యాతలధూళికాపాళియు సదభ్రభ్రమణవిభ్రమకృత్ప్రభవత్తలాతలకఠినలుఠదయోమయనేమిఘుర్ఘురనిర్ఘోషంబును దక్కనొంటే

ట్టియుఁ గనవినఁబడకుండఁ బండ్రెండ్రోలినంత నంతకాకారుండై పంతంబు మెఱయ సంతమసవతీచరప్రవరుండును గరాళకరాలక్షితకంఠాళుండై హుంకరించి యహంకారంబున నీవెందుఁ బోయెద వని యుదుటునం బొదలుమదంబున హత్తి మొత్తుటయుఁ గత్తలానులుం బెగ్గిలి మ్రొగ్గిన సోఁగవాగియలు సారథి నిజభుజాయుగంబునఁ గుదియంబట్టి బిట్టెత్తినం దత్తరంబున నుత్తేజకాశ్వరాజిముఖరనూపురపురశ్చరణఖరఖురశిఖరంబు లంబరంబున బయలు వ్రాఁక జోకఁ బిటిందిపదంబులన కొంతదూరంబు తేరీడ్చికొని తమకంబునఁ ధుముకుగమకంబున వియచ్చరు లచ్చెరువడి చూడ నమ్మహీమండలాఖండలుండును నయ్యంతదురంతసాహసబాహాసాహాయ్యంబు నూహించి యహో యని సంతసించి పొంగి యుతండు నిండుమనంబున ఘోటకబృందంబుకంఠంబులు ప్రోదిగ నప్పటప్పటి కప్పళించుచుఁ జెవులు నివిరి మొగంబులు దుడిచిన భూరిపూత్కారభూషితతాలువుల డిండీరఖండంబులు తండతండంబులుగ వడఁగ గఱకఱఁ గళ్లెంబులు కొఱుకుచు జోడనల వహేలంబుగా మగుడుటయుఁ దోడన వెంబడిం బఱచి యురుతరశక్తి నన్నక్తంచరుండు ఫిటీందికి వచ్చి భుజార్గళంబున నిరుగడ నిరుసుకొన దివియంబట్టి జంగయిడి క్రుంగి కుతికిలంబడి సాఁగనీక కూఁకలిడ నారాకొమారుండు పెడమరలఁ దిరిగి యత్యాగ్రహంబునఁ బ్రత్యాలీఢపాదుండై వింట నొంటొంట మంట లుమియుకుఱుగంటుములుకు లెదురు చిమ్మినకైవడిఁ గణుద్దురీఁగలు మూఁగిన తెఱంగున నాదారకుండ్డా పాణిద్వయుతలప్రతలంబులు నూటివడ నాట సవ్యసాచియై యేసి యీాసు నులుకుఁ బుట్టించినం బట్టువదలి కళవళించి నిలువరింపలేక కదలి పఱచుటయు వెనుకనడ నడరి తేరెక్కి వెంటనంటి కవిసి మనుజపతి ప్రబలం బగుసబళంబు వక్షస్థలంబున గ్రుచ్చినఁ జచ్చినపోల్కి వెలికిలఁబడి పొలిసెఁ బొలిసెఁ బలాశి యనుతఱి నపొరలి వడి సడలక దిటంబున మచ్చెపుట్టంబు లెగయుచు బెగడునఁ గొన్నియడుగులు నిగిడి మగంటిమి మిగుల డగరతనంబున లేచి యాచేరువ గండోపలఖండంబుఁ గేలఁ గైకొనుతఱి సాత్రాజితీపుత్రుండు గోత్రనిభగాత్రుం డగునీసత్రాశనశత్రుండు శరమాత్రభేద్యుండు గాఁ డని యూహించి యానిశాచరవీరుపై సౌరాస్త్రంబుం బ్రయోగించుటయును. 64

క. గిరు లొరఁగఁ దరులు విఱుగ, న్వరనిధులు గలంగఁ దరణి చాయదొలంగఁ
హరిదంతంబులు వగులఁగ, నురవడి నఱచుచు నిశాటుఁ డుగ్రోం గూలెన్.

సీ. చికిలిచంద్రికవన్నెఁ జీబులేఁగరకంచు వలిపెపుప్పటి వల్లెవాటు వైచి
రవసందిదండజీరల దోరవాటినమెడ నింపఁ గస్తూరి మెదిచి మెత్తి
కఠినవక్షోజసంఘట్టనాంకితభుజాంతరమునఁ దుమ్మెద తాళిఁ జేర్చి
నవమాలికాప్రసూనకరంబితం బైనశిఖ నిండఁ దాయెతు చేరుఁ జుట్టి
వీట నెవ్వరిఁ గనుఁగొన్న వెకలిరీతి, నశ్మసచివుని గనుగీఁటి నవ్వుకొనుచు
నారజము మీఱఁ దత్పురాభ్యంతరమున, నల్లనల్లన చనుదెంచు నవసరమున.

క. గంగా హిమగిరితటభూ, గంగం బరిఫుల్లమల్లికామోదితసా
రంగ న్విభురుచిరుచిరత, రంగం గనుతెమ్మి హ్యానంతరంబునఁ జెలఁగన్. 74

శా. ప్రేంఖచ్చందనగంధగంధవహనిర్నిద్రోచ్చలద్వీచికా
ప్రేంఖోళీస్మితఫేనఖండములకుం బెన్నుద్దులై సద్మభూ
కంఖాణంబులు సంచరింపఁ దగుతద్గంగాప్రసంతీతటిన్
న్యంఖానక్తకు గాలవాఖ్యమునిఁ గన్గొంటిం బ్రమోదంబునన్. 75

క. కనుఁగొని యుపహితమలినై, వినయంబునఁ జేఁగి మ్రొక్కి వీక్షింప కతం
డనుపమమనువరనిశ్చల, మనస్కుఁడై యుండె నయనుమదమున నేనున్.

చ. తొడిఁబడ మాయచేత నతిఘూర్ణనిశాచరవేషధారినై
యపరి ఘనాఘనాఘనిబిడారవభైరవహుంకృతంబుతో
నుడుపథముం గులాచలము లుర్వరయుం గకుబంతసీమలున్
జడనుపడంగ నార్చుచుఁ బ్రచండగతిం గనుగ్రుడ్లు ద్రిప్పుచున్. 77

శా. కుప్పింతుం దటమానికోటి నెఱవేఁకు లూన ఘోరార్భటిన్
నొప్పింతుం దిగధీశకర్ణములు కన్నుం ద్రేపల న్నిప్పుకల్
రప్పింతు న్వినుఫీథిఁ గ్రాలుకొన ఘోలం బుద్ధతిం ద్రిప్పుచున్
విప్పింతుం జనధైర్యసంపద నృశీమాన్పోలాంగ్రహాగ్రంథినై. 78

క. ఈగతిఁ [1]దను వెఱపింపం, గా గాలవమౌని యపుడు కన్నుఁదెఱచి మా
యాగౌరవాధిగతర, క్షోగాత్రుని నను నెఱింగి క్రోధాన్వితుఁడై. 79

[2]మహాస్రగ్ధర. అధరం బల్లాడఁగా బిట్టవుడుగఱచి సాహంక్రియామర్షభాషా
బధిరాశాభాగుఁడై భ్రూభ్రమణపటునటజ్జ్వాలఘూర్ణంబు నిండన్
విధురస్వాంతంబుతో దృగ్విసరరుచి నభోవీథి రంజింపఁ జిత్తా
త్యధికాటోపంబునం బంతము వలుకుచు దుర్ధర్షవేషంబు మీఱన్. 80

1. చ - ట - కడు. 2. ట - లో లేదు.

శా. ఓరీ సంపదఁ గన్నుఁగానక నఘాయుక్తుండ వై వచ్చి మ
ద్వ్యారా యి ట్లధికింపఁ జెల్లునె దురాత్మా యంచుఁ గోపించి నీ
వీరూపంబు వహించి కాన జనతాహింసాది కృత్యంబులన్
నోరారం బోల మేసి త్రుళ్లు మని నన్నుం జూచి శాపించినన్. 81

క. గజగజ వడఁకుచు నే నా, రజనీచరవేష ముడిగి ప్రతిపతిపాదాం
బుజములపై వ్రాలి భయా, ర్తిజదీనాలాపగద్గదిక నిట్లంటిన్. 82

శా. చేతోవీథి భవన్మహామహిమముల్ చింతింపఁగా లేక యీ
రీతి న్నన్నును మిన్నుఁ గానక మదోద్రేకంబునం ద్రుళ్లితిన్
నాతప్పొక్కటి సైఁచి శాపవచనాంతంబుం గృపం దెల్పవే
యోతండ్రీ నను బ్రోవవే యనిన నాయోగీంద్రచంద్రుం డనున్. 83

శా. వత్సా మామకశాపవాక్యములు దుర్వారంబు లౌనైన నే
తత్సంరంభము మాని నీ [1]వడల నార్ద్రం బయ్యె నాచిత్త మీ
కుత్సాపాత్రతనూవియోగ మగు నీ కున్యాన్యదివ్యాపగా
భృత్సద్ధ్వాంతరసీమ నొక్కనిశరార్చిం గొంతకాలంబునన్. 84

క. అనుమాట లోను వెలి గా, ఘనగర్జాతర్జనాదికస్ఫురణవచో
ధ్వని సెలఁగ రక్కసుఁడ వై, చను దెంచితి నిటకు సకలజగములు బెగడన్.

ఉ. నాపిశితాశనత్వమును నాబహుపాతకహేతునిత్యహిం
సాపరతంత్రరోషపరుషత్వముఁ బాపితి వీక్షణంబునన్
భూపవతంస నీవలనఁ బూర్వ[2]శుభోన్నతి నొందఁ గాంచితిన్
నీపరమోపకారమహనీయతకేఁ బ్రతిసేయ నెట్టనే. 86

[3]క. ఐన నొకమే లొనర్తు మ, హీనాయక మాఱుపలుక కియ్యకొనుము ప్ర
జ్ఞానిధులు సత్క్రియాలవ, మేనియును బహూకరింప రే మది నెందున్. 87

చ. అతులితశౌర్య నీతలఁచినప్పుడు వచ్చి సమిజ్జయంబు ల
ద్భుతముగఁ గూర్తు నీయరదముం దటితోడయి వచ్చు నాయదృ
శ్యతయును గామరూపతయు సంధిలఁ జేయుదుఁ గొ మ్మటంచు నా
క్షితిపతి కిచ్చి యతఁ డరిగెం దదనుజ్ఞ నిధీశుఁ డీటికిన్. 88

శా. ఆసత్యాసుతుఁడుం బ్రియాప్తసహితుం డై యాత్తసౌత్రా[4]వి
న్యాసోచ్ఛ్వాసితరాశుసావయవయదూపాదితాత్యంతమై

1. ట - వలన. 2. చ - సుఖోన్నతి. 3. ట - లోఁ లేదు. 4. ట - విన్యాసోద్భాసిత.

శ్రీసంపత్తికి సంతసిల్లుచు సముద్వేలాజలీలాభవా
యాసం బోలఁగ నొక్కనిర్మలసరఃప్రాంతంబునం జూపుచున్. ౮౯

క. దరవికచసరసిజాంతర, పరిఖేలచ్చంచరీకపక్షచలితపు
ష్పరజోసితాంగశిఖిల, మరుత్కిశోరములు నీరద మ్ముడిఁగొనఁగన్. ౯౦

క. తలిరిచి దట్టముగై తత్, జ్జలజాకరశీతవాతసక్తిఁ బొడలి మొ
గ్గలఁబూవులఁబింపెలఁగా, యలఁబంపులఁవనరుతరుచయంబున నొకచోన్.

సీ. వాసంతికారసాస్వాదమత్తాంగి నైయు తెలిసినల్లభుఁ జేరు తేఁటి లేమఁ
బ్రియకోపంబునఁ బఱచి నాథుఁడు మ్రొక్కఁ గేరడంబులు వల్కు కీరతరుణి
నన్యానుషంగచిహ్నము తెల్లఁ బరికించి వరుని దూఱెడుఁగోరువంకజోటిఁ
దమి దోలంకఁగ సాము గమిచినచిగురాకుఁ జెలువునకిచ్చుకోయిల వెలందిఁ
గనుఁగొనుచు వచ్చి యొకదివ్యకాంతియుతవు
యూరయుగళంబుఁ గని పట్టనూహసేసి
తనుసరణపరాయణత్వమున వార
లాశ్లేషమును గణింప కరిగి రపుడు. ౯౨

క. అందు మానిసుతుఁడు పులుఁగుబ, డిం దప్పక యరిగె యది వడిం బఱవ నిరా
సందుఁ డయి తిరిగి తప్పక, వింద దమ్ముసిఁ గాన లేక వెదకుచు నార్తిన్. ౯౩

ఉ. అక్కట యిక్కఁ జెల్పు నుచుబా మనుజాగమువర్జితోర్వి నే
నిక్కడ నొంటి నైనఁగలనే కలనేనియుఁ బాయలేని నీ
వెక్కడ క్రూరసత్త్వదగవే తగ వేమఱుఁ బల్కరించు నన్
మక్కువ తొంగలింపఁ గనుమా కనుమాయలు పెట్ట నేటికిన్. ౯౪

గీ. అనుచు విపినవీథి [1]సరిగెడుగంధాంధ, కరులఁ గిరులఁ బేచకములఁ గీచ
కములఁ జటులఁ గిటుల ఘనదైన్యఘటితితో, ననుజుమార్గ మడిగి యడిగి యలసి.

చ. యతిపతిప ల్కులంఘన్య మని యాత్మ నెఱింగి నిజాంతరంగసం
గతధృతి నైయు యదూద్వహుఁడు కానన వాటము దాఁటి యధ్వగ
ప్రతతుల వెంట నేగి పరపట్టనగర్వవిఖండనంబు దృ
ప్యత్తుకదసౌధమండనముఁ గుండినముం గనియొం బ్రియంబునన్. ౯౬

మ. కని తత్పట్టనకేళికాననలతాగారైకవాస్తవ్య భో
గన్నపావత్స్వవిపంచికాభిసపళీతానోర్దతుల్ విశ్వరం

1. ట - సహరెడు.

జనగీతామృతతోషితద్విరదరాట్చర్మాంబరుం దుంబురున్
వినయప్రౌఢిమఁ జేరఁబోయి సతి గావించెం బ్రమోదంబునన్. 97

చ. అపు డమరేంద్రగాయనుఁ డనన్యజనోదరభాసనూచనా
నిపుణతనూవిలాసు నతనిం గని మెచ్చటనుండి వచ్చి తే
నృపతనయుండ వేమికత మిచ్చటికిం జనుదేర నంచు న
త్కృప నడుగ న్యదూద్వహుఁడు దీపితసూనృతసూక్తి నిట్లనున్. 98

సీ. కరగతచక్రుండు హరిబలాన్వితుఁడు సన్నహితవిక్రముఁడు మానసౌకసుండు
ప్రాణేశకలితనురాగసంస్తుత్యసత్యాఖ్యాతగోత్ర నాయనుఁగుజనని
శరసధర్మధురీణుఁ డురుసుమనోమార్గణావలంబనుఁడు నాయగ్రజన్ముఁ
డక్రూరనుగుణోద్ధవాధారశూరసంతానశేఖరులు సుప్రియగుజనులు
పొదలురాలచ్చి యెపుడు మాయదుకులమున
మాకురత్నాకరంపురోత్తమము నివాస
మట్టినే నీకు నిచట శిష్యత వహించి
వీణ నేర్వంగ వచ్చితి విమలచరిత. 99

గీ. అనుచుఁ జతురోక్తిఁ దెలిపినవినితదీయ, నృత్తసాంబసమునకు నెఱిఁగి తుంబు
రుం డతని గారవించి యాజానుదీర్ఘబాహు, నృపతనూభవుతో వీణ నేర్పుచుండె.

ఉ. అంత దిగంతదంతురలతాంతనితాంతనితాంతకాంతస
న్నాంతికతాంతపాంథజనతాంతరసంతతకృంతనస్పృహా
త్యంతనమంతతస్ఫురదుదంతవసంతపకాంతిసంగతి
క్రాంతదురంతకుంతరతికాంతము పొల్చె వసంతమంతటన్. 101

[1]క. వనలక్ష్మి మాధవాగతి, కనుప్పగఁ బూనీట జలకమాడుటకై ముం
దనువున నలుఁగిడఁగా ను, ర్లినచిక్కన మునఁగ ధరఁ దొరఁగెఁ గారాకుల్.

ఉ. పూని వసంతహాళికుఁడు పొంగెడురాగరసంబుచేఁ గడు
న్మానుజనాళిమానసపుసట్టులు దున్ని మనోజకందళిం
గానఁగఁ జేసి యంత నెగఁగట్టినయట్టిహాలంబులో యనం
గా నెజసెం బలాశకళికల్ మునుమున్న వనాంతరంబులన్. 103

క. ఎలఁదీవెచెలులు వలిగ్రా, ష్పులపైఁ దేసియుపసంతములు చల్లఁగఁ ద్రే
తులఁ బూనినవేత్రపుఁ ది, త్తులు నాఁ దలిరాకుపొనలఁ దోఁచె న్మొగ్గల్. 104

1. ఉ - తోతీదగ

ఉ. ఆలమునన్ దిశ ల్గెలిచి యాడఁగఁ బోవ వియుక్తరక్తముల్
హాళి ననంటిపూవుపెర లన్బలుదోనెల నించి చిల్కలే
జీలకుఁ జూపఁబోలు ననసింగిణిజో దిటు గాక యున్నచో
నేల వహించుఁ గెంపుజిగి నీకదళీసుమకీరతుండముల్. 10౫

ఉ. మావుల మారు క్రొంజిలుకమావుల వేడెము దిద్ద గందపుం
దావులగాడ్పుసాహిణి లతాకళి పూని మిళిందయుక్త వా
లేవిరిగుత్తిగిల్కఁ గదలించుచు థే యని కూఁతవైచె నా
నావిధపల్లవాశనకనత్కలకంఠకుహూరవాగ్భటిన్. 10౬

సీ. శాపనివృత్తికై చనుదెంచు వెడవేల్పురాచత్రాఁ చన భృంగరాజి తనర
సంగడి శాస్త్రము ల్చదివెడుశిష్యుల చెలువునఁ గెలయుకోవెలలు సెలఁగ
విన్నందుటకు మనవికి డాయువింధ్యశృంగములు నాఁ బుష్పొడిగట్టు లెసఁగఁ
గట్టినకావికోకలచెఱంగులరీతి నెడనెడఁ దలిరాకు లెగసియాడ
నెలమిఁ దనుఁ గన్నద్విజపంక్తు లెదురుకొనఁగ
సారెఁ బెల్లుబ్బుయువజనశ్రమజలాబ్ధి
నిమునుకొన దక్షిణము వాసి యేగుదెంచెఁ
గోదలునడతోడఁ బవమానకుంభజుండు. 10౭

[1]ఉ. అంతట రుక్మబాహువసుధాధిపనందన యొక్కనాఁడు శు
ద్ధాంతగృహంబు వెల్వడి విహార[2]రతింజనుదెంచె నెచ్చెలుల్
చెంతలఁ గొల్వ గుంజదళిశింజితరంజితకుంజమంజుల
ప్రాంతగళత్ఫలాసవరతాంగజఘోటికిఁ బుష్పవాటికిన్. 10౮

క. ఏతెంచి చందనాచల, శీతలతనుగంధవహావశీకృతలవలీ
చూతైలావాసంతీ, జాతామోదములఁ దేలి సంతస మందెన్. 10౯

సీ.[3]కమ్మనిపూనీటికాల్వ ప్రీలినచోటఁ గంబూరమున నంటఁ గట్టికట్టి
వలపుతోఁ గురువేరు వాడువాఱినచోటఁ బూనీరు కుండలఁ బోసిపోసి
చలిమావిరసముల జౌకులెత్తినచోటఁ గలువపుప్పొడినించి బలసిబలసి
పరువంపుమరువంబు పదను దప్పినచోట వలిమంచు గూడల వైచివైచి
సుమములకు మూఁగు తేఁటులఁ జోపిచోపి
యారముల రాలుతనిపండు లేఱియేఱి

1. ఈపద్యము ఆంధ్రకవుల చరిత్రములో ఏలకూచి బాలసరస్వతి గ్రంథములోని దని యున్నది. 2 చ - గతిన్. 3. పన్నీటి కాలువ పఙ్ఞఁబాఱ్లినచోట గరబూరమునసన్ఙరట్లఁగట్టి.

గ్రక్కుపాటున రాజన్యకన్యఁ గాంచి
యపుడు వనపాలికలు రయవ్యగ్ర లగుచు. 110

క. ఒండొకతె మీఱి నృపసుత, దండకు నేతెంచి మట్టిసమ్ములు విరిపూ
దండలుఁ గమ్మనిగొజ్జఁగి, చెండులుఁ గైకానికిచ్చి చేరి ప్రహృష్టన్. 111

చ. అచట విలాసభూధరము లచ్చటఁ గ్రొన్నెలఱాలతిన్నె ల
ల్లచటఁ బరాగసైకతము లచ్చటఁ దేసియయేటిసీటిజా
లచటఁ బయోరుహాకరము లచ్చటఁ బూచినకన్నెమావు ల
ల్లచట లతాకృతాలయము లంచుఁ గరంబులఁ జూప వారిలోన్. 112

సీ. విందులు గైకొన్న యిందిందిరమ్ములు వాసంతికాప్రసూనాసవముల
దోమటి దొడుకునే ప్రేమఁ గోకిలములు పాటలసహకారపల్లవముల
బున్నెంబు గుడుచునే ప్రోదిరాచిలుకలు పరిపక్వదాడిమీఫలరసములఁ
బొ త్తారగించునే మత్తఖంజనములు చంపకప్రసవజసౌరభముల
సామెతలు సేయునే శారికాన్వయములు
గోస్తనీవల్లికా[1] ఫలగుచ్ఛకముల
నలరువలపులు గాంచునే తలిరుఁబోడులు
మలయగిరికందరాయాతమారుతముల. 113

చ. అనుచు లతాంగి పూవుఁబోఁడ లారసి పుష్పితపున్నలక్క. నం
దనవమరందవాహినుల దాఁటి సరిస్ఫటికసీమ మట్టి పూ
చినయెలమావిజొంపములఁ జేరి [2]మెలంగుచు నంతఁ జెంగటం
గనుఁగొనియె న్లవంగలతికాపరికల్పితకాయమానమున్. 114

క. కాంచి యచటం దటీయను, మాంచలసంచరణచంచదళిగానకళా
పంచనచుంచువిపంచీ, పంచమనాదంబు చెవులపండువు సేయన్. 115

[3]మ. ఇది నాయన్నవిపంచినాద మగుఁజుమ్మీ నచ్చటి యాలతా
సదనంబు ల్ప్రతినాద మానఁదొడఁగెం జెచ్చెంతే నంచు ను
న్నదకాదంబరవానుకారివిచలన్మంజీరశింజానితం
బొనవం జేరి సహోదరుం గనియె నత్యుత్కంఠ సేవింపఁగన్. 116

క. సోనలుగాఁ గమ్మనిపూఁ, దేనియతుంపురులు చల్లుతీవలలో న
వ్యానవతి నిలిచి యన్నన్, గానరతుం గాంచి తదుపకంఠస్థితిన్. 117

1. ట - స్వచ్ఛ. 2. న - తొలంగుచు. 3. ట - లో నసు.

సీ. మేరుసంగతి గేయసారవాహిని మూఁడు తెగలా యెననఁగఁ దంత్రికలు మెఱయ
స్వరదేవతారోహసమునరోహణక్షోణిఁ గట్టు మెట్టికలు నా మెట్టు లమరఁ
గరివె ఫణంబుగా గానలోలత డాయుచిలువరా జన వెండియొళవు మీఱ
శ్రుతితంత్రికాబిసాహ్యాతికి నే తెంచినకవజక్కవలు నాఁగఁ గాయ లోలయఁ
దనరువీణియఁ జేఁ బూని తంత్రి దీటి
భిరడలు బిగించి శ్రుతిఁ గూర్చి కరివె నివిరి
జాఱుగా మీటి సారెలు చక్కనొత్తి
సారెఁ బలికించు సత్యాకుమారుఁ గనియె. 118

క. కనుఱెప్ప లిడక యతనిం, గనుఁగొనియుం దనివిచనక కామిని యన్నం
గను నెపమునఁ బొద వెలువడి, [1]చని నిలిచె న్నొగులు వాయు చంద్రకళ యనన్.

శా. ఆవేళం దురఱెప్పల న్నిలిచి [2]నేత్రాంతత్రిభాగంబులన్
డావై చెక్కుల జాఱి కర్ణవిచలత్తాటంకహీరప్రభన్
దీవ ల్సాఁగుచు నొయ్య రాకొనురుపై నిండారె రాజన్యక
న్యావీక్షాంకురముల్ స్మరప్రథనముక్తాస్త్రప్రతానం బనన్. 120

గీ. పూపగుబ్బెతఁ గన సిగ్గు పొదలుచుండ
రాచకూఁతురు గాన సంకోచ మడర
నన్నసన్నిధి నున్కి భయంబు నిగుడఁ
గలికి కనుఁగొనఁ దలఁచు లోనులుకు నళుకు. 121

క. వనజాస్యకు మై నిండ, న్ననుపారెం బులక లపుడు నిఖిలాంగములం
గనుఁగవ సాటికిఁ దారుం, గనఁగఁ గటాక్షాంకురములు గ్రమ్మించె ననన్.

[3]క. తమినేత్రచకోరకయు, గ్మము నరపతివదనచంద్రికల నఱు మ్రోవం
గమిచి యెనఁ బట్టుచాలము, నుమిసెనో యన నశ్రుబిందులాలి కెం జెలికిన్.

ఉ. తత్తఱపాటుతోడఁ గనుఁదమ్ములడాలు దిగంతరంబులం
జిత్తరు నింప లేఁ జెమటఁ జేల కుచంబులపొంత జాఱ నా
బిత్తరి మ్రానుపాటొదవఁ బిమ్మిటిఁ దా నొకకొంత గొంకి లోఁ
జిత్తము మట్టుపెట్టికొని చేరి సహోదరుదండ నిల్వఁగన్. 124

ఉ. అప్పుడు తేమపాదకటకారవము ల్నిజవల్లకీరుతిం
దప్పులు సూప వింతనినదం బిది యెక్కడిదంచు నెల్లెడం

---

1. చ - చనియె జ్జలదంబుఁ బాయు శశికళ యనఁగన్. 2. ట - నేత్రాంచద్ద్విభాగంబునన్.
3. ట - లోలేదు.

దప్పక చూచి కన్గొనియె దానవమానవిఘాతిసూతి యా
కప్పురగంధిఁ గంజముఖిఁ గాంతిమతిం గలకంఠిఁ గామినిన్. 126

కం. అంతటఁ గాంతావిటా, తాంతాత్ముని నతనిఁ దనదుదాయాది పగం
బంతంబునఁ గంతుఁడు విరి, కుంతంబులపాలు సేసి కో యని యార్చెన్.

కం. గొబ్బునఁ బొడమినతమి యా, గుబ్బలు ఢీకొనఁగ రాచకొమరుఁ డపుడు లో
నబ్బురపడి యాచిటిపొటి, గుబ్బెతఁ గని చొక్కి వింతకోర్కులు నిగుడన్.

సీ. [1]బిరడలుబిగియించుకరణి నెమ్మొగ మెత్తి చొక్కుతోఁ గ్రీఁగంటఁ జూచిచూచి
శ్రుతివిపాటియాలకించుతెఱంగుతో ముద్దుపదరుమాటకుఁ జెవిఁ దార్చి, తార్చి
ఛాలు నల్కిన మెచ్చులీల సాహసమునకు నుడివో నితమ్మిఁ దల యూఁచియూఁచి
యలసతచే నూరుపులు వుచ్చుతీరునఁ గ్రొమ్మించు మేతావిఁ గ్రోలిక్రోలి
నిలువరింపఁగ రానిక్రొందలిరుఫాలు
తళుకులకుఁ జెందమునఁ జాలఁ దలఁకియుఁ బ్రియ
సఖుఁడు చెంగట నున్కి నిశ్చలుని రీతిఁ
గొంత సైరించి [2]యాయమకుంజరుండు. 128

కం. తనవీణఁ బ్రతిఫలించిన, వనజాననఁ జూచి సౌఖ్యవారిధిలోఁ దే
ప్పునఁ దేలి యాత్మగతమున, నొనరించె న్వినుతిఁ జిత్త ముప్పొంగారన్ 129

ఉ. పొలఁతుక వేణి కుల్కి నిశ పువ్వులవేరిటి చుక్కపోఁజులం
జలదము వొలిఁ జందిరపుఁజంచల నెప్పుడు గొల్చునట్లుగా
నిలుపుటఁ జేసి చామరము నిచ్చలు తానె భజించె నన్నియుం
[3]దెలిసియు కాదె సారెకు నుతించు నజుం డసమున ప్రశంసకృతిన్. 130

ఉ. నలినభవుండు కన్నియ నొనర్పఁగఁ జిక్కినమించు లీక్షణం
బుల నిడి పుండరీకదళములు వయి నుంచి ఘటింపఁ దారకా
చ్ఛవిముల లక్ష్ముర లనిశంబుఁ దనర్చునె కాకయున్నఁ జా
పల మిన్కషేనఁ దెల్పు కనుపాపలపేరిటి యొత్తుబొమ్మలన్. 131

కం. శ్రీనఖాశ్రీ లింపలకం, గనయుతమిన్ సుముఖవిధుఁడు కాంతనిరీక్షా
ఘనళరుచికరము లంతయు, నవిరళగతిఁ జాఁపఁగా వసంతస్ఫూర్తిన్. 132

ఉ. జలజదళాక్షినాస నవచంపక మౌ నటుగాక యున్నఁ జెం
తల నెలకొన్నచాపునయనభ్రమరద్వితయంబు చాల న

1. ట - క్రోలేను. 2. చ - యూపన. 3. చ - దెలియుటు.

ర్గల మగుకాఠరత్వమునఁ గ్రమ్మఱి కోనులకర్ణపాళికా
కలితవతంసపద్మనవగంధవిశేషము లానఁ[1] బోవునే. 133

జగములు గెల్వఁగోరి సుమసాయకుఁ డెత్తుపసిండిటెక్కెముల్
మగువకపోలయుగ్మ మనుమానము లే దటుగాక యున్నచో
నగణితకర్ణకుండలసమగ్రమణిప్రతిబింబదర్పణం
బగుచుఁ జెలంగునే మకరికాంకిత మై చెలువంబు సూపునే. 134

కమలసూతి సుధాకరుకందుఁ గడపి, బింబమున దీనిమోముఁ గల్పింప నయ్యె
నలికమగ్రంబు పార్శ్వముల్ తళుకుఁ జెక్కు, లందుబింబాధరంబు బింబాధరంబు,
మంజుభాషిణికంఠసామ్యము[2] వహింప, నబ్జ ముత్తెనుసుమనోర్ధ్వ నయ్యెఁగాక
వార్ధిజాతసజాతీయవస్తు లుండ, నాదరము గాంచు టెట్లు తదాదరంబు. 136

మధుపసంగతవిటపసమాజములును, బల్లవాశ్లిష్టవల్లికాపాళికలును
నవతువచ్చునె యీసతిసకలభువన, వర్ణనీయభుజాకల్పవల్లరులకు. 137

మును పాకకృష్ణమూర్తి ఘనము ల్గురియన్ గిరి నెత్తి గోవ
ర్ధన మొనరింప నత్తెఱఁగు ధా నది చిత్రమె యుంచుఁ గొమ్మయా
రని యెడుకృష్ణమూర్తి మదనాశుగవృష్టిఁ దనర్ప గోవ
ర్ధన మొనరించెఁ దత్కుచధరాధరయుగ్మము నుబ్బ నెత్తుచున్. 138

సరసవయో[3]విభాతమున సారసగంధిగభీరనాభి తా
మరసకుటీరము న్వెడలు మంజులరోమలతాళిరాజి బం
ధురతరపక్షవాయువుల నూత్నతదీయపరాగమాలికల్
వరుసనె రాలి రేక లగు వైఖరిఁ బొల్చు వళీవిభంగముల్. 139

సుప్రతీకోత్తమాంగ మీనుదతిపిఱుఁదు, గాకయున్న రత్నాకరకాంచికాప్ర
యుక్తిఁ గనునేని తాంతన్మత్తోరుసుకర, కాంతిసవపుష్కరస్ఫూర్తిఁ గడలుకొనునె.
కలమగర్భంబు లబలజంఘల జయింప, మల్లెఁబడి నిక్కి కడపటఁ బొల్లువోయి
తాలిపడిశాతికంటకాక్రాంతి విరిసెఁ, బరఁగు నెవి వేకమిల జనప్రస్తుతులకు.

[5]తామేటి వెన్ను తీవి స, తిమణిప్రపదములు దనరె దివ్యోరుదిశా
సామజకరోపరికటీ, భూమండలి యందు మీఁదఁ బొలుపగు కతనన్. 1

ప్రమదపదంబులం దొరయఁ బంకజముల్ వనమధ్యసీమఁ జ
క్రములకు నింపుగాఁ దపముఁ గాంచుతఱి న్మధుపాళితోడఁ బా

---

1. ఝ - శోభునే. 2. ట - వహించి, రాష్ట్ర. 3. చ - విహాసమున, ట - విభాగమున.
4. ట - లోలేమ. 5. తాబేల వెన్నువిటిచి.

యమి మలినత్వ మందియును హంసకసంగతిచేతఁ బాదసా
మ్యముఁ గని మించె నేరి కమలాత్ములసంగతి చిత్రమోపునే. 143
గీ. అలరె వారిజనేత్రాపదాంగుళీన, ఖాళి యౌవనవనసీమ నడరునవ్య
విద్రుమలతాగ్రకోరకవితతి నాఁగ, నగ్రలాక్షారసంబు సుమాసమునఁగ. 144
క. అనుమాన మేల నిజ మిా, ననఁబోఁడిమె రుక్మబాహునందన యలనా
వినుకలియునుగనుకలియును, మనమునఁ[1]దలపోయ నైకమత్యముఁగాంచెన్.
మ. అనుచో నాలలితాంగి నొక్కచెలి డాయన్వచ్చి యోనెచ్చెలీ
వనవాసంతికకు న్రసాలమునకు న్వైవాహికప్రక్రమం
బొనరింపం జనుదెమ్ము వేగ యన నమ్మోగ్యాద్ధైవ మిాపాటిమే
లును సైరింపఁగఁ జాలవంచు నుది నాలోలత్వముం జెందుచున్. 146
క. ఆపడఁతి యప్పు డఅవిరి, తూపులచే డీలుపడుట తోఁబుట్టునకున్
దీపింపకుండఁ జని పు, ష్పాపచయాసక్తిపై మనోంబుజ మడరన్. 147
సీ. కైలాగు జతన మిాకలువరాచలువరాల్ జీరుకుల్ వారు [2]రాజీవనయన
పాదావధాన మిాపరువంపుమొసంపుఁ గనిమలదాఁటుచోఁ గంబుకంఠి
[3]మేలుప్పరంబుత్తుమ్మెదమందరోద మందటిలుపొదల్ దూఱుచోఁగలువకంటి
చిత్తేశు చూడు మిాచిన్నారిపొన్నారి కేకినీలాస్యము లీక్షరవాణి [డుచు
యనుచుఁదనప్రాణసఖులు నెయ్యంబుమిాఱ, నెచ్చరికఁదెల్పనిచ్చలోఁజిచ్చన
వెచ్చనూర్పు చుఁగలఁగుచు విన్ననగుచు, రామవిహరించెఁబుష్పితారామసీమ.
[4]మ. అరుణాంఘ్రిద్యుతిసారసీకృతసుధీహార్యక్షు హార్యక్షుదో
ర్ధరణార్థాకృతితాభృతామరకదంబాధ్యక్షు బాధ్యక్షమా
హరణాస్తోకహృషీకచోరకనిరాసారక్షు సారక్షమా
శరకోటీపరిపాటితాంతరరిరంసల్లక్షు సల్లక్షణా. 149
క. సంసారదూరసరణరి, రంసాధిగతప్రశంసరాగహరిణవై
తంసికసంసన్మానస, హంస మహోహంస పరమహంసవతంసా. 150
స్రగ్విణి. ధ్యానకృత్సేవధీ దంభవిద్యావధీ, దానలక్ష్మీనిధీ దాంతహృత్సన్నిధీ
మానభూషావిధీ మంజుభాషానిధీ, జ్ఞానసంమోదధీ సత్త్వసామోదధీ. 151

గద్యము.—ఇది శ్రీమద్దత్తాత్రేయయోగీంద్రచంద్రచరణారవిందవందనసమాసాది
తసరసకవితారసోదాత్త దత్తనామాత్యసోదర్య మల్లనమంత్రివర్య ప్రణీతం
బైనచంద్రభానుచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

1. చ - ట - వివరింప. 2. రాజీవగంధి. 3. ట - మేలుప్పరంభీరసాలరసాలంబు పొదరిండ్లు దూఱుచో. 4. ట-లోఁ లేదు.

ఉ. ఈయెల నాఁగు లేమ పదమూనినమాత్ర నవీనరాగల
క్ష్మీయుతమై ముదశ్రువులు సీధుకణంబులపేరఁ జిల్కుచుం
బాయక భృంగగీతిఁ దనభాగ్యము మెచ్చుకొనం దొడంగెఁ బ
ద్మాయతనేత్ర చూడు మిది యద్భ్రమ కాదె యశోకసంజ్ఞకున్.

చ. ముదిత యొకర్తు తేఁట్లు తను మూఁగిన నెచ్చెలిఁ [1]గాన కార్తయై
కుమరుమెఱుంగునిబ్బరపుగుబ్బలనొత్తినఁ దత్స్వయంగ్రహా
శ్లిష్ట్యాదితరసానుభూతిఁ జెలువొందుచుఁ గ్రోవి తదాప్తిహేతుప
ట్పదతతి కిచ్చె మెచ్చి నిజబంధురగంధరజోవిశేషముల్.

ఉ. సామజయాన యీచిఱుతసంపఁగిసొం పరుదయ్యె నంచుఁ నా
లీమణి మెచ్చరింప నొకలేమ ముఖాంబుజ మెత్తి చూడఁగా
నామహిజంబు పూనె సుమనోఽధికరాగసమృద్ధిఁ గాన నె
చ్చోచ్చుమహీతాళిసంగ్రహణశూన్యుల కిట్టి తెఱంగు చోద్యమే.

చ. రమణి యొకర్తు నవ్వుచు మరందముఁ బుక్కిట నించి బోటిపై
నుమియఁగ నేగె నమ్మగువ యొండొకచెంతకుఁ బోక కేసర
ద్రుమము మఱుంగుఁ జేరె నది తోడన తన్ముఖసీధుసిక్తమై
యుమియక మాననే యభినవోపగతప్రసవాసవంబులన్.

చ. వనిత యొకర్తు కేళివనవాటి గతాగతఖిన్నయై కరం
బునుపఁగఁ దత్కరగ్రహమహోజ్జ్వలమై ముదితద్విజావళీ
ఘననినదంబు మీఱ [2]సహకారశిరోమణి వేల్చెఁ గంటె నూ
తనకిసలానలంబున నుదారమరుచ్చ్యుతసూనలాజముల్.

ఉ. ఏలకితీవయుయ్యెలపయిం జెలి[3]యూఁగ నొకర్తు లీలతో
నాలతి సేయఁగా విని ప్రియాళిము పూవులవాన నించి యు
న్మీలిత సీధుబాష్పమయి మెచ్చులఁ దేలఁ దదగ్రసీమ మ
త్తాళియుఁ బాడెడు న్వను మదాంధులచెయ్వులు హాసయోగ్యముల్.

చ. అసదృశధీరతాధికమదాప్తి సుదృజ్ఞణు లిద్ద ఱుల్లస
ద్రసకళికోపలబ్ధికయి రాయుచుఁ బల్క సమీరణోన్నమ
[4]త్ప్రసవితశాఖికాంచలకరంబున వాద మడంచె గోఁగు పె
క్కసమగు జంతువైఁ దురె[5]యుగంధసువర్ణసమగ్రతానిధుల్.

---

1. ట - గూఢకొర్త. 2. చ - ఘనసార. 3. చ - సూఁచుచునొర్తు. 4. ట - త్రో
సిశాఖికాంచల. 5. ట - సుగంధ.

చ. చలువలుచల్లునీడల నిజశ్రమ మార్చిన మెచ్చి చూచుతో
య్యాలి నలరించె వెండియు శుకాలపనాలఘులాలనోక్తిసం
కలనముతో మనోజ్ఞతిలకంబు మృదుచ్ఛదవీజనంబులన్
లలితమరంద సేచనములన్ ఘనసారపరాగచర్చలన్. 16

ఉ. కేకిసకొట్టి యోర్తు గిలిగించిన నొక్కవిలోలనేత్ర లీ
[1]లాకలకంఠకూజితముల న్నగఁ జెంగట నున్నపొన్న లీ
లాకలకంఠకూజితముల న్నగుచు న్మనమనోవిజృంభితా
నేకవిలాసము ల్దెలిపె నిట్టివివో పురుషానుభావముల్. 17

ఉ. సారెకుఁ బూల కోర్తు తను సన్నలఁ దిట్ట నొకింత వుచ్చని
ట్టూరుపు ధూపము ల్శుకపికోత్కరనాదము పంబ్రమోఁతయుం
గా రతిరాజు సేర నవగంధవహాకులసిందువారశా
ఖారుచిరాక్షి లోలదళికైశికయై సివమాడెఁ గంటివే. 18

క. అని పలికి కురులు బిగియం, బనుపఱిచి చెఱంగుఁ జెక్కి పయ్యెద లోడిగా
నొనరిచి యొండొరు మీఱన్, వనజాక్షులు కుసుమహరణవాంఛాపర లై.

సీ. కొమ్మ యొక్కతె చేరి కొమ్మ వంచినఁ గోసె నలరుఁ గ్రొన్ననలొక్కయలరుఁబోఁడి
కలికి యొక్కతె తేఁటి కళికి గొందులు దూఱ నతివర్ణ్యగతి నవ్వె నతివ యోర్తు
బాల యొక్కతె పూవుఁబాళకై గీలించి యాన నొక్కతె దాని నానయిడియె
ముదితయై మొగడలుముదితయొక్కతె రాల్పఁ జెలువందఁగాఁ నేఱెఁ జెలువయోర్తు
వెలఁదిగురివెంతపొద లొక్కవెలఁదిసూప, రామణీయకనిధి యొక్కరామపఱచె
నిట్లు వనకేళిఁ దేలుచు నిందుముఖులు, సరసవాచావిలాసంబు నెరపువేడ్క.

రగడ. నెలఁత [2]నెమ్మి నెమ్మిఁజూపె నీకు నీకుజాళినీడ
నలయకమ్మ కమ్మఁదావి నలరు నలరుబంతులాడఁ
గలయ నీడ నీడగాదు కదలి కదలికడకు రమ్ము
వెలఁది నన్ను నన్నువిరులు వేఁడి వేఁడిమాటచిమ్ము
వనిత రాదు రా దువాళి వలదు వల దుపవనసీమ
ననలు గోర గోరఁ జీర నాన నానవెట్టె లేమ
తమ్మికంటి కంటిఁ బొదలఁ దారుదారుచుండ ముందు
కొమ్మ మావి మావిననలు గోయకోయుటంచు నిందు

---

1. చ - ట - లలోనీపాదమేలేదు. 2. చ - ట - నెమ్మినెమ్మిఁజూపెనీకు నీకుజాలినీడ.

కోలఁది గాదు గా దురాశ కొమ్మ కొమ్మనంచు జోకఁ,
గలఁకఁదిట్ట దిట్టవైతి కన్నె కన్నెఱుంగ లేక
రమణి ననకు ననకుఁ జేర రాఁగ ఱాఁగనగుచుఁ జేడి
నమరు తావి తావిదా గయాళి యాళి గోల్లలాడి
ముదిత మూలమూలఁ జాల ముడువు ముడువువగల పూలఁ
బదరనేల నే లతాంగి పట్టుపట్టు జీనువాలఁ
గనిరి లలన లలనవామ్రుకలిక కలికచల్గడంగఁ
గనలు కలికి కలికితేల కావికావికనఁ గడంగఁ
గోఱలి వీడవీడనేల గుట్టుగుట్టు నలులమొనల
నెఱయ నింపునింపు నిచట నెలఁత నెలఁత తళుకునసలు
అతివ వట్టి వట్టివేరు నాడనాడ వ్వైచె చేల,
సతులతరమె తరమెఱుంగ సరస సరసముడిగి బాల
సావి నిక్క నిక్కగాదు చాలుఁ జాలు [1]దఱుగుపళులు
తావిదండ దండమాకుఁ దమకతమకమూనుపళులు
క్రోవులేమి లేమిఁజెలులు గుంద గుందరదనయులుకఁ
ద్రోవగట్టు గట్టుచాయ తోఁపుతోఁపుముక్కుచిలుక
నంగమలయ మలయపవనే మానిమానిని వడదేరెఁ
జెంగునీకు నీకు ముద్దుచిలుకఁ జిలుకఁబిలువునారె
కింక మాను మానుషంబు గెంట గెంటసంబులేల
కొంక కేల కేలఁబూని కొంజు కొంజు పూవుఁబాల
జగడ మొల్లమొల్లకెట్టు చనవు చనవు బలిమితోన
నగిన మేల మేల యని పెనంగ నంగభవుని తూన. 21

జలకేళీవర్ణనము.

క. అని చెలులు సుమాపచయం, బొనరించి మరందకణము లొలి[illegible]
యనఁ దనువుల నునుజెమటలు, చినుకఁగ జలకేళిసక్తచిత్తాంబుజలై. 22
క. [2]వరసీధుమత్తమధుకర, దరశీర్ణనవీననళినదళమిళనకళా
చిరశీలితశరశీకర, భరశీతలసరసిఁ జఱిసి ప్రమదలు తమలోఁ గా. 23
క. గరువనిలాహతి సుమరజ, మిరుగడ రా నడుము భృంగ మెసఁగె న్నిరసిం
చిర దాల్చు కమ్మబంగరు, సరిపెణఁ దగు తేఁటితాళి చాడ్పున సుదతీ. 24

1. చ-వగదువళులు ట-దరుగుడితులు. 2. ట-లో నీ సందుపద్యములు లేవు.

చ. చిఱునునుఁజెందొవల్ చికిలిచంద్రికపై పఱపు, ల్పరాగముల్
పఱచినవ్రేఁడివ్రాఁతపలిపంబులు, పాయని జంటజక్కవల్
కులుచతలాఁపుబిల్లలుగఁ, గోమలి యిచ్చటఁ గానవయ్యె నె
[1]త్తెఱు లలరాజ[2]హంసవనితాతతి దూఁగెడుడోలలో యనన్. 25

క. [3]బలిసన్నద్వారేంద్రో, పలఫలకకవాట మనఁగఁ బరఁగె సరసి యా
స్థలు గందపట్టియలుగాఁ, జెలఁగు సరోజములు బిగువుచీలలు గాఁగన్. 26

క. అలిగన్ఛకుముదముకుళము, వలిజక్కవమేనుసోఁకి వడఁకుచు నంత
స్థ్వలసితతద్రుతినలరెన్, గొలంకుసిరిచంట నకిన కులికె ననంగన్. 27

క. సూసయుతనాళమానస, సూసం గ్రేంకార మొక్కహంస మొనర్చెన్
వాసిను లట రా జలఖగ, సేసలకెత్తఁగింప సఫరిసేసె ననంగన్. 28

చ. అని కొనియాడి కొన్నలు శయంబులఁ బూని సనర్థవాక్యముల్
సనుపఁ గొక లూర్చి [4]కరపావడ లంట బిగించి సొమ్ములో
న్యసన నడలించి యొండొరులయంసము లూఁతలు గొంచుఁ జొచ్చి రిం
పున సరసిన్ స్తనం దొఱలు పుచ్చిన కత్తులఁబోలి బిత్తరుల్. 29

గీ. చెలువ లప్పుడు నెలకొన్నసిగ్గుచేత, వక్షములఁ జేర్చిరి కరస్వస్తికముల
నగసి చనుజక్కవలఁగూడి యేగు ననుచుఁ, బదరి చనుజక్కవల నంటఁబట్టిరనఁగ.

ఉ. కొండొకపాయపుంగొమరుగుబ్బెత యొత్తు కొలంకు డిగ్గుచో
సందకు వచ్చినట్టి చెలియంసము చేతులఁబట్టి వ్రేలె లో
నిండిన భీతి నాస్థకళ నేర్పటకై నలరాచయొజ్జ కో
దండము వైచినాఁ దఱుటుదార్క్యనుకైనడి వేణి తూలఁగన్. 31

క. చెలువలు సరసీజలముల, నిలిచిన లోఁ గన్నుఁగవలనీడలు దోఁచెం
జలిచెక్కుఁ జంద్రునలక్కై, తలఁకుచు నడుగంటు నచటితమ్ములరీతిన్. 32

గీ. చెలులు కొందఱు తమమీఁద జలముఁ జల్ల
మగువ లొకకొంద ఱవి కేల మగుడ నాని
రల్పుజఘనాభిఘాతార్తి సరుగుదెంచు
సలిలములకిచ్చి రభయహస్తంబు లనఁగ.

చ. నెలఁత యొకర్తు నెమ్మొగముసీడ నవాంబుజమంచుఁ గైకొనం
దలఁచి కరంబుసాఁచుటయుఁ దత్కరముం బెఱతమ్మిరీతి నం

1. చ-తెరగలు. 2. ట-హంసకవితానము. 3. ఇదియుఁ బైదియుఁ టు-లో లేవు

4. క-క-పావడలు.

దలరిన నొండు రెం డగుట యద్భుత మం చొకప్రౌఢ నెచ్చెలిం
బిలిచి మెఱుంగఁబల్కె నది మేలమునం దనుఁ జేరి నవ్వఁగన్. 34

సీ. కల్లోలమున నన్నుఁ గదిసి యీఁదుటకు నోయుద్వేలకచజాల యోలయోల
నూటిఁగొమ్మూని నాసాటి ప్రేయుటకు నోయుల్లోలకరనాళ యోలయోల
చేపట్టి నావెంటఁ జేరి పట్టుటకు నోయుద్దామకటిసీమ యోలయోల
దగలేక నాతోడఁ దడవుగ్రుంకుటకు నోయుజ్జృంభకుచకుంభ యోలయోల
యోయువిద యిందు రాకున్న నోలయోల
యోచెలియ యూఱకుండిన నోలయోల
యోసకియ యెందుఁబోయిన నోలయోల
యనుచు నుద్దులు గూడి పోరాడి రప్పుడు. 35

చ. తరఁగల డాయుచున్ మొగడతమ్ములు గోయుచుఁ గేరి మిట్టుచుం
గరములు పట్టుచు న్మునిఁగి గ్రక్కునఁ దేలుచుఁ జాల సోలుచున్
దరులకుఁ జేరుచుం దఱుముచుం దల దూఱుచు నీట ఱువ్వుచున్
దొరకొని నవ్వుచుం జెలులు తోయవిహారనితాంతతాంత లై. 36

సీ. కరిహస్తసాదృశ్య మిరవుకొల్పుటఁ జేసి తొడ లాగ్రభావంబుతోఁ జలింపఁ
గదళీచ్ఛదౌపమ్య మొదవఁ జేయుటఁ జేసి నిలువుపుట నుదరము ల్చిక్కఁ బూన
హైమదర్పణసామ్యము లవరించుటఁ జేసి మెఱుఁగుఁ జెక్కులు కెంపు మిసిమిఁ బూన
జలద[1]సాధర్మ్యంబు నవదరించుటఁ జేసి విప్పుగొప్పులు పయోవృష్టి నెఱయ
హస్తికుంభోపమానంబు లగుటఁ జేసి
చన్నులు నఖాంకురాంకుశక్షతులఁ బెంపు
నంబుకేళిక చాలించి యలసగతుల
సరసి వెలువడి తత్తీరధరణి నిలిచి. 37.

చ. చలువలుగట్టి తొంటి సుమసౌరభము ల్వెలుచక్కఁ గ్రుస్సఁగా
నలకలు చిక్కు[2]వుచ్చి తడియార్చి కొప్పులు వెట్టి సుప్రవం
డలు గయిసేసి చాలమృగనాభి తనూలతలందుఁ బూసి సొ
మ్ములు ధరియించి లత్తుకలు మోవులఁ జేర్చి వయస్య లందఱున్. 38

క. [3]లీలావతి[4]జలవిహరణ, కేళీకృత్యంబు లెట్టి కేలకుఁ గలఁకం
జాలించి యుచితరచనలఁ, గూలంబున నున్నయట్టికుముదినితోడన్. 39

1. చ-సౌందర్యంబు. 2. చ-దీర్చి. 3. ట-లో నీపద్యము లేదు. 4. చ-విహారణలు.

## కుముదిన్యాదులు మన్మథపూజఁ గావించుట.

గీ. ఓలతాతన్వి యీవసంతోత్సవమునఁ
గోరి మదనుని బూజించు కువలయాక్షి
తనకు ననుకూలుఁడైనట్టి ధవునిఁ గాంచి
చెలఁగి మనుఁగాన మనము పూజింత మనుచు. 40

సీ. వలగొన్నగొజ్జంగియెలదీవెమగులన కసదుమొగ్గలు[1] పిల్లనసులుగాఁగ
గొప్పకప్రపనంటిగుమురుటుప్పరిగెకుఁ జెమలునాకులు కేతనములుగాఁగఁ
బ్రబలిననురపొన్నభవనేశ్వరమునకు సుమపాంసువులు వితానములుగాఁగఁ
బొదలినగురివెందపూఁబొదచవికెకు సమదభృంగములు ధూపములుగాఁగఁ
దనరు విరిదోఁటనగరిలోఁ దావిమావి, జగమజారంబునెడ ఘనసారవేది
కర్ణికాసింహపీఠిపైఁ గలువతేకు, పట్టుజముకాళ మనుసందఁ బఱచి యందు.

గీ. చిగురుపటమునఁ బూఁదేనె మొగడకణికఁ
గొలువుమెఱసిన మరు వ్రాసి కోపులందు
రతివసంతుల వ్రాసి తత్ప్రాంతసీమ
భ్రమరకీరపికాదుల వ్రాసి నిలిపి. 42

క. ద్రాక్షామధురాధర లు, య్యిక్షుశరాసుం బ్రసూనపంక్తిదళితఫా
లాక్షు నుచితోపచారవి, చక్షణలై పూజసల్పి రధికభక్తిన్. 43

ఉ. దండము నీకు సామిరచిత్రను దేశశరీర మోడ్పుఁ గో
లండజరాజగామిహృదయంగమవిక్రమ సంసనంబు దో
ర్దండయశస్సుమాశ్రయపితామహవక్త్ర జోహారు సూనకో
దండవిలాసవీక్షణవిధానధురీణసహస్రలోచనా. 44

ఉ. సాయుధుఁడై త్రిపుండ్రధరుఁడై నిటలాక్షుఁడు గాఢ్పసోఁకులం
బోరెడు నొండురెండు[2] పురము ల్దగనేయు టిదేమివింత యే
యేయెడ నేకపుంత్రముపహించి సమస్తజగత్ప్రపంచముల్
మాయఁగఁ జేయు నీయెదుట మన్మథ మానసతీభయంకరా. 45

గీ. చెలువమున నీకుఁ దమ్ముఁడై[3] చెలఁగువాని, ననఘవిక్రమహరిసూతి యైనవాని
గనుఁగవకుఁ జంద్రభానువైతనరువానిఁ, గుముదినికిభర్తఁగాఁ జేయుకుసుమవిశిఖ

క. అని ప్రార్థించుచుఁ గుముదినిఁ, గనుఁగొని మదనునికి నిసతి గావింపుమనన్
మనమున లజ్జయు నలఁతయుఁ, బెనఁగొన నాకరీతి మ్రొక్కి చిత్తరికలఁకన్.

---

1. చ - ట - పిల్లిపసలు. 2. ట - పురములవ్వగనేయు. 3. చ - ట - యాలరువాని.

## కుముదినీవిరహావర్ణనము.

చ. కలయఁగ మ్రోయుకోయిలల కాకలికాకలనాన మచ్చటన్
నిలిచి సహింపలేక బలునెవ్వగ నుల్లము తల్లడిల్లఁగా
నలసకటాక్షపాతములు నాళిజనంబులవంకఁ జూచుచున్
నిలయముఁ జేరి యేమియు[1] మనీషకు నింపమిఁ జింతఁ గుందుచున్. 48

చ. గోడఁగెడ్డుపావురాలరొదఁగూడి ప్రతిధ్వను లిచ్చు కెంపుటా
గోడిగెల ప్రేలుబంగరపుగూఁడులఁ బల్కెడుచిల్కచాలుచే
నడరు పసిండియోవరులయంత్రపుబొమ్మలు మీటు కిన్నెరల్
గడుసుతిఁ గూడి గమ్ముమనఁగాఁ దగు సౌధముఁ జేరి యచ్చటన్. 49

చ. చికిలిపసిండిచాయపని చిత్తరువన్నియు వెల్లువాచఁగా
నకినెలకోళ్లతోఁ దళుకుఁజాయల గుజ్జరినేఁతపట్టుతోఁ
తళుకగు నిండుచంద్రిక ఖురాళముతో హంసతూలిపాన్పుతోఁ
జకచకలీను కప్పురపుఁ[2] జప్పరమంచమున న్వసించుచున్. 50

సీ. పలుమాఱు రాచూలిఁ దలపోసి వెడివంపునిట్టూర్పుగాడ్పులు నిగుడఁజేయు
నిట్టూర్పుగాడ్పుల నిగుడఁజేసి మెఱుంగుకన్నుల బాష్పము గ్రమ్మఁజేయుఁ
గన్నులబాష్పము గ్రమ్మఁజేసి యనంతకంతురాజ్యం బేలఁ జింత సేయుఁ
గంతురాజ్యం బేలఁ జింత సేసి మనోంబుజమునఁ గోర్కులు కొనసాగఁజేయు
సరవిమైఁ గోరుకులు గొనసాగఁజేసి, కలయ వలవంతఁ సంతంతఁ గళవళించు
నిట్లు కుముదిని యానంగహేతిహాలహా, లార్చి సైరింపఁగాలేక యున్కలోన.

ఉ. ఆమెలమావియోవరుల నాసనమాధవికాలతాగృహా
చ్ఛాయల నాసితాభ్రకృతశయ్యల నాకమనీయదేవతా
నాయకరత్నకేళిసదనంబుల నా[3]విరిచప్పరంబులం
బాయక యాతనిం గదిసి భావజకేళి సుఖింపఁ గల్గునే. 52

సీ. పాదాబ్జముల తోట్రుపాటు నేమనవచ్చుఁ జెలిచె గొబ్బునఁ జెంతఁ జేరనీక
నినుపారఁ బాఱుకన్నీటి నేమనవచ్చు నొంచెఁ గన్నార వీక్షించనీక
వడఁకొందు మై పరవశత నేమనవచ్చుఁ గనలించెఁ బలుకులు వినఁగనీక
[4]యుజ్జగింపఁగరాని లజ్జ నేమనవచ్చు నడచెఁ గేలునుఁగేలు నంటనీక

---

1. ట - యునునింపులుగామిని. 2. క - మంచముపైనుపర్యస్తతిన్. 3. ట - వలి చప్పరంబులన్. 4. ట - బుజ్జగింపఁగరాని.

మనసెఱుంగని చెలియ నేమనఁగవచ్చుఁ, బలి చెమటికొంతతడవందునిలువనీక
యని తలంపఁగఁ జింతాలతాధిరూఢ, దర్పకదశాంకురమ్ములు దలముకొనియె.

చ. తనువున నిండి కాలుకొను[1] తాపముసోఁకు సహింపలేక జీ
వన మతిశైత్యకాంక్ష నిజవాసము వీడ్వడి కర్ణకూపళీ
లనసరసప్రఫుల్లకమలద్వితయంబున విశ్రమింప వే
గనటకువచ్చెనో యనఁగఁ గన్నులఁ బ్రాణము నిల్చె[2] లేమకున్. 54

శా. ఆలజ్జావతి [3]నంత నొక్కచెలి డాయ న్వచ్చి యాశ్చర్యదో
లాలీలాలసచిత్తయై యకట యేలా వచ్చె నీ[4]వంత యీ
నాళీకాయతనేత్ర కంచు మదిఁ జింతం జెంది తద్దీనదీ
నాలాపంబులచే లతాంతశరబాహాప్రాప్తి నూహించుచున్. 55

చ. అలకలు గూడదిద్ది సరు ల్లన చిక్కడలించి జాలుగా
నొలికెడు బాష్పము ల్తుడిచి యొయ్యనఁ బయ్యెదకొంగుఁ జేర్చి సొ
మ్ములు సవరించి ఘర్మజలము ల్దొలఁగం దడియొత్తి యొత్తి తొ
య్యలి నెదఁ జేర్చి చేర్చి కరుణాకులగద్గదనిస్వనంబునన్. 56

చ. చెలియ యిదేమి నేఁడు గడుఁ జిత్రము నీదు తెఱంగుఁ జూచినం
దలఁపఁగరాని బెట్టిదపుఁదాపము రూపము వింతకోపమున్
నెలకొనినట్లు తోఁచె నిది నిక్కము దక్కులు పల్కనేల నీ
కలఁకకు నొందు కారణముఁ గానముగా మదిఁ జింతసేసినన్. 57

సీ. దగరతేఁటులకప్పుపగఱనీటులఁ గప్పు నలుదపెన్నెఱికొప్పు వదలెనేల
మెఱపునక్కులఁ జిక్కువఱపు టెక్కులసిక్కు లలఁతినిద్దపుఁ జెక్కు లడలెనేల
చలువ[5] చాయలఁ జేర్పు కలువపూవుల నేర్పుఁ దెగడు కమ్మనియూర్పు దెరలెనేల
పసిమి తీవలమించు [6]మిసిమితీవలమించు వలపుమైఁ గ్రాఁగించు వాడెనేల
మొగడతమ్ముల జిగినేలి పొగడఁజాలి, నిగుడుచన్నులఁ జెమటలు నిండెనేల
తళుకు బేడిసకవచాయఁ దళుకుఁ జేయు, నెఱ్ఱకన్నులఁ గెంజాయ నిలిచెనేల.

ఉ. గోమగు నీమొగంబు గనుఁగొన్నను గ్రొన్నవవింటిదంటచే
బాములు నోమినట్లు గనుపట్టెడు నిట్టియెడ న్మెఱుంగు లిం
కేమిటికే మిటారి తలఁ పెల్లను దెల్లమి గాఁగఁ దెల్పవే
యామకరాంకు నైనను జయంతునినైనను దెత్తు నిత్తఱిన్. 59

---

1. చ - తాపము సైఁపఁగ లేకయంత. 2. ట - కొయ్యనన్. 3. ఉ - నొక్కనాఁడు.
4. చ - ట - చింత. 5. చ - పూవుల. ఉ - తావుల. 6. క - ట - నుసిమి.

చ. ఇనకరతాపతప్త యగునింద్రదిశాసతి కాఁక దీఱ మో
మున నిడునూతనామృతసముజ్జ్వల మహా పటికంపుఁగిండి[1]లా
గున నెలదోఁచెఁ దోఁచెఁ బయిఁ గ్రొందొగ రప్పుడు నెమ్మితో [2]నిశా
వనిత మఱుంగుపట్టిన రుమారపుఁ జంద్రికపావడో యనన్. 72

మ. తోలుగెంప న్నలఁ గింపుమై నలఁది తోడ్తోఁ బ్రాగ్దిశాతన్వి క్రొ
న్నెలయన్ పాపని దానమార్పు ముసు గన్నీ రుబ్బనా నూత్నర
శ్ములు మించెం బిదప న్విరుద్ధసలిలంబు ల్వర్వనా వెన్నెలల్
నలువొందెం బయి దృష్టిబొట్టనఁగఁ జిహ్నం బొప్పె నీలద్యుతిన్. 73

సీ. విధుఁడౌట లోకైకవేద్యంబు గావింప శ్రీవత్సచిహ్నంబుఁ జేర్చెననఁగ
సోమాభిధానంబు సువ్యక్తమొనరింప నఱుతఁ గప్పుధరించి వఱలెననఁగఁ
బద్మాసనుం డౌటఁ బ్రకటంబు గావింపఁ [3]గలహంసఁ జెంగట నిలిపెననఁగ
ద్విజరాజవిఖ్యాతి నిజముగా నొనరింప హోమపావకరక్షనూనెననఁగ
నబ్జనామంబు సార్థమై యతిశయిల్ల, మత్తమధుపంబుఁ జెంత నమర్చెననఁగ
నంకసంయుక్తుఁడై చెలువందె నపుడు, కమల[4]గర్వవిదారి రాకావిహారి. 74

చ. నెలకొని రాజు తేజములు నించుచు రాఁ గుముద[5]ప్రచారముల్
దళములు విచ్చియుం బొగడుదాల్చె దళంబులు వేయి గూర్చియున్
విలసనమొంద వయ్యె నరవిందగణంబు లినుండు నిల్వమిం
దలఁప్ప బలప్రచారములు ధారిణి నీశ[6]గుణానురూపముల్. 75

చ. విరహులపైఁ గరాస్త్రముల వే నిగిడింపఁ గడంగి కందు చ
క్కెరవిలుకాఁడు వెక్కసపుఁగిన్కఁ దొలంక మృగాంకబింబమున్
విరివిలుచుట్టుగాఁ దివియ వేమఱు రాలు తదీయసీధుశీ
కరములకైవడిం దొఱఁగె గాఢతుషారతుషారవారముల్. 76

సీ. కలువకొప్పెరలజక్కవయూర్పు సెగఁ గ్రాఁగునులివెచ్చ[7]పూఁదేనెజలకమాడి
తఱినిండుజాబిల్లి తళుకుబొక్కసములోపల మించు వలిమంచు [8]వలువఁ బూని
విరిబొండుమల్లెపూబరణుల నెత్తావి జడియు పుప్పొడిగందవడి యలంది
[9]చిలుకునీరుదొలంకఁ దెలివొందు నెలచట్టుపళ్లెరంబుల మ్రోల బంతిసాఁగి
యలరుఁబొదరిండ్లముంగిళ్లవలఁపుకలన [10]నలయుజవరాండ్రక్రొన్నను చెలులఁ
పండువెన్నెలచిలువాలపాయసంబు, లారగించెఁ జకోరరాజాన్వయంబు [గూడి

---

1. చ-ట-బాగున. 2. క-దిశావనిత. 3. చ-నలహంస. 4. చ-గర్వాపహారి. 5. చ-ట-ప్రతానముల్. 6. ట-రణానురూపముల్. 7. చ-ట-పూనీట. 8. చ-చలువలూని. 9. ట-చినుకునీరు. 10. చ-నలరు.

1సీ. బలిధామ మెసఁగినఁ బట్టి బంధింపదే చీఁకటి దళమేది చెదరెఁగాక
యుడువులు బలసిన నడఁపదే నీశ ప్రకంపనాకులవృత్తిఁ గాంచెఁగాక
రాజు చేరినఁ గానరము మాన్పదే యంక మవినిశ్చితాకృతి యయ్యెఁగాక
దుర్గేశుఁ డంటినఁ దొసఁగు సేయదే యలకస్థు పదమేది కదలక యొదిఁగెఁగాక
రోదసీపూర్ణవిధుపాదరోచమాన, విపులధారావిశేషమై వెలయు దీని [తే.
మహిమచేఁ దూలవెయ శేషములిన గుణము, లసఁగ వెన్నెలజగమెల్ల నాక్రమిం

వెన్నెలవచనము.

వ. వెండియుం బుండరీకభవాండంబునం దంతంతఁ దండంబుగా నిండుపండువెన్నెల 2బిరుదుకస్తూరితోడఁ జుక్కలను జొక్కపుటరవిరులు వలగొన నునిచి తావి గట్టిన నిశాకాంతుఁ డనుదంతపుబరణి నిర వగు తెల్లగందవడిఁ బగలు గగనమణి నిగిడిచిన సెగలఁబొడమిన బడలిక నడలి బిసకుసుమరసమును జమరి పురరోదసియను చెలువ3చలువనెలకొన మైనెల్లఁ జల్లికొనిన మొల్లంబున నుల్లసిల్లి మఱియు నాత్రేయసూతనదశాసముచితంబుగా శీతలతరశీతకర శిలాతలంబులఁ బొంకి జీరుకలాడుచు మందపవమానకందళస్యందమానేందీవరమరందధారాసందోహంబులం దేలి యోలలాడుచు నెల్లెడ వెల్లివిరియు నుల్లోలతల్లజంబులఁ 4బిల్లదీవు లాడుచు, నుత్ఫుల్లమల్లికామతల్లికావేల్లిత పల్లకీకుడుంగంబులఁ గడంగి డాఁగిలిమ్రుచ్చు లాడుచుం బిసాళించి మఱియు నలుకం గలయికలకుఁ దలపడని చెలువ 5కీలితములు గిలుబందలంచు చెలువుప జాలకంబుకన్నంబులఁ బ్రవేశించి తలిరుగుముదుల నిరవగు నిరులు విరియించు వెరపున నీరములసందులు దూఱి గగనావతరణశ్రమంబు నపనయించువడువునఁ జంద్రశాలావిహారలోలబాలాకపోలఫలకంబుల నధివసించి, కనయొడలి యుడుకు జక్కవ చెలువలయూర్పు సెగల నొగిలి 6సెగమాన్పు తెఱంగునఁ బుంభావసంభావనానవిశ్రాంత కాంతాకుచాంత నిర్వాంతస్వేదంబులాని, మఱియు, నింద్రనీలమణిమయసౌధవిటంకంబులకు ధవళపారావతప్రజంబై పావిగల తీవగుంపులకుఁ బూవుజొంపంబై కాసారతీరంబులకు మించుగల యంచపిండై, బంగరుముంగిళ్లకు రంగవల్లికయై, మఱియుఁ గఱకుదారతెఱంగునఁ దమ్ముల నొగిలించుచు, దైష్టికునిపోలిక దెసలుగడచుచు భోగివడువునఁ గడిఁవోనిచలువలు దాల్చుచు నారదుని7వడువున జగడాలు

1. ట-లో సీసపద్యము లేదు. 2. చ-గుఱుతు. 3. చలువవలలముకొన. 4. చ-బిల్లదిప్పాడుచు. 5. చ-నిశితములు నిలుప్రుండబంచు. 6. చ-జలమాను. 7. చ-రీతిని.

వచరించుచు నెఱకు తెఱంగున నిల్లు నుర్గద్రోయుచు నానునిగోమునఁ గోష్ఠుల నలరించుచు మానిని [1]యనువున నుడువుల నాఁగుచుఁ [2]గాకములకు నభిసారికానీకములకు నడలు వెంచుచుఁ దరంగవతీతీరంబులకుఁ గురంగేక్షణావారంబులకుఁ గలువసొంపులు [3]నింపుచు, మఱియు నొక్కయెడ లలితమణిమయసౌధతలంబులఁ బ్రసవశరకేళికై యుల్లాసు నిజవల్లభు లల్లన పోఁకముడి [4]కేల సడలించినఁ బెగడునడి వెగ్గలంబుగ బిగ్గి డిగ్గన లేచి వాతాయనాయాతశీతకరకరాంకురంబులఁ దారి గనఁబడకునికి మనంబునం బెనఁగొనిన నాన నానతవదనలై కెళవులు గనుఁగొను నవోఢాంగనల మెఱుంగుకన్నులచాయఁ దుఱంగలించుచు, మఱియు నల్లనఁ బాల వెల్లి వెల్లివిరిసినచందంబున నందంబు చూపు బయట చిట్టకంబులకుఁ [5]బట్టువడని ముగుదలఁ దదీయాంగంబులు బయలువెలుఁబడసినిలిగుచ్ఛావయవాంతరంబులకుఁ దార్చి పేర్చినతమిఁ గట్టువాదిట్టనుగలు సలాగావకమ్యాంబులఁ దేలించిన నెలవులఁ జెలువార నెరసిన హారమౌక్తికంబు లసి పోఁడి వెన్నెల తెఱంబోవుసకియల వికావికనవ్వు నవ్వీటివిటుల నంతకాంతి ప్రకాండంబుల వండి చూపుచు, మునుపు ననుపుగల మగని మనువున నసయము సనునయించి వెండియు నొండొకతె యండనుండఁ గని చేరి నారకు దూఱి మగిడి చనునెడ వెనుగదిసి ప్రియంబులు వలికి నవంబుల ప్రాలిన భర్తల నగనట్టి మొగంబులు మగిడించి చేఁబట్టి సవలించి కరంబులు విదుచుచు జగజంత దగఱుసుగువల కంకణంబుల సంకితంబులైన హారంబుల కాంచీపూరంబుల నీరిక లెత్తుచు ననుంగుఁజెలుల వచనంబులు విని యనన్యాంగనాసంగం బారోపించి క్రించుఁదనంబు గల్పించుకొని పొలయలుకల కలఁకల నునికి నిజప్రాణనాయకులు మగిడి చనిన నిగిడిన నెవ్వగఁ బశ్చాత్తాపంబునుం బొంది జాఱు కన్నీరు సారెకు నీటునఁ బోవిచుటు నారనాటుల గోరుల కాంతితీరు చూపుచు, నొండొరువు లుద్దులు గూడుకొని తొలఁకు మగలు విడుచుఁ జెలువచెమటలు దోలఁక నలయికలు దలంపక గోడల నీడల నిజారోజకుంభపరిమాణంబుఁ దెలుపువిధంబునఁ జెన్నగు వెన్నెలకుప్పలు వోసి యున్నయుటకుఁ గడువడినవరు నీమన్మక్షైశవ లైనకప్పురగంధులు యుమనుస్థలంబులఁ బింపిల్లు గురియు ముత్తియపుఁబేరులడాలుతోఁ బొత్తు గలియుచుఁ బ్రకాశించి య

---

1. బ-యొదుపున. 2. చ-గోరవములను నభిసారికానికరములకు. 3. చ-నింపుచు విజృంభించి. 4. చ-దోడివి. 5. చ-మట్టువడని.

మృతప్రదుం డగువిధుండు దయార్ద్రహృదయుండై యఖిలభువనంబు సత్వప్ర
ధానంబు గావించె నన మించి రోదసీవలయంబు కర్పూరఫలకకల్పితం
బనుశంక నంకురింపఁ జేయుచు విజృంభించె నట్టిసమయంబున. 79

క. కంతునకుఁ దోడు రాకా, కాంతుఁడు కరకాండముల వెగడుపడఁ జేయం
గాంతాలలాము కంతట, సంతంతకు మేనికాఁక యగ్గలమైనన్ 80

## మన్మథాద్యుపాలంభనము

క. నెచ్చెలి వెచ్చగ నూర్చుచు, విచ్చలవిడిఁ బెచ్చుపెరిఁగి వెగడుపడుచు నా
పచ్చవిలుకానిచైత్రను, రుచ్చంద్రుల ననియె నత్యరుంతుదఫణితిన్. 81

సీ. రాజమండల మూర్తివాజిసంభరణపాత్రము చేసె నేజగత్ప్రాణమూర్తి
బహువాహినీభర్తఁ బ్రబలార్కకేతుచయంబు మోయించె నేయనుశరుఁడు
దుర్గాధిపతిమౌళి దోరయించె నాస్యపాదవిజృంభణంబు నేకువలయాప్తుఁ
డతిగంధతరులచే నాత్మానుగత్రేణిఁ బూనించె నేనుమనోని[1]ధానుఁ
డట్టిదాక్షిణ్యశాలియు నట్టియతనుఁ, డట్టినన్మార్గవర్తనుఁ డట్టిసురభి
కీర్తనుండును నీరీతిఁ గెరలిభీరు, హాసన మొనరింపఁ గడఁగి రేమనఁగఁగలదు.

సీ. అంధకప్రియసూతి నై విషపంకసంకలితాంకము వహించుఖలుఁడ వీవ
యనయమ్ము నేత్రమ్ములనె మాఱుకొని సత్ప్రధానత ల్చెఱుచు నీమేనమామ
ధరణి నెల్లెడఁ బ్రసూనప్రసవఖ్యాతి వహియించి తిరుగు నీసహచరుండు
భాసురద్రుమజపాండుచ్ఛదాపకర్షణచంచలుండు నీసహజమిత్రుఁ
డకట సద్భక నిరారు కృష్ణాలకాప, కారవైరస్యమున ధర్మదూరులగుట
భినువిజయాహితగుణాసభిజ్ఞవృత్తి, నవని దుష్టచతుష్టయం బగుట యరుదె.

చ. కనుఁగలవిల్లు నంటకయు [2]ఖంగని మ్రోయుగుణంబు గంటిలే
కనె యిరుమేనఁ గాఁడిదనుకాండములుం గలయట్టిమేటి జో
దున కతనుప్రభావ్రుస కెనుర్పుడ లక్ష్యముగాదు భీరువుల్
మనసిజ దోన మూఁడుకోల మానఁగదయ్య తలంచి మ్రొక్కెదన్. 84

సీ. ఒనఁగఁగాఁబోలుఁ గల్పోదగ్రహారమూర్తి పుష్పచాపముపేర భ్రుకుటిలతిక
దయసేయఁగాఁబోలు లయకాలశిఖియలిస్తోమశింజినిపేర ధూమరేఖ
సంఘటింపఁగఁబోలు సంవర్తసమవర్తి టంకారములపేర హుంకృతములు
కరుణింపఁగాఁబోలుఁ గల్పాంతరవి హల్లకాస్త్రసంఘముపేర నంశువితతి

1. చ-నిధానపట్టి.    2. చ-ఖంగుననారియగంటిలేక గ్రక్కున.

యుపథ వెట్టఁగఁ బోలు మహోగ్రకాళి, వాయురథ మను పేర నిశ్శ్వాసపంక్తి
కాకయుండిన వాఁడూరకయు వసింపఁ, నీ వెఱుఁగుదు లోక మెగ్గు వే భావజన్మ. 85

సీ. కోకస్తనియటంచుఁ గుందింపఁ జూచితే తరుణచకోరాక్షి యురయరాదె
యరవిందపద యంచుఁ బొరపొచ్చె మొందితే కువలయామోదగ్రాహిఁ గనఁగరాదె
తిమిరకైశిక యంచుఁ దెగునమ్మఁ జూచితే కౌముదీసహాస కావరాదె
యహిరోమలత యంచు నలయింపవచ్చితే తారకానఖ దయఁ దలఁపరాదె
యహితగుణశాలినియటంచు నసకుఁ బూన్ప, నివహాలిలాభిరామ నుసన్నింపరాదె
చాలఁ జెప్పెడిదేమి యీచంద్రవదనఁ, బ్రోవఁగారాదె పౌర్ణమాసీవిలాసి.

సీ. జింకపేరిటఁ గందఁ జేసె నింతియకాని హరుఫాలశిఖి చాల సంటదయ్యె
మించుపేరిటఁ గరఁగించె నింతియకాని బాడబశిఖి క్రిందుపడదయ్యెఁ
గాంతిపేరిట నీఱు గప్పె నింతియకాని రాహుదంష్ట్రాగ్ని సైపఁ బ్రాఁకదయ్యె
నుదయరాగము పేరఁ[1] బొదిగెనింతియకాని ప్రాగద్రిదవమూర్తిఁ బట్టువడదయ్యె
నకట నీ వోషధీశుఁడ వగుటఁ జేసి, సంతరించితివో శిఖి స్తంభనంబుఁ
గాకయుండిన నవినిన్నుఁ గ్రాఁచకున్నె, పాంథసంతతి ష్ఠణ్య మాపాటి చంద్ర.

[2]సీ. మొదల మహాబిలంబునఁ దేజరిల్లుట కుండలాకృతిని నిండుండవగుట
విషముతోఁ గూడ నావిర్భావమందుట బహుపాదవిస్ఫూర్తిఁ బొందుకొనుట
నవలనీక శశంబుఁ గడిమిమైలోఁ గొంట యాబాల్యకౌటిల్య మందుకొనుట
రాజితవీక్షణశ్రవణాంచితుఁడ నౌట తరుణమరుద్గ్రాసతనువుఁ గొనుట
నీవు పెనుబాఁపతేఁడవై నిలిచితరయఁ, గ్రూరభావంబు నీకసాధారణంబు
భయదవిషధారి తలక్రిందుపడుపఁజూలఁ, డతఁడు సిలిల నీలకంఠావతంస. 88

చ. ఎలమి శుకాదికద్విజసమీహితదివ్యఫలప్రదుండ వై
యలరుచుఁ గాలకంఠనుతి కర్హుఁడవై సుమనోనురాగి వై
యలఘుమ[3]రుత్సమాశ్రయుఁడ వై తగుమాధవ నీవు నీసుదృ
క్కులు నలయింతువే మధుపకోటులఁ బంచి దయావిహీనతన్. 89

చ. అలులు మధువ్రతంబులు సుమాస్త్రుఁ డసంగుఁడు పక్షపాతి చు
క్కలదొర కోకిలంబు బలికాకుల పెంపుడుగున్న ప్రాప్తవ
త్ఫలదళనం బొనర్చు శుకపంక్తి యిపన్నియుఁ ద్రోఁచి పోవఁగాఁ
దలఁచిన నోసదాగతి సదాగతివీవసుమీ లతాంగికిన్. 90

సీ. ప్రత్యగ్రవక్రదంష్ట్రా[4]శిఖాచయ మనుపట్టుకాఁడల సాటెఁ బట్టిపట్టి
శ్వాసభాస్త్రికమరుద్వలమానవిషము లన్ కలికుమంటలసాటెఁ గాఁచికాఁచి

1. చ-బొదలె. 2. చ-ట-లలోలేదు. 3. చ-మరుత్సఖా. 4. క-దంష్ట్రాశగ.

యూథీలస్పృక్కావగ్రలాలాస్రవం బనునలంతినీరునసారె నద్దియుద్ది
యత్యంతభయదజిహ్వాంచలం బనునాకుజూతిచే సారెకు రాచిరాచి [నతనుఁ
త్రాఁచువాక్రొల్లిమందుఁగంబంపుఁగొండ, యోజనిన్నాశుగముఁజేసియొసఁగె
చేయఁగాఁబోలుఁ బననతాదేని సకల, జీవనం బగునీవింత సేయు టెట్లు 91

చ. అని సుమబాణచైత్రపవనాబ్జుల నెచ్చెలి దూఱునంతలోఁ
దనువున హెచ్చినట్టి పరితాపము సైఁపఁగలేక యప్పు డ
వ్వనరుహపత్రనేత్ర నెఱవా డెడుక్రొల్లనుదోయి ఱెప్ప లో
య్యనఁ గదియించి సంజ్వరభరాలసయై పొరలాడునంతటన్. 92

చ. చెలి కలఁకం దలోదరికిఁ జెందినతాపముఁ [1]బాపు నేర్పునం
జెలువలు నింపఁగాఁ దలఁచి సారెఁ బటీరతుషారనీరముల్
తలిరులుఁ గప్పము ల్గుముదతామరసంబులు నించి మైందవో
పలకృతవేదికాతలముపై మృగలోచన నుంచి గొబ్బునన్. 93

క. విలువ యిడరాని చలువలు, చెలువకు నొనరించి [2]పయినుశీరవ్యజనో
చ్చలనజనితమందానిల, వలనంబునఁ గొంతకొంత వాడెడలింపన్. 94

క. తనుపొంది యొయ్యనొయ్యన, కనుదమ్ములు విచ్చిచూచి క్రమ్మెడుకన్నీ
రనయము ఱెప్పలఁ గ్రుక్కుచు, ననియెం జెలితోడ ధైర్య మవలంబముగాన్.

సీ. చెలియ నేఁ బెంచిన యెలమావిమోకకు సేవంతికకుఁ బెండ్లి సేయవమ్మ
సుదతి నేసాఁకిన శుకశారికల దేవతామందిరములకుఁ దార్పవమ్మ
మగువ నేఁ బెంచిన మరువంపుమడికట్టు లప్పటప్పటికిఁ బెంపరయవమ్మ
[3]పడఁతి నేనడపిన బాలసారంగంబు ఋషినివాసముల కర్పింపవమ్మ
యబలి నాతోడఁ గడఁగూడి యాడునట్టి, నెచ్చెలుల నెల్ల నీవు మన్నింపవమ్మ
భావిజని నైన నాతఁడె భర్తయగుట, కింతి మరునకు మే నప్పగింతుఁ గాన.

చ. అనుచు నడింగడంగి కుముదాప్తునికై యెదు రేగునంతలో
ఘననిభవేణి క్రొంపులుటయు గ్రక్కునఁ బువ్వులు రాలెఁ దో నురం
బునఁ జొరఁబాఱినట్టి యలపూర్ణశశాంకమయూఖపంక్తి వె
న్నున వెనదున్ని పాఱె నన నూత్నసరోరుహపత్రనేత్రకున్. 97

క. అత్తఱి సఖు లగ్గలికలు, బిత్తరిఁ దనబాహులతల బిగియించి కడున్
మొత్తని మేచెమటలు వడి, నొత్తుచు విధుమణివితర్ది నునిచినయంతన్. 98

చ. కలఁక తలంక నేత్రములకాఁకఁ బెరల్పఁగఁ జేరవచ్చెనో
పలుమఱు నేత్రరాజ మనఁ బయ్యెదకొంగు మెఱుంగుఁగన్నులన్

1. చ-మాపు. 2. క-చెలులుశీత. 3. చ-వనిత.

నిలిపి లతాంగి యేఁచ్చె మది నెవ్వగతోఁ గురరీపరంపరా
కలితసవీనదీసతరకాకలికాకలనిస్స్వనంబునన్. 99

క. ఈరీతి నెమ్మనమ్మునఁ, గూరిన వగ నేస్తునట్టి కుముదిని నెదస్సేఁ
జేరిచి చెక్కుల డిగుక, నీరు కరాబ్జమునఁ దుడిచి నెచ్చెలి పలికెన్. 100

చ. వదలుదురమ్మ యాత్మకులవర్తన మీలువు మాలి సారెకున్
బదరుదురమ్మ లేదలిరుఁబ్రాయపుమేని పలంతురమ్మ యు
ట్లదరుదురమ్మ మందుశశికైనఁ దలంకక సందునెన్నెలన్
గదియుదురమ్మ యిత్తెఱఁగు కన్నెకుఁ జెల్లునటమ్మ నెచ్చెలీ. 101

మ. మెలఁతా నీవిఁకఁ జింతసేసెదవు సున్నీ పీరసీనుండు నీ
లలితోద్యానముఁ బాసి వచ్చి నిజలీలాగేహముం జేరె నా
చెలువుం డచ్చట నుండఁబోలు నిఁక నీచేకంకణం బిమ్ము నీ
వల కేళీవని కేగి యీక్షణమె నీప్రాణేశుతోఁ దెల్పెదన్. 102

—— సరళికచంద్రభానుకడ కేగుట. ——

క. అని తెలియఁబలికి యపుడా, వనితకుఁ గ్రమ్మఱఁగ శిశిరవస్తువు లెల్లం
బనుపఱిచి యాకెవలయము, తనచేఁ గొని కూర్మిఁబోటి సరళిక చనుచున్.

ఉ. చెంతఁదనర్చు కేళివనిఁ జేరి నికుంజము లెల్లఁ గాంచి య
త్యంతసుగంధబంధురలతాంతనితాంతవిలోలగుచ్ఛకా
భ్రాంతసరస్వరంవరసంగతభృంగతతాంరవాప్ర తా
శాంతలతావితానకలికాలయ మొక్కటి డాయవచ్చినన్. 104

క. మును తావీణియమీటుచుఁ, గనుఁగొన్నలతాంగి సూపు కన్నులదోయిటన్
గనుపట్టఁ జంద్రభానుఁడు, మనసిజశరఘూర్ణమానమానసుఁ డగుచున్.

ఉ. నీపవనీధునీకమలినీమకరందమిళన్నిలిందగ
ణ్గాపటుఝంకృతుల్ సయిఁపజాలక నీలకచాకచాంతరా
రోపిత మైనడెందము మరు ల్గగిలింపఁగ లేక చిక్కి లీ
లాపరికల్పితైందవశిలాతలశీతలవేదికాస్థలిన్. 106

క. పవళించి చందనాచల, పవమానకిశోర [1]చలితఫలగళితరసా
నవమత్త[2]కీరశారీ, రవములు పెట్టుగ హృదంతరం బెరియింపన్. 107

క. తలపోయుఁ దలఁకు పలుకుం, దలవంచుం దిట్టుకొంచుఁ సహాసహాయడు లోఁ
దిలకించుం బులకించుం, బలికించు స్వప్నబయలఁ భామా యనుచున్. 108

1. చ-జనితఫల. 2. క-కీరశారికరవములు.

## చంద్రభానుని పరితాపము.

సీ. హృదయవాసిని యైనసుదిరాక్షి లేనవ్వు లభినవపాండిమం బలవరింప
స్వాంతసంగత యైన కాంతలేఁజూపులు తనువునఁ జాంచల్య మనువుపఱుపఁ
జిత్తచారిణి యైనమత్తకాశినిమోవి కన్నులనెఱసంజ గడలుకొలుప
సంకల్పగత యైనపంకజాననకౌను తానవం బంతకంతకు నిగుడ్ప
మానసావాసయైనభూజానిపుత్త్రి, పిఱుఁదు కోర్కులకెంతయుఁ బెంపు నెఱపఁ
బలవరించుచు నాచంద్రభానుఁడపుడు, నిలువరింపఁగలేక కన్నియఁదలంచి.

చ. మిఱుకుచుమిఱుక్కునం దనువు పోఁకెడు వెన్నెల కాలుకొల్పుచుం
జఱవఁగఁజొచ్చెఁ దెమ్మెరలు చక్కనిజోదు శరమ్ము లేయఁగాఁ
గఱకరియయ్యె నిట్టియెడఁ గౌఁగిట నన్దయఁజూడ కక్కటా
తెఱవ యొకింగితే నెగులు దీర్పఁగదే [1]తగవే కలంపఁగన్. 110

ఉ. కన్నుల దోరచాయ లలికంబున లేఁజెమ రుబ్బుగుబ్బలన్
గ్రొన్నెలవంకసొమ్ము లఱగ్రొమ్ముడిజాఱినపూలు వాతెఱం
జిన్నిమెఱుంగుకెంపు తెదఁజిట్లిన గందము గల్గునట్లుగాఁ
గన్నియ .... .... .... .... .... 111

ఉ. రాణమెఱుంగువెన్నెలఁ గరంగిన గ్రొన్నెలఱాలమేడలం
బ్రాణసమా .... .... .... .... ....
వీణఁ బొసంగ్గ పంచశరవిక్రమము ల్పచరించుగీతముల్
గానరసంబుపారఁ బలుకం గలభాగ్యము నాకుఁగల్గునే. 112

చ. పలుచనిమేను లేఁగొనరు [2]పల్కులు ముద్దులమోము చిన్నిగు
బ్బలు జవగాడుచెంద్రకలు బంగరుచెక్కులు చేరెఁడేసిక
న్నులు నునునుత్తలుల్ మినుమినుక్కనుకొను మెఱుంగువెన్నెలల్
కులికెడు నవ్వునం [3]గులుకుకోమలి ని న్నెడఁ [4]జర్చచేసెదన్. 113

క. కలువా కనుఁగవ గొలనెల, చెలువా నెన్నొసలు కప్పుఁజిలువా జడ యో
చెలువా వదిపే తెసను, పిలువా నినుఁజూచి గారవిలువారలకున్. 114

క. తుహినకరవదన సిగతి, బహుభంగులఁ బలికి చంద్రభానుండు ముహు
ర్ముహురుపహితవిరహార్తిం, దహతహపడి యాత్మచర్యఁ దలఁచి కలంకన్. 115

1. ట - తగదే. 2. చ - పల్కులముద్దులమోము. 3. చ - ట - గలుగుకోమలి.
4. చ - ట - చింతసేసెదన్.

సీ. ఉన్నట్లు యుండి ప్రద్యుమ్నుతోఁ గలహించి సిద్ధార్థినై యేల వెడలవలసె
వలసెఁబో త్రోవ దుర్వాసుశాపంబున విజయులోలుం జేల విడిచిపోనోఁ
బోయెఁబో నేను నీ[1]పురిసొచ్చినది మొద లీ[2]కుముదిని యాపమేలవింటి
వింటిఁబో వనములో వీణవాయించుచో నే తెంచు నాకన్నె నేలకంటిఁ
గంటిఁబో యంతలోనన నె కష్టవింట
గొనయ మెక్కించి మరుఁ డేలకూఁత సేసె
నకట శౌరికి సత్యకు నవతరించి
నట్టినాకును దైవమి[3]యడలు దెచ్చె. 116

సీ. తరియింతు నెటువలెఁ బరవాది విరవాది నెఱవాదితావుల[4] మెఱయుగాడ్పు
భరియింతు నెటువలెఁ బరుసంపుమురువంపు గరుసంపువిలునింపుశరచయంబు
మలఁగింతు నెటువలె నెలదీవియలదీవి సలదీవియల విరాళుల తలిరుడాలు [నలు
దొలఁగింతు నెటువలెఁ బలుమాఱుఁ బోలివిరాళు బలుమారుబాబాలకలికిరో
సారిది నేత్రాబ్జములు విచ్చి చూతునెట్లు
సాంద్ర మోహాతమంబుతో సైఁతునెట్లు
ప్రౌఢశశిమాంత్రికవికీర్ణపథికహనన
భసితసితసాంద్రచంద్రికాపాటనంబు. 117

మ. అనిపల్కి న్వని యంత నాతరళికాజ్ఞామోద యత్యంతసం
జనితాశ్చర్యముతోడ నాత్మ సతని స్సత్యానుతుం జంద్రభా
నునిగా నెన్నుచు నాకుమారకుపయి న్నాలోకన్న యాత్మీయన
ఖ్యనురాగం బుచితోపయుక్త మని యత్యానందముం జెందుచున్. 118

సీ. చంద్రభానుఁడు కాన నమధికంబై మించు వెల్లఁదనంబున వెలయువాని
కృష్ణపక్షంబున నెసఁగినరాజౌట సంతకంతకుఁ గార్శ్య మడరువాని
బ్రద్యుమ్నరుచిగాన భరియింపఁగారాని గాటంపుఁగాఁకచేఁ గరఁగువాని
నిత్యానిరుద్ధసుస్నేహదీపకుఁడౌట మలయానిలమునకుఁ దలఁకువాని
నరయ సత్యాత్మసంభవుఁ డైనకతన
నతనుశరవర్ధితాంగుఁడై యలరువాని
నాకుమారవరేణ్యు డాయంగ నరిగి
వినయవినమితవదనయై వనజగంధి. 119

1. చ-ట - పురిఁజేరినది. 2. క - కుముదినియాపంబు గుఱుతువింటి. 3. చ - యడరు.
4. చ - నొరయుగాడ్పు.

తరళిక చంద్రభానునకుఁ గంకణము నిచ్చుట.

గీ. దేవ [1]చిత్రేశు సాత్రాజితీతనూజ, కాంతకుముదిని నిజకరకంకణంబు
ననిపె దేవర కిదె దీని నవధరింపు, మనుచుఁ బ్రాంజలియైన నయ్యవనిభర్త.

క. వితతాశ్చర్యతరంగిత, మతియై యా లేమచేతి మణిమయవలయం
బతిమోదంబునఁ గైకొని, స్మితమంజులవాక్యసరణిచే నిట్లనియెన్. 121

శా. రాగాంకూరలతాలవాలమహో దౌర్భాగ్యాక్షురాక్షేపణో
ద్యోగాధిష్ఠితకుండలాకృతివహో [2]హృద్యవ్యక్తాంగనాధైర్యసం
భోగాభోగజదత్తవాగురవహో లేదా మత్తమో[3]రాహువుం
బ్రాగల్భ్యంబునఁ [4]ద్రుంచుచక్రమువహో భామాకంకణగ్రామణీ. 122

క. మణిబంధబంధురస్థితి, మణిబంధనవాధివాసమహిమ మెఱయు నిం
బ్రణుతించెద ననుఁ గన్యా, మణిబంధుం జేయవే సమంచితకరుణన్. 123

క. చెలువ వలితెఱఁగు నాతోఁ, బలికి కలఁక నడఁతు ననుచుఁ బఱతెంచితివా
నాయు ప్రకోష్ఠవాసికి, [5]నలనడు నీవుదికిఁ దెలియు నంతర్వార్తల్. 124

చ. అగణితమన్మథాశుగమహాజ్వలితానలమామకీనహృ
ద్ద్విగుణితతాప మెంచదహో మది నృహిభృద్వరజాత యాసమ
గ్రగుణకలాప సింధుమణి గానియెడన్ ఘనసారయుక్తిఁ జె
న్నగు విమలోర్మికం బనువ కంపు నెని న్నొకకంకణాకృతిన్. 125

చ. తొలువలకాచకయ్యమునఁ దొయ్యలి నీవికి నెగ్గు వేఁ దమిం
దలఁచిన నస్తగింపుమకరతామనసంబునఁ గూడునిన్ను నే
నలఁకుని బెట్టఁ గంకణము నమ్ము భవద్రుచిం గాంతయంగముం
దెలియఁగఁ జేయు మేలు మదినిల్పెదఁ గీలెడలింప నొక్కెడన్. 126

మ. చెలిసంతోషముఁ గాంచునే సఖులకు న్నెమంబు సంధిల్లునే
లలనాపోషితశారికాశుకమరాళంబు ల్సుఖం బుండునే
సెలుగు ల్నాపునె పంచసాయకుఁడు రాజీవాక్షిపై రత్నభా
నిలయం బోపలయంబ తెల్పు మని కన్నీరోడికల్ గట్టఁగన్. 127

గీ. వినమఁ జెయ్యున్న యమ్మహీవిభుని జేరి, శిశిరవస్తులచేఁ గొంత సేదఁదేర్చి
తలిరుఁ జెంబాయసురటిచే నలవరించి, యొయ్యవిసరుచుఁ దరళికాయువతివలికె.

1. చ - ట - చిత్రేశ. 2. చ - హృద్యోపాదృఢీభావముద్రా గాఢోద్యదనంగపాశ
మహో. ట. హృద్యోపాదృఢీభాగముద్రా గాఢోద్యమనంగపాశమహో. 3. చ - ట - వైఖరిన్.
4. చ - బాహుచక్రమహో. 5. చ-ట-నలవడు నేనిపుఁ దెలియు నంతర్వార్తల్.

క. జననాథచంద్ర యేమని, వినిపించెద మున్ను నిన్ను వీణారతునిం
గనుఁగొని కుముదినియట వో, యినమొనలుం దాల్చి దూలి హెచ్చినకూర్మిన్.
సీ. మలయానిలంబు పైఁబొలసిననీభుజాపన్నగంబుల మది నెన్నునయ్యో
కమలకాండములు పైఁగ్రమ్మిన నీయాననేందుమండలము నూహించునయ్యా
మదరుతుమ్మెదలు పై వ్రాల నీనాసికావికచచంపకము భావించునయ్యా
రాయంచపదువు లాఁటడి వెట్ట నీకుంతలఘనాఘనములఁ దలంచునయ్యా
భ్రమసి యూరక పనిలేనిపనికిఁ గూర్మి, చెలియఁజేరెదనని నిన్నుఁ జీరునయ్యా
చిత్రఫలకంబుపై నలచిత్తజాతు, వ్రాయఁదలఁపోసి నీరూపు వ్రాయునయ్యా.
ఉ. చక్కెరబొమ్మ కొమ్మ యెలజవ్వని యచ్చట నిట్టు గుంద నీ
విక్కడ నుందువయ్యా చెలి యీలువుదూలి మనోజుగాసిచేఁ
జిక్కఁగ దెయ్యా యింతపనిసేయుదు రయ్య యిఁకేమిసేయునో
చుక్కలరాజు వేఁడితలసూపెను రాగదవయ్య మ్రొక్కెదన్. 131
[1]మ. అని పల్కన్విని చంద్రభానువసుధాధ్యక్షుండు సంతోషనీ
రనిధిం దేలుచు నోలతాంగి యిపు డేఁ బ్రచ్ఛన్నవేషంబుతో
నునికిం జేసి యథేచ్ఛఁ [2]జేర నది నీవూహించి యేవేళ నీ
కనుకూలం బగు నట్టివేళ ననుఁ డాయ న్వచ్చి పల్కించినన్. 132
క. హరి రుక్మిణిఁ బలె నేనుం, దరుణీమణిఁ గొంచు శత్రుదమనుఁడనై మా
పురికేగెద మది నీవొం, డరయక పరికింపు మట్టియవకాశంబున్. 133
చ. అని పతి వెండియుం బలుకు నంగన నాతెఱఁగానుపూర్విగా
వనితకుఁ దెల్పు మేను దనవాఁడ సుమీ యనిపల్కు నాపయిం
దనదయ యుండనిమ్మనుము దైవికమైన యితరేతరంబు హె
చ్చినతమి నెట్టులైన దరిఁజేర్చునదృష్ట మటంచుఁ జెప్పుమీ. 134
చ. తరళిక నీవు వచ్చి కడుఁ దామసమయ్యెను దమ్మికంటి లో
విరహదవానలంబు కడువెగ్గలమైన సహింప కేగతిం
బొరయుచునున్నదో మగిడిపొ మ్మనియూర్మికఁ జేతికిచ్చినన్
దరుణి జొహారు దేవ యని తన్మణిముద్రికఁ గొంచు గొబ్బునన్. 135
శా. ఆలీలావనవాటిఁ బాసి తరుణీహర్మ్యంబు సొత్తెంచి యా
నాళీకాక్షికి లేమ తాఁ జనినచందం బంతయుం దన్మహీ

1. ట - లో నీపద్యమునకు మాఱుగ "అనినవిని" యని వచనముగలదు. 2. చ - రాఁజనదు.

పాలోదంతముఁ బంచసాయకునిదోఃపాండిత్యముం దెల్పి కెం
గేల న్రంజిలు ముద్దుటుంగరమొసంగె న్మందహాసంబునన్. 136

చ. ఒనఁగినఁ బొంగి యచ్చెలువ యొయ్యన నేత్రయుగంబుఁ జేర్చి సం
తసమునఁ గేలఁదాల్చియుఁ బునఃపునరుక్తసఖీసనర్మ వా
గ్విసరరసంబు చిప్పిలుచు వీనులవిందులు సేయఁ గొంతచిం
తసడలి యున్నయంతటఁ గనం దగియె న్నిశి ధూసరచ్ఛవిన్. 137

గీ. భార్గవుఁడు గానఁ బరుసంపుఁ బస దలిర్ప
రాజజృంభణ మాత్మ నోర్వంగ లేక
తదపకర్షంబుకొఱకు నభ్యుదయమందు
చొప్పుతోఁ దూరుపున వేగుఁజుక్క తోఁచె. 138

మ. కమలాప్తుం డిట బ్రహ్మయై యఖిలముం గల్పింపఁగా నిమ్ము హూ
ర్తము బ్రాహ్మంబనఁ బొల్చు నేతదనుసంధానంబు నించు న్నితా
ర్థములంచున్ జనకోటికిం దెలుపుచందంబొప్ప ఘోషించెఁ ద
త్సమయారాధనజాతవాఙ్మహిమమించం దామ్రచూడౌఘముల్. 139

చ. చెలియలి యిల్లు మందటిలఁ జేసిన దోషము సద్వసూత్కరం
బులు గిలుబాడనైనయఘముల్ బహుచక్రవిమర్దనంబునం
గలిగినదుష్కృతంబుఁ దొలఁగన్ భృగుపాతమొనర్చెనో యనన్
గలువలఱేఁడు వ్రాలెఁ దుదిగట్టుననుండి కళావిహీనతన్. 140

క. అర్కుఁ డపరాద్రి కేగుచో నతనికాంతిఁ
గొల్లగొని యాతఁ డేతేరఁ గొఱలుభీతి
నప్పగింపఁగ నెదురుగా నరిగికాచి
యున్న శిఖియనఁ బ్రాచిఁ జెన్నొందె సంధ్య. 141

[1] ఉ. కాలపయోదమూర్తి పయిఁ గ్రమ్మి మహాబిలమండలంబు త
త్పాలకుఁడైన ఋక్షవరుబంధుయుతంబుగఁ గూల్చి తత్ప్రభు
త్వాలఘుకాంతిలక్ష్మిఁ గొని యయ్యరుణద్యుతిరత్నరాజముం
జాలసముద్ధరించె హితచక్రముఖాబ్జము లుల్లసిల్లఁగన్. 142

[2] మ. మునుదానేగెడు వేళఁ జీఁకటులఁ బైము క్కాఁకఁ గాఁబంచి వే
చను దేరం దము [3]గామినింబలె గుహాసద్మంబుల న్వానిలోఁ

1. ట - లోఁ లేదు. 2. ట - లోఁ లేదు. 3. చ - కానివింబలె.

గోని యుండంగని తచ్ఛిఖాగ్రహణ మున్కుం బూన్కం గావించెనో
యనఁ బైపై నిగిడెం గరంబు లగకూటాభోగభాగంబులన్. 143

మ. సరవిం దామరబాసవాగ్గురు భాస్వద్రాముపాదాప్తి భా
గ్యరమోత్కర్షము గల్గి గర్కశమహోగ్రానస్థితిం లోన ముఖ
స్ఫురణల్దాల్చి సముజ్జ్వలావయవయై సొంపూనఁ బత్త్రప్రసూ
స్తరశాపాండురపంక్తినా వెడలె సంతర్గగ్నరోలంబముల్. 144

గీ. అట్టియెడఁ గాల్యకృత్యంబు లలసగతులఁ
గడపి నెవ్వగఁ గుముదినీకాంతమూర్తి
నెలకొనిన తాప మొరులకుఁ దెలియనీక
విభుని వరియింప సమయంబు వెదకుచుండె. 145

మ. అలఘుజ్ఞానతరంగరంగదళికస్యందిప్రవేందుస్పృహా
చల[1]షట్కంజభుజంగ జంగమగుణాంచత్కాంచనోర్వీధరో
జ్జ్వలలక్ష్మీ[2]వశగాంగ గాంగఝుర[3]వైశద్యాస్పదాభంగని
ర్మలచిత్తోర్జితసంగ సంగరజయప్రాప్తిప్రహృష్టాత్మనా. 146

క. అత్రిమునిపూర్వపర్వత, మిత్ర జగన్మిత్రబల[4]సమిత్పత్రగుహా
చ్ఛాత్రోత్కృష్టపవిత్రహోత్రధ, పిత్రా యసత్కృతాలవిత్ర వినయపవిత్రా. 147

[5]మాలిని. ఉదరదమరసద్మాభ్యర్ద్గతోన్నిద్రపద్మా
పదయుగ చిదమోఘాంపాతిదవ్యాప్తితేజా
విదితశయనయోగావిష్కృతోద్బోధనాగా
హృదయ[6]నిటలసీమాహీంద్ర తాఘుర్ధధామా. 148

గద్య. ఇది శ్రీదత్తాత్రేయయోగీంద్రచంద్రచరణారవిందవందనసమాసాదిత
సరసకవితారసోదాత్తవత్తనామాత్యసోదర్యమల్లనమంత్రిపర్యప్రణీతంబైన
చంద్రభానుచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

1. చ - షట్కాబ్జ. 2. చ - శుభ. 3. చ - వైశద్యాస్పదా. 4. చ - సమి
ద్వత్తగురుచ్ఛాత్రోత్కృష్ట. 5. ఈపద్యము ట - లో లేదు. 6. చ - నికటసీమా.

శ్రీరస్తు.

# చంద్రభానుచరిత్రము.

## పంచమాశ్వాసము.

క. శ్రీయోగ [1]స్త్రీయోగప, రాయితరోమాంచభూషణనిరీక్షణ యా
మ్నాయమయభాషణ కృతా, ధ్యాయస్మృతనామధేయ దత్తాత్రేయా. 1

వ. అవధరింపు మాసమయంబున. 2

సీ. పరవాహినీవిజృంభణము మానుచు మేటి నిర్ణిద్రశరసమున్మేషవేది
చనుదెంచు రాజహంసముల నేలెడుఱేఁడు కువలయామోదానుకూలవృత్తి
కమలాధివాసమై కనుపట్టుగుణశాలి మిత్రనిర్వ్యాజలక్ష్మీవిధాయి
సత్పరంపరకుఁ దేజంబు గూరుచుపెద్ద యతులవిధుప్రసాదైకపాత్ర
మఖిలభువనంబుపంకంబు లడఁచుసుకృతి, సకలఫలవైభవంబు లొసంగుదాత
చంచలారంభములు లేనిచారుమూర్తి, జగతి మించె శరత్కాలచక్రవర్తి. 3

చ. సరసవనాంతరాళవికసద్విషమచ్ఛదధూళికాపరం
పరలు మరుత్ప్రచారములఁ బైపయి నంబరవీథిఁ బర్వ పాం
డరజలదప్రకాండము లనంగఁ గనుంగొనవయ్యెఁ గానిచో
గరిమ వహించునే యవి జగజ్జనమోఘసితాభ్రసంజ్ఞలన్. 4

చ. సరసిజపాంసుసంవలితసైకతము ల్విలసిల్లు నేఱులన్
శరదృతుభర్త నీరసమయశాటిఁ దెరల్చినఁ జంద్రకావియ
స్తరులమఱుంగులం దగునితంబములో యనఁ బ్రాంతసీమఁ ద
త్కరనఖరాంకరేఖ లనఁగాఁ దెరతాఁకుడుజాడ లింపగున్. 5

మ. అకరు ల్విప్పులు తావిపుప్పొడి సముద్యద్ధూపచూర్ణంబు కే
ళికరాళిప్రకరంబు ధూమము మరాళీపక్షము ల్తాలవృం
తకము ల్గాఁ దగు రాజహంసతతి చెంతం బద్మిను ల్పానుధూ
పకరండంబులుపోలె సామిదళితాబ్జంబుల్ సరోవీథులన్. 6

క. శరములు గాన్పుస మీఁద, న్నురువులు నెలకొల్పె ననఁగ నుతిఁగని హరిదం
తరములఁ బూచినకనుములు, వరఁగె న్వలరాజు జల్లిబల్లెము లనఁగన్. 7

1. చ-ట-శ్రీయోగ.

గీ. దళులవిచ్చి నకపురంపుఁదరులపొరల, నుదలుగంబూరముఁగాలిసుప్పరంబు
తెగయుఁడ్డగునేస్తుతమునీటికగుకలంక, లవఁచుమహానికి నుడుగదలనిపి నసఁగ.
చ. అలయుతిమాత్రసృష్టిసముదయంబుగ నెప్పటియట్ల ధాత్రిపైఁ
గలయఁగఁ బర్వ లేక శశికాంతి సభస్థలియందు పేరి యా
జలదపువేళ గూపతిన స్వచ్ఛతనుచ్ఛట గానసయ్యె నా
నలరె శరత్సనంబులు సితాంబుజపారదనారదచ్ఛవిన్. 9
ఉ. బాహుల మీఁగలిన్ ధరణిభాగమున న్నెటిఁ జూపుచుండె నైజ
వాహికలగ్నయోగ్యశుభవాసరము ల్గనుఁ బెంచిన స్సహో
త్సాహముతోడఁ జైత్యనుధాపతి యుత్తకుమారమాళి కు
ద్వాహముసేయఁ బూనిక ముదంబు హృదంబుజసీమఁ దోఁపఁగన్. 10
[1]గీ. ఆప్తవర్గంబుతో రహస్యంబుగాఁగఁ, గొంతసేపు విచారించి కుంతిసమున
రుక్మబాహుప్రభునిపుత్రి రుక్మగాత్రి, కుముదినీకన్య యునికి భావమునఁ దెలిసి.
చ. తమకుఁ బురోహితుం డగుపితామహసన్నిభు గాలవాఖ్యనం
యమిఁ గదియంగఁ బిల్చి విమలాత్మ విదర్భధరిత్రికేగి సం
భ్రమమున రుక్మబాహునరపాలశిఖామణిపుత్రి యైనదా
కుముదిని ధృష్టకేతువునకుం దగువేఁడుము పొమ్ము గొబ్బునన్. 12
చ. అనవుడు నట్లకాక యని యమ్ముని కుండినరాజధానికిం
జని తనరాకభీమనృపచంద్రతనూభవుఁ డైనరుక్మబా
హునకు నెఱింగింప నాతఁడు నముత్సుకుఁడై యెదురేగి యగ్రపూ
జన మొనరించి తెచ్చి మణిసాంద్రహిరణ్మయపీఠి నుంచినన్. 13
గీ. కుశల మడిగించి యమ్మునికుంజరుండు, కుశలయోగాధిప నీపుత్రిఁ గుముదినీల
తాంగి శిశుపాలనృపతినిజాత్మజునకు, నడిగి రమ్మని సనుపంచె నాదరమున.
[2]మ. జననాథాగ్రణి యేమిచెప్పుదు భుజాస్తంభోరుకుంభీనసా
భినవత్క్ష్మాశిఖాయితాసిముఖనిర్భిన్నారియౌ నాకువరా
రుని[3]యౌదార్యము సూపు రేఖయును నోర్పు న్నేర్పుఁ గారుణ్యవ
ర్తనముం గీర్తనము న్బలంబు చలము న్బ్రాపట్టి రాచూలికిన్. 15

1. టలో 11—12—13 పద్యములకుబదులుగా; వ. విచారించి రుక్మబాహునిపుత్రి యున్కిఁ దెలిసి నిజపురోహితుం డగుగాలవాఖ్యునిం బంచిన నతండునుం జని భీమనృపతనూభవుం డైనరుక్మబాహునిం గని. అనువచనము గలదు. 2. ట-లో నీపద్యము లేదు. 3. చ-యౌదార్యమువార్య శౌర్యమును.

క. కాపున నీపుత్త్రికి నను, భావలయమునందు వాఁడె తగు వరుఁ డింక నీ
వేవిధమును దలఁపక నృ, పావల్లభ యతని కిమ్ము పే యేమిటికిన్. 16

చ. అనుటయు నుక్తబాహువసుధాధిపుఁ డాప్తసుహృజ్జనంబుతోఁ
దనయవివాహకృత్య ముచితస్థితి నెంతయుఁ జెల్పి వారిచే
ననుమతుఁడై ప్రమోదమున నమ్మునినాథుని వెంటఁ జేదిరా
జునకు నిజాప్తమండలికి శోభనలేఖలు పన్పె నచ్చటన్. 17

[1]క. చేదిధరాధవుఁడును న, మ్మోదము రెట్టింప బంధుముఖ్యుల మగధే
శాదివసుధాధినాథుల, నాదరమునఁ బిలువనంపి [2]యతివేగమునన్. 18

గీ. శుభముహూర్తంబునం దాప్తసుతయుతముగ
ధారిణీసురమంత్రము ల్బోరఁ బాంత్ర
ధవళముల నాదములును వాద్యములరవళి
బోరు మని మ్రోయ నాత్మీయపురము వెడలి. 19

[3]సీ. పాదాతకరకుంతపటలఘూర్ణాఘాతరథకేతువాక్తికవ్రాతరజము
కుంభరఘూర్ణితతుణ్ణవారణఘంటికాపద్మరాగనికాయధూళి
సవ్యకహేమ్యఘూర్ణప్రోత్థహయగళార్పితధామమరకతరేణువితతి
వల్గ్యఘూర్ణప్రసూనవ్యాటమాళిరత్నగోమేధికవ్రజపరాగ
[4]ములమూఁజిత్రాకృతిఁదనర్చునంబరంబు, తనకుదిక్పద్మనయన లెత్తిన మెఱుంగు
లవలనుంజాటివన్నెయుల్లడయనంగఁ, దనరనొయ్యనఁగుండినమునకుఁజనియె.

ఉ. అంతకు మున్నె భీమవసుధాధిపసూతి చమూసమేతుఁడై
యంతయు వేడ్కతోడ నెదురేగి రయంబునఁ దోడితెచ్చి గే
హాంతికకేళికాననమునందుఁ దగ న్విడియించి వారికిన్
సంతస మొప్పతిల్ల నుపచారవిధు ల్నెపరించుచుండఁగన్. 21

ఉ. ఆవిధ మెల్లఁ బ్రాణసఖు లారసి వచ్చి యెఱుంగఁబల్కఁ జిం
తాపులకద్ధిదై కుపలయాధిపునందన కూర్మిబోటిచే
నావనజాతసూతికిఁ దదన్యకరగ్రహణాన పేక్షయుం
గేవలమాహ్వాసనకృత్యముఁ దేటగఁ జెల్పి పంచినన్. 22

గీ. జనని లేఖ్యనియుక్తంబు వినినితాంత, దుఃఖితుండయ్యు నతఁడు వధూవయస్య
వచనముల చేతఁ గొంతయాశ్వాసమంది, సైన్యబలసంకులారామసరణి వెడలి.

---

1. బ - లోనిపద్యము లేదు. 2. చ - యతిమోదమునన్. 3. ఈపద్యము బ - లో లేదు. 4. చ - మాలవిచిత్రాకృతి.

క. ఆపృథ్వీరమణుండు వు, రోపాంతంబునకు వచ్చి యొకచక్కటి ల
క్ష్మీపద్మముఖీసద్మము, లోపల నున్నట్టివిజయలోలుని గనియెన్. 24

చ. కనుఁగొని బాష్పపూరకలిక ల్కనుఁదమ్ముల నిండ దాయఁగాఁ
జనుటయు నాతఁడుం గదిసి చాఁగిలి మ్రొక్కిన గ్రుచ్చియెత్తి స
మ్మనమున హర్షచిత్రములు [1]మల్లడిగొట్టుచునుండ నొక్కచో
ననితరవాస మైనవిమలావనియందు వసిం[2]చె సత్త్రికన్. 25

శా. శైనేయాత్మజుఁ డామురారినుతు సాశంకంబుగాఁ జూచి యో
యీ నిట్టూరుపు లేల పెల్లడరె మీ నేలా కృశంబయ్యెఁ గన్
గోనల్ కెంజిగిఁ బూనె నేమిటికి నాకుం జూడ నీతీరు సిం
తైతే నేఁడిచ్చటఁ దోఁచె నీదువిధ మాద్యంతం బెఱింగింపుమా. 26

సీ. అనఁజంద్రభానుఁడిట్లనియె నాఁడు మృగయావినోదముఁబట్టుటకునుముదముచనఁగుచునెడఁ
గవవాసి యొండొరుఁ గానంగ లేక పోయిన నంతఁ జింత నే నిచటఁ జేరి
వీణారహస్యంబు వీరసేనునిగూడి తుంబురుచే వినితోఁటలోన
నభ్యసించుచునుండ నచటికిఁ గుముదిని యేతేరఁ గంటి నాయిందుముఖియు
ననువరించెద ననుచునుండఁగఁ దదీయ, జనకుఁ డాపైన్యసూతికి సంభ్రమించు
వారు నేతెంచి యూవనవాటి విడియు, నేనచటువాసి వచ్చితి నిటనయాస్య.

గీ. అనుచు నాద్యంత మేర్పడఁ దన తెఱంగు, దెలుప నాశ్చర్యవారిధిఁ దెప్పఁ దేలి
యామురాంతకసుతునితో న్మాత్మచర్య, విజయలోలుండు వలుకు నవిస్తరముగ.

మ. అటు లాబ్బర్ణిము ల్చనం దదనుయాత్రారంభము ల్గాని యు
చ్చట నిమ్ముం గనలేక ఖేదవళితస్వాంతంబుతోఁ గుంది యు
ద్భటహార్యక్షమృగాదనంబు లగుకాంతారంబుల న్దైనసం
ఘటనం బాంధులఁగూడి యొయ్యనఁ జనంగాఁ గొంతకాలంబునన్. 29

## వర్షాకాలవర్ణనము.

శా. హంసోచ్చాటనమంత్ర మంగభవసాహాయ్యంబు కాదంబినీ
సంసద్వైశసనంబు భాస్కరతిరస్కారంబు ఘర్మచ్ఛటా
సంసారాపగమంబు పంకజతమిస్రావేళ విశ్వంభరా
పాంసుధ్వంసన మంబుదాగమము దీప్తంబయ్యె నుర్వీస్థలిన్. 30

1. చ - మల్లడిఁ బెట్టుచు. 2. చ - వసించు.

చ. ఘనఘనఘోరి కాగణము శంబరవైరిసివంబు లాడఁగా
ఘనయువుజక్కులీఁడు హరిచాపపుగోణముఁ దాల్చి మబ్బుజొం
పములను బెట్టిదంపుటురుమల్గాఱయించుచు మ్రోలనిల్పెఁ బ్రా
వృషికపయఃకణోగ్రవసుధాతలవిస్ఫురదూష్మధూపముల్. 31

[1] శా. ఆలజీమూతకిశోరకుండు నవవర్షాత్రుట్టిగం బాఱ గ
ర్జిలు దంభంబునఁ బోరు వెట్ట గగనశ్రీధాత్రి క్రొమ్మించుచే
తులచే నుగ్గిడ నొల్కు తచ్ఛకలసందోహంబు వర్షోపల
చ్ఛాయన మ్రాలెనొ కానిచోఁ గరఁగునే సంతప్తభూసంగతిన్. 32

మ. స్తనితంబు ల్విని భీతినభ్రతటినీచక్రాంగము ల్బెంకికిం
జనుచోఁ దత్ప్రియనాథజాతహతపర్ణన్యావళీసంధులం
గనఁగో నైన తదీయహేమమయపక్షచ్ఛాయలో నాఁగఁ బై
కొనియె న్వట్టముగాఁగ నెల్లకడలం గ్రొమ్మించు లక్కారునన్. 33

చ. తొలుకరి సంబుదాళి శరధోరణి నింపుచు రాజహంసమం
డలములు నాక్రమించిన నడంకి ధరంగలరాజహంసమం
డలములు [2] క్రౌంచగర్భమునఁ డాఁగె ఘనార్తి జనించె నేని స్త్రీ
సులకవరేగ గే నిజవిధుత్పులఁ జూడక యెట్టివారలున్. 34

చ. హరిహయుఁ డభ్రపీఠిఁ జెలువారెడు పచ్చనివిల్లు పాంథభీ
కరముగ నెత్తి తానసమకాండమహోన్నతిఁ జూప ధాత్రిపై
హరిహయుఁ బోలఁ బూనిన యనంగుఁడు పచ్చనివిల్లు పాంథభీ
కరముగ నెత్తి తానసమకాండమహోన్నతిఁ జూపె నీసునన్. 35

క. ఎచ్చటఁ జూచినఁ బట్టై, పచ్చిక కనుపట్టె ధాత్రి బహుళాంబుదని
ర్యచ్ఛటులజలమయంబున, నచ్చగు శైవాలరేఖ లడరె ననంగన్. 36

[3] చ. సముధికనవ్యలీలల దిశాతతిస్మితముఖఫేనకందళం
బుమియుచు [4] సింధువ్రాల్పటురవోద్ధతి మీఱి నవాగమాలికా
దనుజదమనుపల్పఁగా నవుడు ధాత్రి వహించెఁ గదంబనూతనో
ద్గమకమనీయసూనకళికానికురుంబకళాప్రకాండముల్. 37

చ. వినువనివేల్పులు పతంబుల వ్రేలఁగఁగట్టినరీతి వర్షముల్
జడిగొనసానుచుం గురిశిలంబడి తెక్కలువిచ్చి వజ్జలన్

---

1. ఇదియుఁ బైమూఁడుపద్యములును "ట" లో లేవు. 2. క - క్రౌంచపుగాగమున
3. ట - లో నీపద్యము లేదు. 4. చ - సింధుబాలలురవోద్ధతి.

క. చకచకలు గలుగు నలిమే, చకకచ లిరుగడలఁ గలుగు సౌధశిఖావీ
థికలు గనుఁగొనుచుఁ దత్పుర, నికటోర్వికి వచ్చి యుపవనీభాగమునన్.

సీ. చేమాకు తాళములు బ్బెలఁగరొండులఁ జేతులుంచియందఱ వెక్కిరించికొనుచుఁ
బజ్జఘూపమున డీసుపుఁగోల రాఁజ హస్తముసాఁచి జేగంట చఱచికొనుచుఁ
దల వెూరగిలఁ గ్రుంగి తప్పెట గతికి వాయించి గంగెద్ద నాడించుకొనుచుఁ
నిరుపడిసానుల బెంసి గంటలు మ్రోయ బోడచప్పరముల నాడికొనుచుఁ
త్రోసఁ గూర్చుండి [1]బొంతలు మ్రోలఁ బఱచి
ముదురుబెండల కోరగా ముసుఁగుఁ జేర్చి
పట్టెవంచలు మొఱయించి పాడుకొనుచు
నలరు దాసర్లు వీక్షించి యాక్షణమున. 45

గీ. పంకజేక్షణు ముకున్నైరి భక్తసులభు, వేంకటస్వామి వీక్షించు వేడ్క హృదయ
పద్మమునఁ దొంగలింప సంభ్రమము మెఱసి, యామహీధరమెక్కితినట్టివేళ.

[2]సీ. చెక్కుల మకరికాచిత్రము ల్గరఁగంగఁ గలయనూర్చుచు సారె నిలిచినిలిచి
కటులభారమున వెన్కకువీఁగి యందంద [3]పతులయంసము లూఁతపట్టిపట్టి
తరులనీడలు చేరసరిగి నెచ్చెలివీచు సురటితెమ్మెరలకుఁ జొక్కిచొక్కి
పాదాబ్జములుతో ట్రుపడఁగ జానువులూఁదిమొక్కుడుదగ మెట్లు లెక్కి యెక్కి
పలుదగుబ్బెఁ జెమటలు నదియఁ బయట
లుబ్బనొత్తుచు నుస్సని యూర్చియూర్చి
యలఁతఁ దూలుచు వ్రాలుచు నలఘుమార్గ
జలధిఁ దేలుచు సోలుచు జలజముఖులు. 47

ఉ. మందలుగూడి యెక్కి రతిమంజులవంజులకుంజమంజరీ
బృందమరందబిందులహరీబహురీతిసగీతినందదిం
దిందిరనందితుందిలనుతిప్రతికూజదళిందకందరా
మందసగర్జరీఘుమఘుమధ్వనిజాలము శేషశైలమున్. 48

క. తళతళన వెలుఁగు నిండూ, పలఘులకవనీపతత్ప్రబలబహుబాహరీ
నలయరుఘురీవలయదరీ, నిలయసరీసృపఫణామణిద్యుతు లచటన్ 49

గీ. శబరకాంతాకుచాగ్రసంసక్తగైరి, కాంకసంబులు జనుల నక్షాఁచు నచట
ధాతుకృత్యంబులాట చిత్రంబె వాని, కతనుభావార్కరక్తత్వప్రవృత్తి. 50

1. చ - బట్టలు.   2. ట - లో లేదు,   3. చ - పరులయంసము.

సీ. నాళీకకాసారకేళీకలితసారనాళీకసత్త్వనాళికేర
మాలీనమకరందధూళీనతమిళిందకేళీనవాసంతశాలిరుంద
మేలాలతాలోలదోలాలసమరాళబాలాలఘుముదాలవాలజాల
మాలాపయుగసంగఖేలాపరనశాంగలీలాపరవిహంగజాలరంగ
మమరవరతనుకరతనుసమితసుమిత, మురళికలరవకులరవముఖరశిఖర
తిలకసురుచిరతరుచరగళితలలిత, మధురసఘనసవాళి యమునధరసవాళి. 51

చ. ఉరుతరకందరానిపతితోత్పతదంబుఝరీలసంబులం
బరఁగు నుదగ్రఘోషమయి పాపవినాశన మూనఁగింపు సొం
పరయఁగఁగోరి యేపతితులైన జనాళ్ళను లేగుదెంచినన్
సరసత నూర్ధ్వలోకము లొసంగుదు నేనని తెల్పుకైవడిన్ 52

సీ. కమలాకరతఁ దాను యనుట నింతియకాని గ్రుంకువారికి సిరు లొసఁగఁగలదె
కువలయోద్ధతిఁ దాను గొఱలు నింతియకాని చేరువారికి ధరఁ జేర్పఁగలదె
యుత్పలికలఁ దాను యొప్పు నింతియకాని కనువారికి ముదంబు లునుపఁగలదె
యమృతసంగతిఁ దానుయలరు నింతియకాని తలఁచువారికి ముక్తిఁ దార్పఁగలదె
యితరతీర్థంబు లెందైన నీసరంబు
పగిది నని విశ్వభూజను లొగ్గడ సన్ను
గమునఁ [1]జెన్నొందు స్వామిపుష్కరిణియు చటఁ
దాన మొనరించి యుచితకృత్యములఁ దీర్చి. 53

క. [2]వారాహమూర్తికి నమ, స్కారంబొనరించి సంతసంబునఁ బత్త్యా-
సారంబు వెడలి మురహరు, నారాధింపంగఁ దలఁచి యటఁ జన నెదుటన్.

సీ. ప్రాకారఖచితహీరప్రభాచయదేవతాధనుస్సముచ్చయత్తోరణకంబు
గోపురేంద్రోపలాంకురవిభాజాలయమునారభాంగసహస్రకంబు
కేతుగోమేధికద్యోతసరస్వతీప్రోద్దీప్తశోణసద్భ్రమము
శిఖరాబ్జరాగరోచిఃప్రతానహిరణ్యవాహోత్పలస్నిగ్ధవారిదంబు
భక్తలోకైకశరణంబు పరమపావని, కలుషసంతాపహరణంబు ఘనతపోజన
నిచయసంస్తుతితరణంబు నిర్జరశర, ణంబు వేంకటపతిశరణంబు దనరె. 55

గీ. అట్టిమురవైరినగరికి నరుగుదెంచి, వితతభక్తిఁ బ్రదక్షిణవిధు లొనర్చి
యావరణదేవతల నెల్ల ననుసరించి, గర్భగృహమున కేగి యుత్కంఠ మెఱయ.

1. చ - జెలువొందు. 2. ట - లోనిదియుఁ బైపద్యమును లేవు.

దావలముగా వదరుపూవిలుతుమావులు విరానముల[1] తావులు గుల్కొన్నపుష్పవం
దావితోనబావిచలిరేపులసమీరమధుపావళినకోకిలుల చే నెలుగుచుండెన్.

క. [2]కంజరజఃపింజరతరు, కుంజరటదలిస్వనానుకూలనికుంజ
స్మంజీరపుంజరంజిత, మంజులసింజారవంబు మల్లడిగొనఁగన్. 63

శా. రావే యౌవనమాలికా పొదలు చేరంబోకు నే మల్లికా
యేవే బంతులు పద్మినీ యిచట లేదే తేనె వాసంతికా
తీవల్దూలకు చంద్రికా యలవిరుల్ద్రుంచిరా యంచు న
న్నావీథి న్విహరించు తొయ్యలుల వాక్యంబుల్వినవచ్చెనన్. 64

శా. ఆనాదంబు హ్లాదంబు జాతమున కాస్ఫాలంబుఁ గల్పింప నే
నానానూననికుంజపుంజములలోనం దూలి యాచొప్పటన
మ్లానామందమరందబిందుసతిలీలాందోలలోలాళినీ
గానాధీననవీనసూనలతికాగారాంతరాళంబునన్. 65

శా. కర్ణాంతాయతనేత్రకోణరుచు లగ్రగ్రీవిరాజింప సౌ
వర్ణాంభోజముఁ గేలఁ ద్రిప్పుచు నటన్న్యాసంబులన్ బాలికా
తూర్ణాందోళితడోలికాంతరమునం దూఁగాడు చక్కంతి సౌ
ఖ్యార్ణోరాశిఁ దేలంగఁ గంటి నని యాత్మానందముం జెందుచున్. 66

క. ఏలాయుతడోలాయుత, లీలాపరతరుణీసువిచిత్రనాదోల్లో
భాలాలనఖేలాలన, బాలాలసమాన దృష్టిపథమున నిలుపన్. 67

క. వనితాజనతావినుతా, ననతానురసంబు మలఁచి నను నాపలి భా
వినితాంతావనితాంతా, వనతాంతాపాంగకోణవైఖరి గనుమా. 68

సీ. పలుచని చెమటగుబ్బలు సంటిమోముపైఁ [4]బొలుపుదయ్యెడఁ జక్కఁ ద్రోచి త్రోచి
పిఱుఁదు నూఁగెలలూఁచు తెఱఁగుల కెమ్మోవి మోము సుడిని ల్వెసుటం దుఁబలికి పలికి
చేరు లంటఁగఁ బట్టిచికిలిమట్టెలు మ్రోయ నుర్వరమునిర్తెట్ల నూఁదియూఁది
కౌను నిక్కఁగ నొండుకరమున వేసలి సవరించుచును దిగజాఱిజాఱి [లు
తత్తఱంబునఁ బదములు తడఁబడంగఁ, బిఱుఁదు ద్రెంగుసఁ జిఱుదొడ తెల్పఁ గదిశ
చెదరిచూచుచు నూర్పులు చెదరఁ డగ్గి, యలరు టెలమావి పోనవంపకరిగినిలిచి.

చ. అలరులతేనెఁ [5]గ్రోలి తమి నాడెడు తేఁటుల టెక్కుసోఁకుచే
నలఁతిగఁ బాయ్తెన తలిరాకులసందులఁ జూపజల్లుగాఁ

1. చ - తావులకు. 2. కంజరజఃపింజరతర. 3. ప - గాలించు. 4. ట - బోలఁగ నయ్యెన. 5. ప - గ్రోలుతమి.

బోలయుఁగ నాపయిం జిగురుఁబోఁడి కటాక్షచయంబు నించెఁ బూ
విలు గొని పంచసాయకుఁడు వెంటనె క్రొవ్విరితూపులేయఁగన్. 70

క. మఱుపెట్టి చూచు నేఁగ్ర, మ్మఱుఁజూచినదాఁగుఁ జెంత[1]మగువలఁ గని నా
తెఱఁ గడుగు మగుడఁ గనున, త్తఱి నాకలకంఠి మన్మథవశాకృతి యై. 71

ఉ.[2]ఆయలివేణికి న్లెఱిఁగి యంతట నెచ్చెలి చేరి యక్కటా
యీ యెలనాఁగ యింతతడ వొంటిమెయిం దరుణు ల్వనంబులో
నాయెలులాఁగు వేడుకల నుందురటే మనవారలెల్ల న
ల్లాయెడ నున్నవారు పదమా యని పల్కఁగ నాక్షణంబునన్ 72

గీ. స్వామిసందష్టశశియైన సైంహికేయు, నగ్రమునఁ బూనితనరుమహాబ్దమనఁగఁ
గ్రాంతవంతనితాంతోగ్రకరముతోడఁ, గరము భీకరముగ[3] నొక్కగంధకరటి.

[4]సీ. కటనిస్సృతసుదానగాపీచికణములకరణిఁ బైపైభృంగగణము లడర
గాఢఘూత్కారవేగవిశీర్ణకుంభముక్తారీతి హస్తశీకరము లొలుక
సారధునీసుస్నానసంభిన్నయమునానుకారియై రదయుక్తకరము దనర
సకలజంతుత్రాసభయదంధాయిధూమకేతుస్ఫూర్తితో నెత్తుతోఁక యెసఁగ
నార్తనొ శైలములఁ జెక్కులొరసి కొనుచుఁ
జేఁగటిచి సారె నలుగుచు వేగ నరిగి
తనువు లగలించి యెత్తుచు దరివొడుచుచుఁ
గ్రూరగతిఁ దవ్వసత్త్వసతిఁ జేరుటయును. 74

సీ. తన్నానుసఘసాంద్రత్వవిస్ఫూర్తికి హంసకప్రచయ మందంద తూల
నామహోదారసారంగంబురవళికిఁ గర్ణికాజాలంబు కంపమొందఁ
దద్దుస్తకుంభినీఘనమూర్ఛిదుర్గదోగ్రతకు రత్నాకరరశన దలఁక
నాస్తమాతంగభీమస్ఫూర్తికి నగ్రహారనాయకము లవిసి చెదరఁ
గాను లసియాడ జఘనము ల్గదలఁ బాద
పద్మములు దొట్రుపడఁ [6]గచభరము లులియ
నూపురములు సంజడింపంగ నుత్పలాక్షు
[7]లెడ నెడన పాఱి పఱవ నయ్యిందుముఖియు. 75

---

1. చ - ట - మగువఁబిలిచి. 2. చ - ఆయెలనాఁగ. 3. ట - వచ్చెగంధకరటి.
4. ట - లో సీసపద్యము లేదు. 5. చ - వేగక్షురత్కేంఘ్ర. 6. చ - గచభరములులియ.
7. చ - ఎడనెడఁబఱవసంతె.

చ. ననుఁగని మున్ను గొంత దమినాటఁగఁ జూచుటఁజేసి లాఁతివాఁ
డనక మృణాలనాళమృదుహస్తము లెంతయుఁ జాఁచి కౌఁగిట
న్నినిచి యొకింతయుం దెలుపనేరనితత్తఱపాటుతోడఁ గో
పనమదహస్తి హస్తి యని పల్కెఁ దలంకుదొలంకుపల్కులన్. 76

ఉ. ఆపువుఁబోఁడి యీగతి భయంబునఁ గౌఁగిటఁజొచ్చి పల్క నే
నేపరిపాటియైనవగ నెంచక కేవలతన్మయానుమో
దోపచయంబుఁ గంటి మఱి యున్నదె ధాత్రి హఠాదవాప్తయో
షాపరిరంభసంభ్రమజసౌఖ్యముకంటెఁ బ్రమోద మేరికిన్. 77

క. అడ లెడలఁబలికి యప్పుడు, జడియకు మని సారె వెన్నుఁజఱచి యెలమి న
ప్పడఁతుక నెత్తికొని రయం, బడరఁగ నేనొక్కకడకు నరుగుచు నెదుటన్.

ఉ. వామనతీర్థతీర మనివారణవారణవారణక్షణే
చ్ఛామహితప్రచార మురుసారససారససారసంభ్రమో
ద్దామతరంగవారము సదానవదానవదానవర్జిత
శ్యామలమూర్త్యుదారము శుభావనభావనభావనారమున్. 79

క. కని యుత్కలికోజ్జ్వలమై, ఘనరససంభరితమై ప్రకంపనయుతమై
వనితామణిచిత్తముగతిఁ, దనరెడు నాసరసిఁ దఱిసి తత్తీరమునన్. 80

సీ. పయినాడుతుమ్మెదపదువు క్రొంబాగలతోఁ బాటలకుసుమదీపములు వెలుఁగ
నానందనిభృతకీరాదిచిత్రములతోఁ బాయనిచిగురాకుపటము లెసఁగ
వ్రాలెడుగెలబోదెకీలుదామరలతో స్థూలరంభాతరుస్థూణ లలర
సకృదాగతార్కభాస్వర్ణశృంఖలలతో నలతెలిదీవయుయ్యేలలుదనర
నరుణకాంతాగ్నిపతితసితాభ్రధూపములు[1] వొంచునొక్కపొదరింటలలనఁదార్చి
కురులెనయదువ్వి చెమటార్చి సరులుదీర్చి, బుజ్జగించి ముదంబునఁబొదలునపుడు.

ఉ.[2] ఆగజరాజమన్యవిపినాంతవశావశచిత్తమై నిజే
చ్ఛాగతి నేగఁ దత్సఖులు చంద్రముఖి న్వెదకంగ వచ్చి త
ద్భాగమునందుఁ గన్గొని ముదంబునఁ దోడ్కొనిపోవ నావనా
భోగమునందు నిల్వ కెడఁబొక్కుచు నంగజుబారిఁ జిక్కుచున్. 82

సీ. తలిరుటాకులమీఁద నొలుకుతేనెలఁజూచి పల్లవాధరి లేఁతపలుకుఁదలఁచి
మెట్టుతమ్ములమీఁద మొలఁగుతేఁటులఁజూచి సరసిజవదన ముంగురులుదలఁచి

1. చ - నహురు. 2. చ - అగజరాజుమధ్యవిపినాంతవశావశచిత్తమై.

యావనపవిమియమీఁద నలరుక్రొవ్విరిఁజూచి నతలతామధ్యమనాభిఁ దలఁచి
పువ్వుగుత్తులమీఁదఁ బొలయుపుప్పొడిఁజూచి గుచ్ఛవక్షోజపైకొంగుఁదలఁచి
తగులు నెగులును దిగులునుదత్తఱంబు, సలుకునులుకునుదలఁకును నాదరంబు
మనమునజనింపఁ దద్వనీమధ్యసీమ, నంగనామణి వెదకి కానంగలేక. 83

ఉ. వేగిరపాటుతో నపుడు వెల్వడి యొయ్యన శేషభూమిభృ
ద్భాగము డిగ్గి యాకులత దార్కొనుచిత్తముతోడఁ గుందుచున్
దోఁగెదఁగూడి యధ్వగులు దోడ్కొనివచ్చిననప్పుడేను ని
న్నీగుడిలోనఁ గాంచితిఁ జెలి యని యంతయుఁ జెప్పి వెండియున్ 84

సీ. గాజుకుప్పెలవంటి గబ్బిగుబ్బలుగోర నంటిన ప్రీలుఁగా యనుచుఁ గొంకి
దిరిసెనపూవంటి తిన్ననిమ్మై కేలనలమిన వాడుఁగా యనుచుఁ గొంకి
కంచుచక్కెరవంటి కమ్మనివాతెఱ నానినఁగరఁగుఁగా యనుచుఁ గొంకి
చికిలియద్దమువంటి చిన్నినెమ్మోముమూర్పు లడరినఁ గందుఁగాయనుచుఁ గొంకి
తమకు నెలకూన లునుపక తనివితీఱఁ, గౌఁగిలింపక కెంపులు గలుగ నిడక
నలరుపలపులు క్రొ౯ కందండకనుచు, నూరకేమోనపోయితి నోవయస్య.

క. అని యాద్యంతంబేర్పడఁ, దనవృత్తాంతంబుఁ దెలుపఁ దమ్ముఁడుఁ దానున్
జననాథమౌళి యొండొరు, ననునయమునఁ గలఁకఁ దేఱునంతటి లోనన్.

## సాయంకాలవర్ణనము.

మ. కలయ న్నీడలు తూర్పునాఁగె పతిను ల్కంజాతముల్వ్రాసెఁ గొం
దలమందెన్, కపజక్కవ ల్తరణికాంతశ్రేణి చల్లారె ఖిం
న్నులనేగం బులుఁగు ల్చకోరికల ఱంతు ల్గాంత దీపించె ను
త్పలము ల్విచ్చె నినుండు పశ్చిమకుభృద్భాగంబున న్నిల్వఁగన్. 87

క. జలరాశి యను నెడుబోయల, తలవారఁ జరమాద్రిపేరి తడికమువునన్
నిలిచి కిరణాంపుటురి గో, లలఁ దిగిచెఁ బతంగమండలంబ బవ్వేళన్. 88

సీ. తొలుదొల్త నినునెచ్చె నలనుకోలాహలం బామీఁదఁదోఁచెవాద్యములరవళి
తమనాంగ నెఱిఁజూపె దంతిఘీంకారంబు నంతటఁ బులకించె నశ్వహేష
పిమ్మటఁ దలమయ్యెఁ బృథుకంచుకధ్వను లావెన్కఁ దనరెఁ దొయ్యలులపాట
పెద్ద మ్రోసెను వారభీరునూపురరుతు లాపైనెగడె వయస్యానులాప
మప్పుడాయూదవాస్సయు లారవంబు, సారెనాలించి లగ్నమానసన్నమైన
ధరణినాథుండుతనయునిందిరకుమ్రొక్క, ననిచెనోయనిభావింపనాక్షణమున.

శా. నాళీకాంబకు సారె దూఱుకొనుచు న్మాత్రాల కేతెంచి [1]నీ.
లీలాగేల వహింప నేటి కకటా యేఁ జెల్ల నీసాహసం
బేలా పూనెద నన్ను లాఁతి [2]నడె నీయిష్టంబుఁ జేకూర్చెదం
జాలుం జాలుఁ గలంక మాను మని యాశాచక్రవీక్షించినన్. 97

క. గ్రన్నన సగ్రహచరిత్రిని, దన్మోహితోఁ గూడివచ్చు తనసాయకునిన్
సన్నాదజాఘఁ దేలుచు, [3]నమ్ముద్రియ చూచి యువతి తానన దైనన్. 98

ఉ. కోమలి నీదు నెమ్మనము కోర్కి ఘటిల్లఁ గదమ్మ భూవర
గ్రామణి నీమనోంబుజము కాంక్షిత మబ్బెఁ గదయ్య యంచు ల
క్ష్మ్యన్యగనేత్ర యొండొరులచిత్తము రంజిలఁబల్కి భక్తర
క్తామహాసియుక్ష్మిష్టి నలసాత్యకిపుత్రుని జూచి నెమ్మితోన్. 99

క. ఓవిజయలోల యిప్పుడ, తావకహృద్యయూజ్యవాంఛితము సేకుఱెఁ జం
ద్రావలితో నలనదని పూ, ర్వోన్నస్థితి నుండె నంబుజాలయ యంతన్. 100

చ. చతురతరాంతరంగుఁ డయి సాత్యకిసూనుఁడు వల్కె నన్న యీ
యుతిపయు నీవుఁ గిన్నరవరాత్మమనోజ్ఞరథంబుచేత ను
[4]ద్ధృతగతి నేగి పేటపటి రుద్రగృహంబున నుండు మేఁ దద
ర్పితమనసావసానపకళ పింఛుని బిక్కరి నైష్ఠికభోస్నతిన్. 101

ఉ. పాలకి నెక్కి యేగెద నృపాలనిశాంతముఁ జేరఁ బోవుచోఁ
బాల నపృశ్యవిద్య యమి బాటనెడ గ్రమ్మఱ మిమ్ముఁ జేరెదన్
శ్రీలలనాప్రసాదమునఁ జింతిలుకార్యము సంఘటించె నిం
కేల విలంబ మంచు నలయిప్పర వీడ్కొని సంభ్రమంబునన్. 102

క. కాంతాకారముఁ గైకొని, యంతర్గేహంబు వెడలి యుల్లసదెలునల్
ప్రాంతమునఁ గొల్వఁ బాలకి, వింతయు ముదమొప్ప నెక్కి యేగెడు వేళన్.

విజయాలోలుఁడు పద్మినితోఁ భాషించుట.

ఉ. అంత నవంతిభూపతి యనూనసువిందుసిపుత్రి పద్మినీ
కాంత తదంబురాశకుఁ గాదిలినెచ్చెలి గానఁ జెంగటన్
నంతన మొప్ప నేగుచుఁ బ్రసంగనవంబునఁ బల్కరించి యే
కాంతమున న్నృపాలసుత యంచు నె [5]సాత్యకిపట్టి కిట్లనున్. 104

1. చ - ట - లీలాగాత్రవహింప నేటికకటా యేఁగ్లు. 2. చ - వడె. 3. చ - నమ్ముది త ము. 4. బురుపుసపటి. 5. ఛ - సాత్యకిసూను కిట్లనున్.

[1]చ. చెలియ వృథావిచారమునఁ జిత్తము నొంపఁగనేల యిట్టు లా
విలగతి నున్కి మేలె శుభవేళ మదిం గలవంత యేరికిన్
[2]దెలియక యుండు టొప్పదె సతీమణికి న్నతియెవ్వ రేని యుం
గలకల నవ్వకుందురెటె కామిని నీచరితంబుఁ గాంచినన్. 105

చ. సరసిజపత్రనేత్ర వెడచందము మానుము నీదుకోరికల్
తరళిక తెల్ప వింటి నిది ధర్మమె కూరిమి తల్లిదండ్రు లే
వరున కొసంగిన [3]న్నుతలు వాఁడె విభుం డని [4]భక్తియుక్తలై
పరిణయ మాటగాక తమభావమునం గలవాఁడు గల్గునే. 106

ఉ. ఇన్నియుఁ బల్కనేల వినవే నిను నొక్కతె దూఱనేటికిన్
మున్ను మదీయచిత్త మొకమోహనరూపవిలాసధన్యుపైఁ
గన్నవిరాళిఁ జిక్కి రతికాంతుని బారికి నగ్గమయ్యె నో
కిన్నరకంఠి నీకు నెఱిఁగించెద నత్తెఱఁ గాలకింపుమీ. 107

సీ. ఒక్కనాఁ డే వార్షికోత్సవంబునఁ బొల్చు హరిఁగొల్చుటకు శేషగిరికి నేగి
యచటివినోదంబు లరయుచు నెచ్చెలుల్ గొలువఁగాఁ దుంబురుకోనఁ జేరి
[5]యొరపైన యాచెంత గురివెందపొదరిండ్ల లీల దోలాకేళిఁ దేలుచుండి
గ్రక్కున వత్తెఱఁ గమ్మవిల్తునిగెల్వఁ జాలిన యొక్కరాచూలిఁ గాంచి
పరమసమ్మోదమును జెంది మరలియేగు
వేళ మదహస్తిఁ గనుఁగొని వెఱచి యతని
నలమికొని యుండఁగా బోటు [6]లంతవచ్చి
పిలుచుటయుఁ బాసి వచ్చితి నలరుఁబోఁడి. 108

గీ. నాఁటనుండియు నతని గానంగలేక
చింతఁ గుందెద నన మహీకాంతసుతుఁడు
బాపురే యగు నిదియ యూ [7]పద్మనయన
యనుచుఁ గృతనిశ్చయుం డయి యబల కనియె. 109

క. ఆకాంతుఁ డిపుడు వచ్చినఁ, గైకొందువె యనినఁ దరుణి కనుఁగవ నశ్రుల్
వ్యాకీర్ణముగా గద్గది, కాకులనిస్వనముతోడ నలసాలసయై. 110

ఉ. అక్కట చాలు నన్ను నిఁక నాఱడి వెట్టకు నమ్మ యాతనిం
జిక్కని కౌఁగిటన్ బిగియఁ జేర్పఁ బురాకృతపుణ్యవాసనం

1. ట - లో నీపద్యము లేదు. 2. చ - దెలుపక. 3. చ - ట - సతులు. 4. చ-ట- భక్తియుక్తమై. 5. చ - ట - గుబురైన. 6. చ - ట - లరయవచ్చి. 7. చ - పద్మగంధి.

దక్క మఱి త్రేల కల్గు ననిన న్విని దాయఁగఁ బిల్చి మక్కువన్
గ్రక్కున భీరువేషముఁ దెరల్చి నిజాకృతిఁ[1] బూని యుల్లనన్. 111

గీ. పల్లకీగాలి చెఱఁగు లోపలకుఁ దిగిచి, సెలఁత నీకనుఁగొన్నట్టి నృపసుతుండు
నేనసు మ్మని గుఱుతు లెన్నేని నొడివి, తన తెఱంగుఁ గుముదినివిధమ్ముఁ దెలిపి.

క. ఆసనితయు నచ్చటకుం, దానచ్చినవిధము దెల్పినఁ బ్రమోదమునన్
భూవల్లభ్యుఁ డిఁక మనముం, బోవలయు నటంచుఁ బల్కెఁ బొదలినలజ్జన్.

[2]ఉ. వేనగ వొప్పఁ జేయునది లేక సతానసద్యైన నామహీ
జానియు నోలతాంగి మొగసాలను వెల్వడి నీవునిల్వు మే
లోనికి నేగి యొల్లయిన లోఁగక వెల్వడిపత్తు నంచు డెం
దానఁ దొలంకు సంతసముసం జెలరేఁగుచుఁ బోయి యచ్చటన్. 114

[3]చ. మగఁటిమిమీఱ సాత్యకికుమారుఁ డదృశ్యతఁ బూని పాలకిం
డిగి మొగసాల వెల్వడి సడిం బ్రియుఁ దోడ్కొని సర్వదాతటిన్
నగతనయాధినాథభవనంబునకుం జని కాంచె నందుము
న్నగ రథమెక్కి తస్వరతనూజుఁడుఁ దెచ్చిన యన్న సయ్యెడన్. 115

మ. తరుఁణు లెవ్వఁడి యిట్లు పోవుటయు సంతాపంబున న్భీమభూ
వరపుత్త్రుం డరయించి కానక కృథావ్యగ్రాత్ముఁడై యుండఁ ద
త్పరణిం గన్గొనియాంతఃణంబ దముఘోషక్షోణిభృత్పుత్త్రుఁడున్
మరలెఁ బుత్త్రునితోడ సైన్యములతో మాహిష్మతిం జేరఁగన్. 116

ఉ. అప్పుడు కిన్నరాద్రిశిశతాంగలలామమునం గుతూహలం
బొప్పఁగ నెక్కి యయ్యువతియుగ్మముతో యదువంశవల్లభుల్
చప్పుడుసేయ కేగి రతిసాంద్రవనీనిచయంబు లేర్లు బల్
తిప్పలు పక్కణంబు లనలీలల దాఁటి మనోరయంబునన్. 117

క. అత్తఱి నారల మనములఁ, దత్తఱము శమించరీతిఁ దమ మడఁగె మదిం
గ్రొత్తగ ననురాగము చిగు, రొత్తుగతిఁ బురోనురాగ ముజ్జ్వల మయ్యెన్.

చ. సకలజగన్నివాసుఁ డగుశౌరికుమారుని పెండ్లి యంచుఁ బ
ఱికులరవంబు చే నెఱుఁగఁ జేసి కరస్ఫురణన్[4] ధరేశపం
క్తికి నయశాంకుచాపుశతతిం దగ నీఁదొలుగట్టుటాజ్ఞ గై
రికమయపాత్ర మెత్తె నన తెక్కలగొంగ తనర్చెఁ దూర్పునన్. 119

---

1. చ - దెల్పియుల్లనన్. ట - బూనియిట్లనున్. 2. చ - ట - లో నీపద్యము లేదు.
3. చ - లో నీపద్యమును దీనితరువాతి పద్యమును లేవు. 4. చ - దిగీశపఙ్క్తికి.

గీ. అట్టియెడఁ గాల్యకృత్యంబు లర్హగతిని, సల్పి యాయాదవవీరసంఘము లమంద
రథరయంబున నలసినరాజముఖుల, నారయించుచు నేగుచో నొక్కచోట.

[1]సీ. మును గురంగములఁ గోసినరచ్చచట్రాలఁ బేటిన పచ్చికస్తురివలపుఁ
బులితోళ్లపై నారఁబోసిన రక్తార్ద్రకరిశిరోముక్తాళిఁ గనుపుకెంపు
వరుసతో ముంగిళ్ల గులువిజ్జు వెన్నలు గరఁగింపఁబోవమొదుగ నూఁదావి
కలిగిన స్నానెఱిజల్లికప్పుపందిళ్లపై నెండెడు నిప్పుపూసిందుగబ్బు
[2]సముదశబరప్రణీతసంకుసుదసార, చిక్కగాంబై యుసుసు నొక్క పక్కణంబుఁ
జేరి తదధీశుఁ డొసఁగు సత్కారములకు, నలరి యగుసుందరంబున నధివసించి.

ద్వారవతికిఁ జంద్రభానుఁడు శబరుని బంపుట.

ఉ. మంతనమాడి యాదవకుమారకు లచ్చట నుండ నాని స
త్రాంతగతిప్రసిద్ధు నొక[3] శాబరునిం బిలిపించి యందు వృ
త్తాంతము తేటతెల్లముగ సంతయు వ్రాసిన చిన్నపత్రముల్
సంతసమొప్పఁ జేతికి నొసంగి హరిం గనఁబొమ్ము నావుడున్. 122

[4]సీ. హృదయప్రమోదవారిధిబుద్బుదంబుల గతి మేనఁ బులకాంబు[5]కళికలొల్క
నతితీవ్రగతి కేన యని బొక్కె మొత్తు తెలంగున వట్టిచలంగు నిగుడ
దృఢతరస్వితకు ధాత్రియొసంగు కావునా ననుగుసఁ బొందునుపు లతిశయిల్లఁ
దనుఁగూడవచ్చు గంధవహాంబు బంధించి గెలుతునన్నతి మున్ను ... నానఁ
బార్శ్వముల సాకొనల్లాడు పంచెచ్చు, గోనసాంగులు వేగానుకూలఘుటిత
విపుల[6]పక్షద్వయస్ఫూర్తి వెలయుచుండ, రయసముద్ధతి మీఱి ద్వారవతిఁ జేరి.

మ. నడువీథి న్నిడిగాలఁ బానరుగుచుండన్ స్వస్థయాంబంటి య
య్యెడఁ బౌరుల్గని యాడనాడఁ గుముక్కై యేవార్త యేవార్త యం
చడుగం బల్కుఁ మేలుసుద్ది యని[7] యత్యంతంబుగాఁ బల్కుచున్
వడిఁ బద్మాక్షుహజారముం గదియ నానందంబుతోఁ బోవుచున్. 124

సీ. కూచిసేయింపఁగాఁజూచె నందమొ యేల వైదుష్యఁ దెలుంగఁడే శార్ఙ్గలతిక
వెలిగుడారంబుల నిలిపెనందమొ యేల బాణుఁ దెలుంగఁడే బంధురగద
దాడివెట్టుటకునై తలఁచె నందమొ యేల నరకుఁ దెలుంగఁడే నందకంబు
గడిదుర్గములమీఁద విడిసె నందమొ యేల సాళ్వుఁ దెలుంగఁడే చక్రధార

1. ట - ఈపద్యము లేదు. 2. చ - సమరశబరీప్రణీత. 3. చ - శైబరునిం. 4. ఇది మొదలుగ మూఁడుపద్యములకు ట లో «వాఁడునుంజని» యనువచనము గలదు. 5. చ - కళిక లమర. 6. చ - పక్షద్వయంబున. 7. చ - సువ్యక్తంబుగా.

యిం దొకటియైనఁ గానరాదేమొ కాని
పూనుకొని వేఱుదెల్పెడు వీనితెఱఁగు
లనుచుఁ దనుఁజూచి ముదిమంత్రు లాడుకొనఁగఁ
దనరుకక్ష్యాంతరంబుల దాఁటి యేగి. 125

## కృష్ణుఁడు చంద్రభానున కెదురుచనుట.

ఉ. కమలదళాయతాక్షుసముఖంబునకుం జని మ్రోల విన్నప
త్రము లిడఁ దత్కుమారలిఖితస్వశుభోత్తరవాచికంబులం
బ్రమదముగాంచి వానికి నపారధనంబు లొసంగి యారమా
రమణుఁడు పుత్త్రదర్శనపరత్వర నప్పుడ తేజి నెక్కినన్. 126

సీ. విడిగాల శౌరితత్తడివెన్క నేతెంచె సగతులఁ జేఁబూని చారుచంద్రుఁ
డందంబుగాఁగ నైదాఱుగుఱ్ఱములతోఁ గదలె వేగమున సంకర్షణుండు
వడిఁ దెమ్ము తెమ్మని యడిదమ్ముఁ గైకొని పరువున నరిగె జాంబవతిపట్టి
పడివాగె హరిమ్రోలఁ బట్టి కీరపతాణి నెక్కి ముంగల నేగెఁ జక్కనయ్య
వెలుపటిహజారమున నుండి వెలిసె వెలిసె, చేతబెత్తంబుఁ గైకొని సేననెల్ల
వెడలుమని చెప్పి పంపుచు వెన్నునెదుట, హరిగనీడల నడచె [1]గదానుజుండు.

మ. హరి యిట్లేగినమాట వింట తడ వాత్మావాసము ల్వెల్వడం
ద్వరసాత్మ్రాణుల స్వాదు లడ్డముగఁ ద్రోవం బట్టి రా నెక్కి యొం
డొరుల న్మీఱ హుటాహుటిం గదలి రత్యుత్కంఠ నల్లుంద్రు సో
దరులుం బుత్త్రులు చేర నచ్యుతుని గోత్రాపాంసువుల్లమ్మఁగన్. 127

[2]సీ. ఎదురైనవారల నేత్రోవ హరియేగె నని సారె కడుగుచు నరుగువారు
గ్రక్కునవీథులఁగన్గొనికొలువుమ్రొక్కులుమ్రొక్కివెనువెంట[3]వెలలువారుఁ
దమవారిఁ బొడఁగన్న దట్టికైదువులు గైకొని తెమ్మనుచుఁ గూడఁ [4]జనెడువారు
రాజేగెనేమొ రారా నీవు రమ్మని యొండొరుఁ బిలుచుచు నుఱుకువారుఁ
ద్రాళ్లువైవక దంతులఁ దఱుమువారు, సిడెము లెత్తక రథముల నడపువారుఁ
బల్లణింపక హయములఁ బఱపువారు, నైనబలములు తోఁకచాలగుచుఁ గదలి.

క. చనఁ జన నటఁ దోడ్తో వెను, కొని [5]కోట్లుం గొండలగుచుఁ గూడుచు నడచెన్
వనమాలి వెంట వాద్య, ధ్వనిఁ గులశైలములు వడఁక ధర యూటాడన్.

---

1. చ - బలానుజుండు.  2. ట - లో సీపద్యమును దీని క్రిందిపద్యమును లేవు.
3. చ - కూడువారు.  4. చ - గునుకువారు.  5. చ - కోటులు కొండలగుచు.

శా. శ్రీకాంతుం డిటు లేగుదెంచె నని సంప్రీతిన్ హితుల్ దెల్ప ను
ల్లోకానందముతోడ నావిజయలోలుం గూడి సత్యాసుతుం
డాకంజాక్షు నెదుర్కొన [1] న్వెడలి డాయన్వచ్చెఁ దో శాంబరా
నీకంబు ల్బలువంకలన్ బలసి యున్నిద్రస్థితిం గొల్వఁగన్. 131

ఉ. వచ్చి వినీతితో దనుజవైరికిఁ జాఁగిలి మ్రొక్కి సీరికిం
బచ్చనివింటివానికి నమస్కరణం బొనరించి భక్తితో
నచ్చట నున్న పెద్దలపదాంబురుహంబుల వ్రాల సంబళుల్
గ్రుచ్చియుఁ గౌఁగిలించికొని కూరిమి దీవన లిచ్చి రయ్యెడన్. 132

మ. నతరక్షానిధిశౌరి పక్కణము చెంత న్వేలముల్ డించి యు
న్నతదివ్యాంబరమండపాంతరమున న్సద్బాంధవశ్రేణితో
నతులస్ఫూర్తి వసింపఁ దత్సకలవృత్తాంతంబు చారు ప్రయో
ద్ధతులై తెల్పిన రుక్మబాహుఁ డనువిందాన్వితుఁడై చెచ్చెరన్. 133

క. ప్రియబాంధవవర్గముతోఁ, బయనం బై వచ్చి దనుజభంజను బలదే
వయుతుం బొడఁగని మ్రొక్కుచు, నయమంజులఫణితి నాజనార్దనుతోడన్.

ఉ. ఏమఖిలంబునుం దెలిసి యిచ్చటికిం జనుదెంచినార మిం
కేమియు నానతీవలవ దిప్పుడు మామన వాలకించి దే
వా మముఁ బ్రోవు పుత్రులవివాహ మొనర్పఁగ నేగుదెమ్ము గా
రామడర న్మదీయనగరంబున కే మిట లాఁతివారమే. 135

[2] క. అని [3] నయము నెనరు దొరలం, దనకును విన్నప మొనర్చు ధరణీశుల ను
న్ననఁ జూచి యపుడు సాత్యకిఁ, [4] గనుఁగొని యాతండు నట్లు కాఁ దెలుపుటయున్.

గీ. సకలసేనలు గొలువ నాశార్ఙ్గపాణి, రాజసంబునఁ గుండినరాజధాని
డాయవచ్చినమును మున్న పోయి రుక్మ, బాహుఁడు బిడారములు నులుపాలమర్చి.

[5] సీ. అపరంజివాకిళ్ల ననఁటులో యిడుపుల నెసఁగుపచ్చలడాలో యెఱుఁగరాదు
బంగారుటిండ్ల దీపంబులో గోడలవెలుఁగుకెంపులడాలో తెలియరాదు
జాళువాలోవలజల్లులో కొణిగెల నలరువజ్రపుడాలో యరయరాదు
పసిఁడిమోవరుల ధూపంబులో సోరణగండ్లనీలపుడాలో కానరాదు
మేలిమిహజారముల వన్నెమేలుకట్లొ, చిత్రమణికాంతులో విభజింపరాదు
అనఁగఁ జనునొక్కనగరున [6] నప్పుడులీల, వనజనాభుని విడియించె మనుజభర్త.

1. చ-దలఁచి. 2. ట-లో నీపద్యమునకుమాఱుగ "అనిన" అను వచనము గలదు. 3. చ-ప్రియము. 4. చ-గనుఁగొననాతండునట్లుకానిమ్మనియెన్. 5. ట-లో లేదు. 6. చ-నధికలీల.

చ. కళగలజీవరత్నములు గంధపుబ్రూఁకులు పంచవన్నెచి
ల్కులు పయిగోవకస్తురి కళాచి పునుంగు జవాది చాఁదుప
ట్టెలు పలువన్నెకోకలు పటీరము నిండ మెఱుంగుజాళువా
పలకలు నించియున్న యులుపాళ్లు పారఁగ నాదరించుచున్. 139

[1]క. వసమాలి యానృపులు వెను, కొనిరా మోదమునఁ గొలువుకూటంబునకుం
జని కూరుచుండి వారల, కనియె స్మందస్మితంబు లంకూరింపన్. 140

క. వైవాహికలగ్న మొకటి, యీవేళం గలుగునేమొ యిప్పుడ తెలియం
గావలయు ముహూర్తజ్ఞుల, రావింపుఁ డటన్న వారు రప్పించుటయున్. 141

క. బ్రాహ్మణులు కొంద ఱపుడా, జిహ్మగపర్యంకుని గదిసిరి "యోవైతాం
బ్రహ్మణా" యనుమంత్రమున న, జిహ్మాతమంత్రాక్షతములు శిరముననిడుచున్.

క. వారలకున్ భక్తి నమ, స్కారం బొనరించి గరుడగమనుఁడు మీరీ
చేయవ లగ్నమ్మొకటి వి, చారింపుఁ డటన్న వారు సంతసమొనఁగన్. 143

క. విని కొంతతడవు తమనె, మ్మనముల నూహించి నేఁడు మా పౌకలగ్నం
బనువైనది గల దది యో, వనజేక్షణ దంపతులకు వాంఛిత మొసఁగున్.

క. అని తనకుఁ దెలుప విప్రులఁ, బనిచిన ననువిందరుక్మబాహులు హరిచే
ననుమతులై వేగమ తమ, తనయులఁ దోడ్కొనుచుఁ జనిరి తత్సమయమునన్.

## వైవాహికయత్నము.

సీ. కడాపునీలాలగోడలమృగనాభికోదారచర్చ సహోక్తిఁ దెలుపఁ
గలువడాల్గలకెంపుమళిగెల మాల్యరక్తోత్పలంబులు విశేషోక్తిఁ దెలుప
వరుస నూత్రపురాల[2]వలలెత్తుసౌధవీథుల కేతుపటము లత్యుక్తిఁ దెలుపఁ
బుష్యరాగపుహర్మ్యములమీఁదికలశంపుటుదిరిచాయలు స్వభావోక్తిఁ దెలుప
నధికృతులు రుక్మబాహుని యాజ్ఞ రాజ, ధానిఁ గైసేసి రప్పు డెంతయుఁ దదీయ
లక్ష్మిమీనఁ జతుర్విధాలంకృతులను, దానుహరిఁ గాంచువేడుకఁ బూనెననఁగ.

ఉ. కంసవిరోధి యానతిని గర్గమునిప్రముఖు “తదేవల
గ్నం సుదినం తదేవ” యనఁగా శుభకాంచనపీఠనుంచి యు
క్తంసముఖాచ్ఛభూషణకదంబ మెసల్చి మృదంగకాహళీ
సంపదుదారనాదము లెసంగ సతుల్కవగూడి పాడఁగన్. 147

1. ట-లో నీపద్యము లేదు. 2. చ - తెరలెత్తు.

మ. వలయవ్రాతము పైకిఁ ద్రోఁచి పదము ల్పాటంబుగా [1]నూఁది తే
జిలుఁగుం బయ్యెదకొంగుఁ జెక్కి యలఁతం జేమార్చుచు న్నమ్రయై
బెళుకుంగౌను గుఱు ల్చలింపఁగ సరుల్పింపిళ్లుగూయం దమిం
దలయంటెం జెలి యోర్తు వేడ్కనఱగంటం జొక్కురాచూలికిన్. 148

ఉ. కెలన నొకర్తు బంగరపు గిన్నియఁ జందన మూని నిల్వఁగాఁ
గలయఁగఁ బెన్నెఱు ల్పులిమి గంధము పైఁ జిలికించి గోరుము
క్కుల దిగదువ్వి చేఁ బిడిచి కోమలి యోర్తు కరాంబుజద్వయీ
లలితసువర్ణకంకణకలధ్వని వీనులవిందు సేయఁగన్. 149

మ. తళుకున్బయ్యెద జాఱఁ జన్నుఁగవచెంత న్నించుడాలీను కు
చ్చెల కొంగు ల్గదియించి తంబుగలఁ జేచేఁ గొంద ఱందీ నొడల్
కలయ న్వేపథువూన నూర్పు లడరంగా వేడ్కతో నొక్కనె
చ్చెలి కంసాంతకసూతికిన్ జలకమార్చెన్ [2]గాంగతోయంబులన్. 150

తే. కడకొంగు ముడిచి తలపా, వడ యొకచెలి చుట్టె నొక్కవనిత తనువునం
దడియొత్తెఁ జలువదుప్పటి, పడఁతియొకతె యొసఁగె నాన్నృపాలాగ్రణికిన్.

ఉ. ఒక్కలతాంగి కైయొసఁగె నొక్కవధూటి కిరీటిపచ్చతా
ముక్కలిపీఁటవెట్టె నొకముద్దియ కుంచియవైచె వెండ్రుకల్
చిక్కడలించె నొక్కకలశీకుచ తొయ్యలి యోర్తు జాళువా
చెక్కని బెజ్జపున్బరణిసంపుల ధూపముగొల్పె మెల్పునన్. 152

సీ. కుఱుచకచంబులు గూడఁగూడఁగదువ్వియొఱపుగా సిగవైచె నొకవధూటి
పలుదెఱంగులకదంబపుఁబూవుచెత్తులు చుట్టెఁ జుట్టుగ నొక్కసూనగంధి
జీవరత్నంబులు చెక్కినసంపెంగ[3]మొగ్గతాయెతు లొక్కముదితచేర్చెఁ
బన్నీటఁ బదనైనపైగోవకస్తూరితిలక మొయ్యన నొక్కతెఱవ దీర్చెఁ
వెలఁది యొక్కతె కుంకుమకలప మలఁదెఁ
దరుణి యొక్కతె గొజ్జంగినురటి విసరె
మగువ యొక్కతె జిలుఁగుధూమ్రంబుఁ జిలికె
మవిద యొక్కతె నునుసోఁగయొంటు లిడియె. 153

క. చెలియొకతె పచ్చవట్టెల్, బలసిన బిదుపోలె సరిగెపనిపై కానీ
చలువయఱచట్టఁదొడిఁగెన్, సలలితగతి నొకతె కడకళలుముడివైచెన్. 154

1. క - పొట్టుచున్. 2. చ - గంధతోయంబు. 3. చ - తాయిత మొకతెవింతగనమర్చె.

గనపబంగరుశిలాకను జాజువట్టించు పగిది నొక్కతె మేనఁ బసుపుఁబూసెఁ
నెలదీవెఁ బాఁదుస నిలిపి నీరార్చులాగున నొక్కతె మనుజ్జన మొనర్చె
[1] నెలమిఁ గుముదిని నూరార్చ వలసి జలుఁగుఁ
జంద్రికలఁ జేర్చుగతినొర్తు చలువ లొసఁగెఁ
గలికిపురినెమ్మినిడుసోఁగ గఱులునిపుడు
చెలువున నొకర్తుపెన్నెఱు ల్చిక్కువుచ్చె. 163

క. తెలిగను నెలపులుఁగుంబిలు, కలుపొదలఁ మెతఁ[2]మారిపఁగా నడుమం గ్రొ
న్నెలమొలకనిలిపెనో యనఁ, దిలకము కపురమున నొకతె దీర్చెం జెలికిన్.

క. లీలావతి యొకతె శ్రుతి, శ్రీలు సుముఖవిధుని కెత్తఁ జేకొనునునుము
త్యాలారతులో యనఁగా, బాలికకు మెఱుంగుఁగమ్మపంజులు చేర్చెన్. 165

క. మెలపున నిశ్శ్వాసమరు, త్కులసుధరావృతముఁ జేఁదికొనుటకు బాళ్వ
గొలుసులఁదీర్చిన పటికపుఁ, గలశంబన నొకతె నాసికామణి యిడియెన్.

గీ. మెఱుఁగుఁదీఁగె తళుక్కన మించు కంధ
రాంచలంబున నుండి శైలాగ్రమునకు
జాఱు నాసారములు వోని సరులు నైచె
నువిదయుఱుతఁ గుచంబుల నొరయ నొర్తు. 167

క. చెలిమో మనుకలువల చెలి, యుంకావళిపేరి రజని సొమ్ముకొనఁ గరం
బులు సాఁచెనో యనంగాఁ, గలికి యొకతె యునిచె బాసికపుఁబూదండల్.

గీ. ముదితయొక్కతెవిధుమణిముకురమెదుట, నిలుపనచ్చటఁదొయ్యలినీడయుదరి
విమలదుగ్ధపయోనిధి వెడలునట్టి, లచ్చిరూపంబు నచటఁ దలంపఁ జేసె.

క. ఈరీతిని ననువిందుకు, మారికఁ గైసేయఁబనిచి మహామూర్తికవా
క్ప్రేరితుఁడై నైదర్భను, హీరమణుఁడు వచ్చి లగ్నమెఱిఁగించుటయున్. 170

ఉ. అండజరాజవాహనసుతాగ్రణి పాండురవర్ణభద్రవే
దండము నెక్కి కల్పకలతాంతసరగ్రథితాతపత్రముల్
నిండిన తారకేందుతతి[3]నింగి ఘటింప మృదంగభేరికా
చండధణంధణధ్వని దిశాకుహరంబుల నాక్రమింపఁగన్. 171

సీ. గంధతైలాపూర్ణకరదీపకోటితో నరనాథమకుటరత్నములు వెలుఁగ
హైమరథోత్కీర్ణ యంత్రపుత్రికలతో వైమానికాంగనావళి నటింపఁ

1. చ - కుముదినీకాంతనలరింపఁగోరి. 2. చ - చెట్టఁగా. 3. చ - తారకేందురుచి.

బ్రసవతోరణరణద్భ్రమరగీతములతోఁ బుణ్యసాధ్వీగానములు సెలంగ
వందివైతాళికవ్రాతసన్నుతులతో యతికృతాశీర్వాదరుతు లెలర్ప
ననఘ శుభవస్తుపూరితకనకపాత్ర, పాలికలతో సువాసినుల్ త్రోల నడువ
నుద్ధవాక్రూరబలముఖ్యయుక్తుఁడగుచు, యదుకులాధీశ్వరుఁడు వెంటనరుగుదేర.
క. అలఘుతరశ్రీఁ గదిసిన, నెలమి నెదుర్కొని విదర్భనృపుఁ డతని పదం
బులు గడిగి భర్గమయని, గ్గలపీఠిక నునిచి యొసఁగె మధుపర్కంబుల్. 173
చ. గవిసెనఁ బూనినట్టిరతికాంతునికార్ముకవల్లియో యనం
బవిరిముసుంగు వెట్టి నలువజ్జఁ జెఱంగులు కూడఁబట్టుచుం
గువలయలోచన ల్చవికకుం గొనితెచ్చిరి వెంట నైదువల్
ధవళముఁ బాడ భోజనసుధావరరాజతనూజ నత్తఱిన్. 174
గీ. కుముదినీచంద్రభానుమధ్యమున నపుడు, తళుకువెన్నెలపగిది బాంధవచకోర
కోటియుప్పొంగ శ్యామానిగుంభనమున, దీపితంబైన వెలిపట్టు తెఱయొసంగె.
ఉ. సంవిదపారగౌరవవిచక్షణు లైనధరాసురేంద్రులే
వంవిధభద్రవేళ శుభవస్తులఁ జేర్కొనుచు "స్వధూవరా
భ్యాంవరదాభవం" తనుచు హర్షమునం బులకాంకురావళీ
సంవృతగాత్రుఁ డైననృపచంద్రున కెంతయు నెచ్చరించుడున్. 176
శా. శ్రీరామార్యమణాత్మజన్మునకు లక్ష్మీనందనాకారరే
ఖారమ్యోజ్జ్వలనూపధేయునకుఁ దత్కన్యాశిరోరత్నముల్
ధారాపూర్వముగా నొసంగె నలవైదర్భుండు కంసారి కం
భోరాశీంద్రుఁడు లచ్చినిచ్చుపగిదిం బూర్ణానుమోదంబునన్. 177
శా. నారీరత్నము చారుహస్తకమలాంతఃకర్ణికా కేసరా
కారంబు ల్గుడజీరకంబు లిడియంగాఁబట్టి మంజీరముల్
గేరన్ గ్రక్కున నిక్కి భర్తతలపైఁ గేల్సాఁచి నిల్పెన్ "ధ్రువం
తేరాజావరుణోధ్రువ" మ్మనుచు ధాత్రీనిర్జరు ల్పల్కఁగన్. 178
క. గాంగేయగాత్రిగళమున, మంగళసూత్రంబుఁగట్టె మాధవసుతుఁ డా
సంగాధిరాజ్యమున కెసఁ, గంగట్టిన తోరణంబు క్రమము దలిర్పన్. 179
మ. చరణంబు ల్దరనత్తమిల్లఁగ నుదంచన్మధ్యనీవీపరి
స్ఫురణ న్నాభి యొకింతదోఁపఁ గుచము ల్పొంగార దోర్మూలభ
ర్గరుచు ల్మించులమించ నించెదలఁబ్రా లాజాస్య తత్సన్నవో
హారతాదర్శన నమ్రుఁడైన పతిపై యత్నానపేక్షంబుగన్. 180

శా. ప్రఖ్యాతాగమ[1]మంత్రరాజములు పైపైఁ గుంభినీదేవతో
ముఖ్యుల్ విన్న వఱుండు తన్మృదుపదాంభోజాతసంస్పర్శఖా
సౌఖ్యశ్రీ నడిపించె సప్తపదము ల్సారంగశాబేక్షణ
"సఖ్యం సాప్తపదీన" మన్పలుకు డెందాన న్విచారించుచుక్. 181

ఉ. రాజతనూజయుక్తయయి రంజిలి వేలిమి వేఁడి వేల్పులో
లాజలు వేల్చె భోజసుత లాలితసాంధ్యగభస్తిఁ దారకా
రాజిఘటింప బాలదినరాజసమేతవిభాతలక్ష్మికిం
దాజతమై ప్రఫుల్లముఖతామరసస్ఫురణంబు మించఁగన్. 182

సీ. దివ్యసేవ్యారుంధతీవసిష్ఠాదిదంపతులు దీవన లిచ్చి రతులఫణితిఁ
బ్రార్థితసాంగవేదాఖిలక్షితిసురోత్తము లభీష్టముగాంచి రమితగరిమ
యదువిదర్భాన్వవాయవిధేయబంధువర్యులు వీళ్లుచదివించి రుచితవృత్తి
మహితోత్సవాయాతబహుదేశరాజచంద్రులు విందులుభుజించి రలఘులీలఁ
బ్రబలగాయకనర్తకపాఠకాద్య, నేకవిద్యాధురీణు లీహితముఁ బడసి
రుర్వి లక్ష్మీశ్వరుఁడు సేయునుత్సవంబు, సకలభువనాద్భుతోన్మేషశాలి గాదె.

క. ఈమాడ్కిన యనువింద, క్ష్మామండలనాథునింట సాత్యకితనయ
గ్రామణిపాణిగ్రహణ మ, హామహితోత్సవము సాంగమై విలసిల్లెన్. 184

ఉ. ఆతఱి రుక్మబాహువిభుఁ డాత్మను తాకరపీడనోత్సవా
యాతసమస్తదేశవసుధాధిపచంద్రుల నంచె సత్క్రియా
జాతవినూతనప్రమదసాంద్రులఁ జేసి యనూనదానవి
ద్యోతితపంచశాఖ విజయోత్సవతేజితపంచశాఖియై. 185

సీ. మణిరాజధరవంశ్యమండనంబునకునీమణులుయోగ్యములంచుఁబ్రణుతిసేయఁ
గరివరావనవిచక్షణసత్కులేంద్రున కర్హంబులీకరు లనిగణింపఁ
హరిమహోదయనూతనాసమహరికి నీహరు లుచితంబులం చభినుతింప
నగణితకాంతాప్రియకుమారమదనున కనుగాపలీకాంత లని తలంప
ననదృశామూల్యరత్నగంధాంధహస్తి
మల్లసామ్రాణికాశ్వరంభానిభాభి
రామరామాతతుల నిచ్చె మామ యహిమ
భానుసమభానునకుఁ జంద్రభానునకును. 186

1. చ - మంత్రనాదములు.

గీ. మఱియు బహువిధరత్నసంపద లొసంగి
యపుడు నిజకన్యఁ బ్రియునింటి కనుపఁదలచి
రాజమణి బుజ్జవమునఁ జేరంగఁబిలిచి
యాదరోదారమృదులవాక్యములఁ బలికె. 187

క. శ్రీభర్త మామ యలస, త్యాభినుతసమాఖ్యయత్తయఁట తత్సేవా
వైభవ మెప్పుడుఁ గలదఁట, నీభాగ్యం బేమిసెప్ప నీరజనయనా. 188

ఉ. చిన్నటనాఁట నీకరకుశేశయముంగని పెద్దలెల్ల లో
కోన్నతదివ్యజాతిమహిమోజ్జ్వలయౌ నని పల్కఁ బల్క నే
డెన్నికకెక్కె సర్వభువనేశ్వరుఁడైన యుపేంద్రు[1] కోడలై
కన్నియ పారిజాతకలికావహనార్హత నీవు గాంచుటన్. 189

గీ. ఇనవిముఖవృత్తి కలనైన నెనయకమ్మ, యెందుదోషాభిముఖ్యంబుఁ జెందకమ్మ
కన్నవారికి నతిచిత్రగరిమగలుగఁ, గుముదిని హితాళులకు విందుఁగూర్పవమ్మ.

క. అని పలికి నృపతి కన్నియ, ననుపమతరవైభవమున ననుపఁ బ్రియసుహృ
ద్వినుతహృదయారవిందుం, డనువిందుఁడు నట్లయనిచె నాత్మజనంతన్. 191

మ. ప్రమదాయుక్తకుమారరత్నములతోఁ బ్రత్యగ్రగంధేభవా
హముహాస్యందనవస్తుసంపదలతో నానందసందీప్తబం
ధుమహీభృన్నివహంబుతోఁ గలిపయాదూరప్రయాణంబులం
గమలానాథుఁడు వచ్చె ద్వారవతికిం గౌతూహలాన్వితుఁడై. 192

క. ఆవేళఁ జంద్రభానుని, దేవేరిం జూచువేడ్కఁ దీపింపఁ బురీ
కేసలమధ్యలు మణిసం, భావితసౌధంబు లెక్కి పలికిరి తమలోన్. 193

చ. పొలఁతుకఁ జూడరమ్మ గడివోవనిచక్కఁదనంబు తెమ్మ చెం
గలువలకోరికాని కయికానిక ముద్దులగుమ్మ నిండుచు
క్కలదొరనిగ్గుతోఁ గరువుగట్టినపుత్తడిబొమ్మ వాసనల్
గలవిరికొమ్మ యిట్టినవలా ననలా యొకబాలపోలునే. 194

చ. తలవలచుట్టివచ్చుఁ గనుఁదమ్ములు తమ్ములు గండుమీలకుం
జళతళవొల్చు నంగముల తావులు తావులుకమ్మపూలకుం
గళతులకించు పెందుఱుముకప్పులు కప్పులుమబ్బురేలకున్
మెలఁతుకగుబ్బచన్నుఁగవమించులు మించులు బొమ్మరాలకున్. 195

---

1. క - కోశ్లవై.

చ. కలువల నేలవే వెడఁదకన్నులు చన్నులు పైఁడికుండలం
గెలువఁగఁజాలవే చికిలికెంజిగి క్రొంజిగురాకు రేకుఁ లేఁ
దళుకులఁ దోలవే మృదుపదమ్ములు [1]దమ్ములునించుచొక్కపుం
వలపులఁబోలవే వదనవాసన లీసునయప్రచారికిన్. 196

సీ. కోకముల్ శశిమ్రోలఁ గూడ లేవనుటెట్లు శశిమ్రోలనిదె కూడెఁ జక్కయుగము
చీఁకటుల్ రవిదీప్తిఁ జేరలేవనుటెట్లు రవిదీప్తినిదె చేరెఁ బ్రబలతమము
అళులు సంపెఁగలచెంతలఁ జేర వనుటెట్లు సంపెంగ నిదె చేరె షట్పదములు
కమలము ల్కరికేలఁ గడునొప్ప వనుటెట్లు కరికేల నిదె యొప్పె సరసిజములు
నాననము చన్నుగవయు సీమంతమణియుఁ
దుఱుము నాసయుఁ గనుదోయి తొడలు చరణ
పల్లవంబులు సనుపేరఁ బరిఢవిల్లెఁ
జూడరే యింతు లిదియెంత చోద్య మరయ. 197

చ. అని పొగడ న్యదుప్రవరుఁ డాత్మకుమారుల నానవాళ్లలోఁ
చనల గృహప్రవేశశుభసంపదఁ బెంపువహింపఁజేయు వా
రును గురుదేవతాభజనరూపమహోచరణం బొనర్చి త
ద్ఘనతరభద్రసూక్తుల సుఖస్థితిఁ గాంచిరి రంత నొక్కెడన్. 198

సీ. [2]వరుల నెంతయుఁ బెన్నువలఁ దేల్చుప్రతిమలకురువిదూరజరుచుల్ గిరులుగాఁగఁ
జెలువలమ్రోల దేశినటించు ప్రతిమల [3]కరుణాశ్రితప్రదీప్తిపాళ్ళిగాఁగ
రమణులతో వసంతములాడుప్రతిమల కలశయుద్రమురీచి కోలనుగాఁగఁ
గొంతులనవ్యసంగతికుల్కు ప్రతిమల కింద్రనీలచ్ఛాయ లిరులుగాఁగ
నధిపుల వరించుప్రతిమల కమితహారిత
మణిగభస్తులు దూర్వాంకమాల్యములుగ
నొనరు కేళీగృహంబున నున్నయయ్యె
దూద్వహకుమారకుని యుల్ల ముల్లసిల్ల. 199

క. కడుఁ బ్రార్థింపఁగఁ దగుజను, లడుగడుగున కెత్తులిడఁగ నలఁతిదివియఁగా
వెడవిల్తుతేరు నడచిన, వడువున సతివచ్చెఁ గనకసన్నాహృత గ్రాం. 200

చ. వనితలచాటునన్ శుభనివాసముసొచ్చి మఱుంగుచేరిని
ల్చినయది గావునం దరలలేమి యధీశునిమ్రోల సిగ్గునం

1. క - దేహమునిండుకాంతితో. 2. క - వరులచెన్కలఁ శయ్యలబల్ప. 3. క - కరుణా
బింభోళికలుగాఁగ.

జనకుఁడటంచు నానయిడఁ జాలమిఁ గన్యక కన్నుసన్నలం
బెనఁగఁగఁ గార్యగౌరవము పేరున నేగిరి బోటులవ్వేడన్. 201

సీ. రాజమండలజయప్రౌఢిఁ బెంపొందు నీవదనాబ్జ మున్నతిఁ బొదలఁదగదె
యతనుకళాగూఢి నడరునీకనుదోయి నవదర్శనశ్రీ లొనర్పఁదగదె
సరసపారసరాగసంపత్తి నలరు నీనునుమోవి మినుకుల నునుపఁదగదె
పటుగిరీశఖ్యాతిఁ బరఁగునీకుచయుగ్మ మపగతాంబరవృత్తి నమరఁదగదె
మృదులతాలక్ష్మి నెసఁగునీ[1] మేనదీయ
వాంఛితఫలార్పణంబున వఱలఁదగదె
యనుచు సతిమంజులోక్తుల ననునయించి
సమధికోత్కలికాంచితస్వాంతుఁ డగుచు. 202

చ. అనుగుణరాగసంఘటన మాఱడిచెందకయుండ శోభనాం
కనుకరప్రవాళరుచిఁ గాసిలకుండ గ్రహించి యొయ్యనా
య్యనఁగలభాషిణిం దిగిచి యంకము సేర్చి ప్రవీణుఁ డాతఁడిం
పున సడలించెఁ గంచుకము బోరనమించె నలంక్రియారుచుల్. 203

శా. భావోజ్జృంభణము ప్రసాదయపరీపాకంబు నవ్యధ్వని
శ్రీవిస్ఫూర్తియు మించె నాతిదృఢసంశ్లేషైకబంధాప్తితో
నానైసర్గ్య ప్రసన్నవృత్తి మృదుశయ్యం గూర్చి సా[illegible]త్యము
ద్భావిర్భావధురీణుఁ డై యలరె సత్యానందనుం డింతయున్. 204

సీ. రత్నహర్మ్యముల జంత్రపుబొమ్మలనుఁగుచెయ్వులొనర్పఁగాఁ బుట్టునొక్కకినుక
సనవసంబులఁ దీవలివురుకేల్సాఁచి శుకోక్తిఁ బిల్వఁగఁ బుట్టు నొక్కకినుక
కేళీగిరుల నభ్రపాళీతటిద్రేఖ లొఱపుచూపఁగఁ బుట్టు నొక్కకినుక
దీర్ఘికాంతములఁ బద్మినులు తుమ్మెదచూపు లొనరింపఁగాఁ బుట్టు నొక్కకినుక
తక్కఁ దక్కనకినుకలఁ జిక్కువడని
మమతలఁదలంపు లీడేర్చుకుముదినీవి
శాలలోచనఁ దాఁగూడి చంద్రభానుఁ
డనుపమానందసామ్రాజ్య మనుభవించె. 205

శా. ఈమాడ్కిం గుముదిన్యరాళగమనాహేలామహోల్లాసియై
భామాసందనుఁ డొక్కనాఁడు హరియుం బ్రద్యుమ్నుఁడు న్మెచ్చ వీ

1. చ - కనుమదభి.

ణామానిం బచరించి తుంబురునివల్లం గన్నగాంధర్వవి
ద్యామాహాత్మ్యముఁ జూపి [1]శౌరిసుతుఁడై తాల్చెం గృతార్థత్వముల్. 206

మ. వితతధ్యానమదాలసాతనయనిర్విద్రాయవిద్రాయస
తతశంకాకరభక్తశోభనవిరాజన్మాయజన్మాయతి
ద్యుతికామప్రతిసంఘసంఘటితయోగోపాయ గోపాయనో
ద్యతమూర్తాస్మదఖండభాగ్యసముదాయచ్ఛాయ యచ్ఛాయనా. 207

క. విశ్వనుతశశ్వదణిమా, ద్యైశ్వర్యవిశేషధుర్య యఘపావనపా
దశ్వధికవర్య సాధో, ద్విశ్వంభరతాకృతార్యవిస్మయచర్యా. 208

భుజంగప్రయాతము. భవాద్యాభిగద్యా త్మపద్యాసపద్యా
నవాధ్యాత్మవిద్యానిషద్యా ప్రవేద్యా
యవిద్యార్తివైద్యాయవిద్యాయహృద్యా
భవోద్యానపద్యాభవద్యాంబుపద్యా.

గద్యము. ఇది శ్రీమద్దత్తాత్రేయయోగీంద్రచంద్రచరణారవింద [illegible]
దిత సరసకవితారసోదాత్త దత్తనామ్యసోదర్య [illegible]
చంద్రభానుచరిత్రం బను మహాప్రబంధంబున [illegible] సర్వంబును పంచమా
శ్వాసము.



1. వ - శర్వసుతుఁడై.